అపరాధ పరిశోధన అనుబంధం—160

# మూడు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## కట్టి విడిచిన పట్టుచీర

రచన: వసుంధర

## చావు దెబ్బ

రచన: కె.వి.వి. సత్యనారాయణరాజు

## వజ్ర కిరీటం

రచన: వి. యస్. రావ్

అన్వేషణ - పదవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—160
ఏప్రిల్, 1987
వెల: రు. 7-50
ఏడాది చందా: 90 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
ఏ. వీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
వి. యస్. రావ్
సుంకరి రాంప్రసాద్
విద్వాన్ పీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64848

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# కట్టి విడిచిన పట్టుచీర

వసుంధర

సాయంత్రం ఆరయింది.

శీతాకాలం కావడంవల్ల అప్పుడే బీచిదగ్గర చీకటిగా వుంది.

పున్నమి వెన్నెల సముద్రంలో అందంగా ప్రతిఫలిస్తోంది.

"ఈరోజి కిక్కడే వుండిపోదాం—" అన్నాడు శాస్త్రి.

"మరి భోజనం?" అన్నాడు శర్మ.

"నాకు పిడతకింద పప్పుతోటే కడుపు నిండిపోయింది" అన్నాడు శాస్త్రి. అతడి చేతిలో యింకా ఆ పొట్లముంది.

"ఇప్పుడలాగే అనిపిస్తుంది. ఓ గంట పోయాక ఆకలేస్తుంది—"

"ఆకలేస్తుందని బెంగెందుకు? ఇప్పుడు మన దగ్గర డబ్బులేదు కనుకనా?" అన్నాడు శాస్త్రి.

"మనం వర్తమానం చూసి తృప్తిచెందడంవల్లనే భవిష్యత్తులో ఏడుస్తున్నాం—" అన్నాడు శర్మ.

"మనిషి జీవించేది భవిష్యత్తులో కాదు. వర్తమానంలో!"

"ఈ క్షణంలో వర్తమానం భవిష్యత్తులో గతం. మనిషి బ్రతికేది వర్తమానంకోసం కాదు. భవిష్యత్తుకోసం...."

"ఇంతకీ భవిష్యత్తులో నీకేం కావాలో చెప్పు!"

"ఈ పున్నమి వెన్నెలలో బీచివద్ద నీవు నేనూ, నావు నువ్వూ జంటగా ఉండడంవల్ల ఈ వర్తమానం గతంగా మారితేనే మంచిదనిపిస్తోంది. ఆ గతాన్ని భవిష్యత్తులోకూడా తల్చుకోకూడదనిపిస్తోంది—" అన్నాడు శర్మ.

"ఈరోజు నీకేదో అయింది—" అన్నాడు శాస్త్రి.

"శాస్త్రీ! మనంకూడా ఇలా ఎన్నాళ్ళు అగమ్మకాకుల్లా తిరుగుతాం. పెళ్ళిచేసుకుందాం. బ్రతుకు బాట ఏర్పాటు చేసుకుందాం—" అన్నాడు శర్మ.

"నువ్వు పెళ్ళి చేసుకుంటానంటే వద్దన్నానా?" అన్నాడు శాస్త్రి.

"సుఖమైనా కష్టమైనా మనం జంటగా అనుభవించాలి—"

"అలాగనకు. అది భారత యుద్ధకాలంలోనే విచిత్రంగా చెప్పబడింది. అంత పెద్ద మహాభారతంలో ఒక్క ద్రౌపదికి తప్ప ఏ స్త్రీకీ ఒకరుమించి భర్తలు లేరు—" అన్నాడు శాస్త్రి.

"ఛా—నా ఉద్దేశ్యమది కాదు. నువ్వూ నేనుకూడా వేర్వేరు అమ్మాయిల్ని పెళ్ళిచేసుకుందాం-"

"పెళ్ళికిముందు జీవితంలో స్థిరపడాలి కదా!" అన్నాడు శాస్త్రి.

"పెళ్ళయితేగానీ మనం స్థిరపడలేం! భార్యలు మన తత్వాన్ని మార్చుతారు—" అన్నాడు శర్మ.

"అయితే సరే—నువ్వో పిల్లను చేసుకో. నాకో పిల్లను చూసి పెట్టు—"

"చూడ్డం అయింది—"

"ఎవరు?"

"మన వీధిలోనే వుంటున్నారు సోమయాజులుగారు. ఆయనకిప్పుడు రెండో పెళ్ళాం. ఆమె వయసు పాతిక్కి లోపే!"

"అయితే మాత్రం — పెళ్ళయిన వాళ్ళను చేసుకుంటామా? నలుగురూ మన ముఖం మీద ఉమ్మేస్తారు.."

"వెధవ జోకులు వేయకు. నేను నీకు చెప్పేది సోమయాజులుగారి పెద్ద భార్య కూతుళ్ళ గురించి ..."

"ఎవరు వాళ్ళు?"

"అమల—విమల—"

"పేర్లు బాగున్నాయి. కానీ ....?"

"ఊఁ, నీ సందేహమేమిటో చెప్పు..."

"మనుషులు బాగుంటారా?"

"ఆడపిల్లలకు వయసు వంద వంకర్లు తీసుకుందంటారు. వీళ్ళ శరీరాలకు వంకరలే అందాన్నిచ్చాయి—"

"అంటే—పోలియో వచ్చిందా?"

శర్మ చిరాగ్గా-"అసలు ముందు పెళ్ళి నీకే అర్జంటు. నీ వెధవ జోకులు పెళ్ళాంతప్ప వేరెవ్వరూ భరించలేరు" అన్నాడు.

"మరి వంకర అంటే ఏమిటి?"

"బాపూ బొమ్మ చూశావుగదా— ఆడపిల్ల బొమ్మకు వంకరలే అందం. ఏ వంకర్లూ లేనిపిల్ల సిలిండర్లా ఉంటుంది—....."

"ఓహో— నాకది తట్టనేలేదు.... అయినా నువ్వింత కవితాధోరణిలో మాట్లాడతావని నాకేం తెలుసు? బొత్తిగా సెన్సాఫ్ హ్యూమర్ లేని నువ్వీరోజున ఇలా మాట్లాడుతున్నావంటే నిజంగా నే యిది పెద్ద విశేషం... అది సరేకానీ వాళ్ళను నేనెప్పుడూ చూడలేదు. నువ్వెలా చూశావూ?" అన్నాడు శాస్త్రి.

"నువ్వ్యా చూసివుండేవాడివి నీలో సౌందర్య దృష్టి ఉంటే?"

శాస్త్రి సాలోచనగా—"అందమైన ఆడపిల్ల కనబడితే అప్రయత్నంగా నా దృష్టి అటే మళ్ళుతుంది. వాళ్ళు నిజంగా అందమైన వాళ్ళేనా?" అన్నాడు.

"నువ్వు ముందు అందాన్ని చూడవు. మెరిసే చీరనో, గుబాళించే సెంటు పరిమళాన్నో గమనించి ఆ తర్వాత మనిషిని చూస్తావు. సవతితల్లి ఆధ్వర్యంలో పెరుగుతున్న యీ పిల్లలు మంచి బట్ట కట్టుకోరు. చూడ్డానికి పని మనుషుల్లా కనిపిస్తారు. ఇంటి పనీ, బయట పనీ వాళ్ళే చేయాలి. ఓసారిద్దరూకలిసి ఇరవై కేజీల బరువు సంచీలు పట్టుకుని వస్తూంటే నేను సాయం చేశాను...."

"ఇంతకీ నీకు వాళ్ళెలా పరిచయమయ్యారు?"

"ఆలోచించి చూడు...."

శాస్త్రి వెంటనే—"ఓహో— నువ్వు వాళ్ళింట్లో ప్రయివేటు చెబుతున్నావు కదూ!" అన్నాడు.

"అవును—రోజూ సాయంత్రం ఆరునుంచి ఏడుదాకా సోమయాజులుగారి బావమరిదికి ప్రయివేటు. ఇనాది

వారాలు సెలవు. ఈరోజు శనివారం...."

"ఆ యింట్లో నాకు ప్రత్యేకమైన ఆకర్షణేదీ కనపడక ప్రయివేటుకొప్పుకోలేను. నువ్వొప్పుకున్నావు...."

"ఆకర్షణ నీకేం కనబడుతుంది? సోమయాజులుగారి భార్య వయసు పాతిక్కిలోపే అయినా మనిషి యాభై ఏళ్ళదానిలా ప్రవర్తిస్తుంది. గోచీపోసి ఏడుగజాలచీర కడుతుంది. రూపాయకాసంత బొట్టు పెడుతుంది. ఇరవై నాలుగ్గంటలూ పూజలూ, స్నానాలూ! నిన్నూ నన్నూ బాబూ అని పలకరిస్తుంది. మనదేశపు ఆడవాళ్ళు పెళ్ళి కాగానే ముసలివాళ్ళయిపోతారు. విదేశాల్లో ఆడవాళ్ళు ముసలితనంలోకూడా పెళ్ళిళ్లు చేసుకుంటారు. ఏమైతేనేం ఆ యింట్లో నీకాకర్షణలేదు...."

"నీకుంది కాబట్టి చేరావు. ఇంతకీ ఆ పిల్లలతో పరిచయమెలాగయింది నీకు? సరుకులు మోసినప్పుడేనా?"

"కాదు. ఆ పిల్లలిద్దరూ ప్రయివేటుగా ఇంటర్మీడియెట్‌కు కడుతున్నారు. సోమయాజులుగారి బావమరిదికి పాఠం చెబుతూంటే యేవో సందేహాలు తీర్చుకుందుకు నా దగ్గరకు వస్తూండేవారు...."

"అంటే వాళ్ళు నిన్ను వలలో వేసుకున్నారన్న మాట...."

"వాళ్ళకు మగాళ్ళతో మాట్లాడ్డానికే మొహమాటం. చాలా మంచిపిల్లలు. అసలు సంగతి తెలిస్తే నువ్వు తెల్లబోతావు.... వాళ్ళ సవతితల్లి మనగురించి ఆరా తీసింది. అన్నీ తెలుసుకున్నాక నే నన్ను తన తమ్ముడికి ప్రయివేటు మాస్టర్ని చేసింది. ఆ కుర్రాడు చాలా తెలివైనవాడు. నిజానికి వాడికి ప్రయివేటు అవసరంలేదు."

"అంటే?"

"ఇంకా అర్థం కాలేదా? నేనా పిల్లల్లో ఒకర్ని ప్రేమించి పెళ్ళి చేసుకుంటానని ఆ తల్లి ఆశ...."

"ఆ ఆశను నువ్వు నిజం చేస్తున్నావు...."

"నువ్వూ చేస్తావు...." అన్నాడు శర్మ.

"నీకెలా తెలుసు?"

"శేషు ప్రయివేటు చెప్పడానికి నువ్వూ రా!"

"నేను రాను..."

"వచ్చితీరాలి...."

"ఏమిటీ జబర్దస్తీ....?"

"నీ మంచి నీకు తెలియనప్పుడు ఇద్దరిలో కాస్త పెద్ద వాణ్ణిగా నేను కాస్త జబర్దస్తీ చేయక తప్పదు...."

"అరే—హఠాత్తుగా నువ్వు పెద్దవాడివై పోయావే-కారణమేమిటి?"

"ఆ అమ్మాయిలిద్దరిలో అమల పెద్దది. అమలను నేను ప్రేమిస్తున్నాను...." అన్నాడు శర్మ మొహమాట పడుతూ.

"అంటే విమలను నేను ప్రేమించాలన్న మాట.... ఒకవిధంగా నిన్ను మెచ్చుకోవాలి. ఇద్దరిలో చిన్నపిల్లనే వదిలినందుకు...."

"పేరుకే వాళ్ళు చిన్నా పెద్దా.... వాళ్ళిద్దరూ కవలలు...."

శాస్త్రి తెల్లబోయి—"అయితే నేనీ ప్రేమకు ఒప్పుకోను. ఇందులో నీ స్వార్థమేదో ఉంది. నువ్వు వాళ్ళిద్దర్నీ వలలో వేసుకొని—ఒకర్ని పెళ్ళిచేసుకొని ఇంకొకర్ని నాకు అంటగట్టాలనుకుంటున్నావు—" అన్నాడు.

"ఏడిసినట్లుంది—ఇన్నేళ్ళ మన స్నేహాన్ని దానుస్వార్థం

చేసుకున్నది!"

"మన స్నేహాన్ని నేనన్ని విషయాల్లోనూ నమ్ముతాను. ఆడవాళ్ళ విషయంలో మాత్రం కాదు. వాళ్ళిద్దరూ ఒక్కలాగే ఉంటే ఎవరెవరో తెలియక నే నిబ్బంది పడాలి. తొలినుంచీ పరిచయమున్న నీవు నన్ను మోసం చేసే అవకాశముంది."

శర్మనవ్వి—"అదా నీ అనుమానం! అక్కచెల్లెళ్ళిద్దరూ అందంలో ఒకరికొకరు తీసిపోరు. కానీ పోలికల్లో ఎవరికి వారే! ఒకే తల్లిబిడ్డలని చెబితే నమ్మడం కష్టం...." అన్నాడు.

"అయితే సరే—రేపు నేనూ వస్తాను ప్రయివేటుకి. అప్పుడేం జరుగుతుంది?"

"గదిలో సోమయాజులుగారి బావమరది ఉంటాడు. అమల, విమల ప్రవేశించగానే నువ్వు విమలతో మాట్లాడు. నేను అమలతో మాట్లాడుతాను. సోమయాజులుగారి బావమరిది గదిమధ్యలో తన పాఠాలు తను చదువుకుంటాడు. ఆడపిల్లలు తమ కష్టం సుఖం నీతోటీ నాతోటీ చెప్పుకుంటారు...."

"వాళ్ళకు మగాళ్ళతో మాట్లాడడమంటే భయమన్నావు...."

"భయమే — కానీ సవతితల్లి పోరుతూంటే ఏం చేస్తారు? వాళ్ళ పెళ్ళి కుదర్చడానికామె యీ మార్గం తప్ప ఇంకేవీ ఆలోచించదు...."

"సరే — నీమాటమీద వస్తున్నాను. కానీ నీవు ముందుగా మాటివ్వాలేవు—" అన్నాడు శాస్త్రి గంభీరంగా.

"నాకు తెలుసు-వచ్చే పున్నమికి మనమిక్కడే జంటలుగా విడివిడిగా కూర్చుంటామని!" అన్నాడు శర్మ.

## 2

సోమయాజులుగారి బావమరిది ప్రభాకరం పెన్నారు బోర్డు మెంబర్లా గదిమధ్యలో బరకంమీద కూర్చుని లెక్కలు చేసుకుంటున్నాడు.

అతడికి కుడిపక్క కాస్త దూరంగా శాస్త్రి, విమల..

విమల అందంగా, అమాయకంగా వుంది. ఆమె శరీర ఛాయ మెరుగుపెట్టని బంగారంలా వుంది.

ఆమె మాట్లాడుతూంటే పెద్ద పెద్ద కళ్ళు చక్రాల్లా తిరుగుతున్నాయి.

శాస్త్రి చాలాసేపు ఆమెనే చూస్తూ మాటలు వినడంలేదు.

విమల తన కష్టాలు చెప్పుకుంటోంది.

ఆమె అంట్లు తోమాలి. ఇల్లూడ్వాలి. బట్టలుతకాలి. కూరలు, సరుకులు తేవాలి!

ఆమె మంచి బట్టలు కట్టుకోకూడదు. పౌడరు రాసుకోకూడదు. ప్రత్యేకంగా అలంకరించుకోకూడదు.

ఇవన్నీ ఆ యింట్లో శిలాశాసనాలు.

శాస్త్రికామె మాటలు లీలగా వినబడుతున్నాయి. భావం మనసుకంటడంలేదు. చూపులామెను గమనిస్తున్నాయి. తనువు పరవశిస్తోంది.

"మీరు నా మాటలు వినడంలేదు...." అంది విమల.

శాస్త్రి ఉలిక్కిపడి "వింటున్నాను—" అన్నాడు.

"అయితే నా కష్టాలు మిమ్మల్ని కదిలించలేదు.."

"కదిలించాయి...."

"కదిలిస్తే కంట తడిపెట్టరేం? కనీసం ఓ సానుభూతి

మాటైనా చెప్పరేం?" అంది విమల.

"ఏడ్చే మగాణ్ణీ నవ్వే ఆడదాన్నీ నమ్మకూడదంటారు...." అన్నాడు శాస్త్రి.

"కష్టసుఖాలు మనిషిని కదిలిస్తే సామెతలు గుర్తుండవుట. మా నాన్న అమ్మను తల్చుకుని ఏడ్చినపుడల్లా ఈ మాటే అంటాడు...." అంది విమల.

"పురుషోత్తముడు దేనికీ చలించడు.... నేను సామాన్యుణ్ణి కాదు...." అన్నాడు శాస్త్రి వెంటనే.

"పోనీ సానుభూతిగా ఓ మాట చెప్పవచ్చుగా...." అంది విమల.

"అవును .... పాపం నీ కష్టాలన్నీ పెళ్ళితోటే తీరాలి..."

"నా పెళ్ళి అంత సులభంకాదు. నాన్న కట్నమివ్వలేడు...."

"ఇవ్వలేనంటే ఎలా కుదుర్తుంది? ఎంతో కొంతైనా ఇచ్చుకోక తప్పదుకదా!"

విమల నిట్టూర్చి-"ఎదురుకట్నమిచ్చే విధవకే నన్నిచ్చి పెళ్ళి చేస్తానంటుంది పిన్ని—" అంది.

"ఎదురుకట్నం తీసుకుంటూ విధవకూడా అనడమెందుకు?" అన్నాడు శాస్త్రి కాస్త యిబ్బందిగా.

"ఎందుకంటే—ఎదురుకట్నం విధవలే యిస్తారుట!"

"నీవంటి ఆడపిల్లల కిలాంటి అభిప్రాయమేర్పడడం స్త్రీ జాతికే దురదృష్టం—విధవలని తెలిసీ—వాళ్ళనే పెళ్ళి చేసుకోడమెందుకు?'

"మా పిన్ని నన్ను విధవకే కట్టబెడతానంటోంది.."

"అంటే...."

"నన్ను పెళ్ళిచేసుకునేవాడు తనో విధవనని బుజావు

చేసుకోవాలి...."

"కాబోయే భార్య తన్ను వెధకోవనువాలని ఏ వెధవా అనుకోడు...."

విమల అందంగా నవ్వి .... "ఎదురు కట్నమిచ్చిన వాడిని వెధవ అని యే భార్యా అనుకోదు. నేనిందాకా చెప్పింది మా పిన్ని అభిప్రాయం...." అంది.

ఆమె నవ్వుకు శాస్త్రి పులకరించిపోతూ— "మరి నీ అభిప్రాయమేమిటి?" అన్నాడు.

"కాబోయే భర్త నన్ను పెళ్ళికిముందే ప్రేమించాలి. నా ప్రేమను పొందడం కోసం ఓ గొప్ప కానుక ఇవ్వాలి. అప్పుడు నేనతడి ప్రేమ నంగీకరిస్తాను...."

"గొప్ప కానుక అంటే ఏమిటి?"

"పట్టుచీర...."

శాస్త్రి నవ్వి — "చాలా సింపుల్ కోరిక నీది!" అన్నాడు.

"నా కోరిక సింపుల్ కాదు...."

"నీకు సింపుల్ కాకపోవచ్చు. నా కది చాలా సింపుల్...."

"నిజంగా?" అంది విమల ఆశ్చర్యంగా "ఆ పట్టుచీర ఎక్కడుందో కూడా మీకు తెలుసా?"

"ఈ ఊరి మొత్తానికి పట్టుచీరలు మంచి వెక్కడ దొరుకుతాయో నాకు తెలుసు. దుకాణం పేరు చెప్పను. తెచ్చి చూపిస్తాను" అన్నాడు శాస్త్రి.

"నాక్కావలసిన పట్టుచీర దుకాణంలో లేదు...."

"మరెక్కడుంది?"

"వెంకటేశ్వర్రావుగారింట్లో!"

"అక్కడెందుకుంది?"

"ఆ పట్టుచీర మా అమ్మది. ఒకసారి డబ్బవసరమై నాన్న దాన్ని వెంకటేశ్వర్రావుగారికి తాకట్టు పెట్టాడు. ఆయన వడ్డీ వ్యాపారి. అమ్మకా పట్టుచీరంటే ప్రాణం. నాకూ అదంటే ఎంతో యిష్టం. ఆ చీర ఎప్పుడూ కొత్తగా కనబడుతుంది. అప్పుడే దుకాణంలోంచి తెచ్చామా అనిపిస్తుంది. అమ్మ ఆ చీర నా పెళ్ళికిచ్చేస్తానని చెప్పింది. కానీ" విమల ఒక్క క్షణం ఆగి కళ్ళు తుడుచుకుంది "చీర విడిపించి తెచ్చేలోగానే అమ్మ చచ్చిపోయింది. తర్వాత పిన్ని వచ్చింది. పట్టుచీర గురించి ఎన్నోసార్లు నాన్నకు చెప్పాను. నాన్నకు పిన్నిని నొప్పించాలంటే భయం. ఆ పట్టుచీరను విడిపించడం పిన్నికిష్టంలేదు. అదీకాక వడ్డీ బాగా ఎక్కువయింది.... ఆ ధర పెడితే రెండు పట్టుచీరలు వస్తాయిట...."

"అయితే పట్టుచీర వెంకటేశ్వర్రావు గారింట్లో వుందన్న మాట. నా కాయన ఇంటి అడ్రసు కావాలి.."

"ఎందుకు?"

"నేనా పట్టుచీర తెస్తాను!"

"మీరు నన్ను ప్రేమిస్తున్నారా?" అంది విమల చటుక్కున.

"అలా ఎందుకనుకుంటున్నావు!" అన్నాడు శాస్త్రి ఆశ్చర్యంగా.

"మీరు పట్టుచీర తెస్తానన్నారుగా!"

శాస్త్రి తడబడి "నిజమే! అది నీకు ప్రేమ కానుక అవుతుంది. నేనే గనుక ఆ చీరను ప్రేమకానుకగా ఇస్తే నువ్వు నన్ను ప్రేమిస్తావా?" అన్నాడు.

విమల చటుక్కున "మిమ్మల్ని ప్రేమించడానికి పట్టుచీర తేనక్కర్లేదు. నన్ను ప్రేమించను కూడా అక్క-

ల్లేదు. ప్రేమిస్తున్నానని ఒక్క మాట అన్నారు కదా అది చాలు" అంది.

అప్రయత్నంగా శాస్త్రి కళ్ళలో నీళ్ళు తిరిగాయి. అతడామెను ప్రేమిస్తున్నానని అన్నాడో లేదో అతడికే గుర్తులేదు. కానీ కళ్ళు తుడుచుకుంటూ "విమలా! నువ్వు నన్ను ప్రేమించినప్పటికీ—నీకు ప్రేమ కానుక యిచ్చినాకనే నీ ప్రేమకు అర్హుణ్ణనిపించుకుంటాను. నీ కోరిక యింత సింపుల్ గా వున్నప్పుడు—నే నామాత్రం చేయాలి" అన్నాడతడు.

ఆమె కోరిక అంత సింపుల్ కాదని అప్పు డతడికి తెలియదు.

అదే సమయంలో ప్రభాకరానికి ఎడమ పక్కగా కాస్త దూరంలో అమల కూడా శర్మను పట్టుచీర కాక పోయినా అలాంటిదే యింకో కోరిక కోరింది.

శర్మ కూడా అది సింపులేనని పొరబడి మాట ఇచ్చాడు.

# 3

గదిలో ఎదురెదురు కుర్చీల్లో కూర్చున్నారు శాస్త్రి, శర్మ.

"అమలకు పెద్ద కోరిక లేమీ లేవు. ఎనిమిదేళ్ళ క్రితం సోమయాజులుగారు తనకున్న రెండిళ్ళలో ఒకటమ్మే శాడు. అది చెంగల్రావు పేటలో వుంది. పెళ్ళైతే ఆ యింట్లో కాపురం పెట్టాలనుంది అమలకు. ఆ యిల్లంటే వాళ్ళమ్మకెంతో యిష్టంట...."

"అమల కంటే విమలే నయం. పట్టుచీరతో సరిపెట్టు కుంది...."

"ఇల్లు నేను కొనక్కర్లేదు. అద్దెకు సంపాదిస్తే

చాలు...."

"ఇంటి గురించి వాకబు చేశావా?"

"ఇప్పుడే ప్రారంభించాలి."

"మరి ఇన్నాళ్ళనుంచీ ఏం చేస్తున్నావు?"

"ఇంతవరకూ నేను అమలతో పెళ్ళి కబురు మాట్లాడలేదు. మన్నిద్దరి పెళ్ళిళ్ళూ ఒక్కసారే జరగాలి. అమల, విమల మనకు సరైన జోడీ అనిపించింది...."

"గతంలో కూడా ఒకసారి గుర్తుందా?" అన్నాడు శాస్త్రి.

"అది వేరు. వాళ్ళు మనపై ప్రయోగించబడ్డారు.... వీళ్ళు అసలు సిసలు సంసారపక్షం అమ్మాయిలు."

"వాళ్ళ సంగతి సరే....మనం సంసారపక్షమేనా అని!"

"పెళ్ళి చేసుకునే ముందు ప్రేమకానుకలిస్తే మనమూ సంసారపక్షమే అవుతాం" అన్నాడు శర్మ.

"అలాంటి వాళ్ళను వెధవలంటుంది సోమయాజులు భార్య."

"అంటే అనుకోనీ మనకేమి నష్టం?"

"నిజంగా మనం వెధవలమే ననిపిస్తోంది. లేకుంటే ఇంతవరకూ మనకు పిల్లనిస్తామంటూ ఎవరైనా వచ్చారా?"

"బాధపడకు—నవ్విన ఊళ్ళే పట్నాలవుతాయి...." అన్నాడు శర్మ.

"కానీ మనం పట్నంలోనే వున్నాం."

"శాస్త్రీ! నిరాశ మనకు తగదు."

"పెళ్ళి గురించి తల్చుకోగానే నిరాశ మొదలయింది. పెళ్ళైతే యింకెలా మారిపోతామో—మనకు పెళ్ళిళ్ళు

వద్దు."

"పుట్టిన ప్రతి మనిషికీ చావెలా తప్పదో పెళ్ళి కూడా అలాగే తప్పదు."

"చావును తప్పించుకోలేం. పెళ్ళిని తప్పించుకో గలం."

"పెళ్ళినీ తప్పించుకోలేం. అమలను తల్చుకుంటే ఆమె లేకుండా యింతకాలం యెలా బ్రతికామా అనిపిస్తోంది. ...."

అప్రయత్నంగా శాస్త్రికి విమల గుర్తుకొచ్చింది. అతను లేచి నిలబడి — "పద — ముత్యాలవానిపాలెం వెడదాం" అన్నాడు.

"అక్కడి కెందుకూ?"

"వెంకటేశ్వర్రావ్ విల్లక్కడే వుంది."

"ముత్యాలవాని పాలెంలో వడ్డీ వ్యాపారులా! ఆశ్చర్యంగా వుందే!"

"తర్వాత తీరిగ్గా ఆశ్చర్యపడవచ్చు. ముందు లే...."

"అయితే ముందు చెంగల్రావు పేట వెళ్ళి యింటి సంగతి వాకబు చేద్దాం. ముత్యాలవాని పాలెం బాగా దూరం కదా. రేపు వెళ్ళవచ్చు."

"మనిషి గ్రహాంతరయానాలు చేస్తున్న ఈ రోజుల్లో ముత్యాలవాని పాలెం దూరమంటావా? అవమానం కదూ!"

"వాళ్ళకు రాకెట్లున్నాయి. మనకు సైకిలు కూడా లేదు."

"సైకిలంటే గుర్తు కొచ్చింది. రాజారా విప్పుడూళ్ళో లేడు. అతడు గ్యారేజి తాళం మనకిచ్చి అప్పుడప్పుడు మోటారు సైకిలు కో కిక్కివ్వ మన్నాడు

గుర్తుందా!" అన్నాడు శాస్త్రి.

శర్మ చటుక్కున లేచి నిలబడి "నీ బుర్ర అమోఘం. పద....మన మిప్పుడు ముత్యాలవాని పాలెమూ వెళ్ళవచ్చు, చెంగల్రావు పేటా వెళ్ళవచ్చు. కానీ ముందు చెంగల్రావు పేటే వెడదాం. అక్కడ పని చూసుకుని ముత్యాలవాని పాలెం వెడదాం. ఎందుకంటే వడ్డీవ్యాపారు లెప్పుడూ తిన్నగా నిద్రపోరు. ఎప్పుడు వెళ్ళినా లేస్తారు. ఇళ్ళద్దె కిచ్చేవాళ్ళలా కాదు" అన్నాడు.

ఏ కళనున్నాడో శాస్త్రి అంగీకరించాడు.

## 4

మోటారుసైకి లా యింటి ముందు ఆగింది.

ఇంటి చుట్టూ గోడ. గోడలో ఓ చిన్న తలుపు. తలుపుకు గడియ లేదు. తోయగానే తెరుచుకుంది.

లోపల చాలా ఆవరణ వుంది.

ఎందుకైనా మంచిదని శాస్త్రి, శర్మ మోటారు సైకిలు గుమ్మంలోంచీ లోపలకు తోసుకు వెళ్ళారు.

శాస్త్రి తలుపు దగ్గరగా వేసి గొళ్ళెం కూడా పెట్టాడు.

ఇంట్లో ఎక్కడా అలికిడి లేదు.

శర్మ టైము చూసుకుని "ఇంకా ఎనిమిదే అయింది" అన్నాడు.

"ఇళ్ళున్న వాళ్ళంతే. హాయిగా నిద్రపోతారు—ఏ సమయంలోనైనా" అంటూ శాస్త్రి ముందడుగు వేశాడు.

అది డాబా యిల్లు. వాటా పెద్దదే. ఆధునికంగా వుంది. ముందుగా మూడు మెట్లెక్కితే నడవలా వుంది.

నడవ కెదురుగా రెండు గుమ్మాలు. అటూ ఇటూ రెండు గుమ్మాలు. అందులో మూడు గుమ్మాలకు తాళా లున్నాయి. ఓ గుమ్మానికి తాళంలేదు.

శాస్త్రి తాళంలేని గుమ్మం దగ్గరకు వెళ్ళి తలుపు తట్టాడు.

"ఎవరూ?" అంటూ లోపల్నుంచి సన్నని గొంతు కొకటి వినబడింది.

"ఇట్లో మగాళ్ళున్నట్లు లేదు" అన్నాడు శర్మ.

"ఆడాళ్ళ కాశ ఎక్కువ. అద్దె బాగా ఎక్కువడుగు తుందో ఏమో" అన్నాడు శాస్త్రి బెరుకుగా.

"పెళ్ళి చేసుకోబోతున్నాం. మాటిమాటికీ ఆడాళ్ళను తప్పు పట్టకు" అన్నాడు శర్మ అతణ్ణి హెచ్చరిస్తూ.

తలుపులు తెరుచుకున్నాయి.

నడి వయసు స్త్రీ. వయసు నలభై పైన ఉండవచ్చు. జుట్టు అక్కడక్కడ నెరిసింది. నుదుట రూపాయ కాసంత బొట్టు.

"ఎవరు బాబూ మీరు!" అందామె.

"నా పేరు శాస్త్రి. ఇతడు శర్మ!" అన్నాడు శాస్త్రి.

"బ్రాహ్మలేనన్న మాట....ఏ పనిమీద వచ్చారు?"

"పెళ్ళి చేసుకోబోతున్నాం—యిల్లు చూసుకుందుకు వచ్చాం."

"మాయదారి కలికాలం. మగాళ్ళకూ మగాళ్ళకు పెళ్ళేమిటయ్యా" అందా స్త్రీ నవ్వుతూ.

శర్మ తెల్లబోయాడు. శాస్త్రి తమాయించుకుని "పెళ్ళి మా యిద్దరికేగానీ మా యిద్దరికీ కాదు" అన్నాడు.

"నువ్వేం మాట్లాడుతున్నావో నా కర్థం కాలేదు" అందా స్త్రీ.

"మేమిద్దరం చెరో అమ్మాయినీ త్వరలో పెళ్ళి చేసుకోబోతున్నాం. అందుకని ఇంటికోసం వెతుక్కుంటున్నాం." అన్నాడు శాస్త్రి.

"లోపలికి రండి" అందామె.

ఇద్దరూ వెళ్ళారు.

"జోళ్ళు విప్పుకోండి" అందామె.

"ఎందుకు?" అన్నాడు శాస్త్రి.

"విప్పుకోండి" అందామె గద్దిస్తున్నట్లు.

ఇద్దరూ జోళ్లు విడిచారు.

"లోపలికి రండి" అందామె మళ్ళీ.

వాళ్ళు జోళ్ళు విడిచిన చిన్న గదిలోంచి శాస్త్ర పిఠాలమైన గదిలో అడుగుపెట్టారు. అక్కడ నేల మీద కంబళి పరచివుంది. ఒక పక్కగా వ్యాసపీఠ ముంది. అందులో ఏదో పుస్తకముంది.

ఆ స్త్రీ వ్యాసపీఠం వెనుక తను కూర్చుంది. శాస్త్రినీ, శర్మనూ తన కెదురుగా కూర్చోమంది.

ఇద్దరూ కూర్చున్నారు.

"ఈ తనువు మిథ్య. ఈ ప్రపంచం మిథ్య. మనిషి మాయామోహాల నుంచి బయటపడాలి" అందామె.

"అవును" అన్నాడు శర్మ వినయంగా.

ఆమె ఉదాహరణలు ప్రారంభించింది. శాస్త్రికి విసుగ్గా వుంది. శర్మకోసం భరిస్తున్నాడు.

అలా చాలాసేపు గడిచింది.

శాస్త్రి టైము చూసుకుని "మరోసారి వస్తాం—ఈ రోజు మాకు పనివుంది. ఇప్పు డర్జంటుగా ముప్పాలవాని

పాలెం వెళ్ళాలి" అన్నాడు.

ఆ స్త్రీ అదోలా అతడి వంక చూసి "మీ యిష్టం. వెళ్ళాలనుకుంటే వెళ్ళిపొండి" అంది.

"ఇంటి సంగతి చెప్పలేదు" అన్నాడు శర్మ.

"నా వేదాంతం వంటబట్టని వాళ్ళకు నేను—ఇల్లిలా యిస్తాను" అందా స్త్రీ.

శర్మ వినయంగా "మీ వేదాంతం నా కెంతో నచ్చింది" అన్నాడు.

"అయితే మరి కాసేపు వినొచ్చుగా" అందా స్త్రీ.

"మీరు చెప్పింది జీర్ణించుకున్నాను. మరీ ఎక్కువైతే జీర్ణించుకోవడం కష్టం కదా — జీర్ణించుకోనప్పుడు వినడం బాగుండదు".

"అయితే విన్నదంతా జీర్ణించుకున్నానంటావు...."

"ఊఁ" అన్నాడు శర్మ.

"అబద్ధం...."

"మీ వంటి పుణ్యాత్ములకు నేనబద్ధం చెప్పను...."

"నిజంగా అబద్ధం చెప్పకపోతే నా వేదాంతం వంటబట్టిన వాడికింకా యిల్లెందుకు? యిల్లాలెందుకు?" అందా స్త్రీ.

"నిజమే" అన్నాడు శర్మ.

"అయితే యింటి గురించి అడక్కు — వెళ్ళు" అందా స్త్రీ.

ఇద్దరు మిత్రులూ వెర్రిముఖాలతో అక్కణ్ణించి లేచారు.

"అలా మాట్లాడకుండా వెళ్ళిపోవడమేనా? పెద్ద దాన్ని. నా దగ్గర సెలవు తీసుకోవద్దూ."

"వస్తామండి" అన్నాడు శర్మ.

"మళ్ళీ వస్తానంటే నా కభ్యంతరం లేదు. వచ్చి నప్పుడు నా వేదాంతం రెండు గంటలైనా వినాలి" అందా స్త్రీ.

"ఈ సారి కూడా రెండు గంటలూ వుండుమండి. కానీ మువ్వలవానిపాలెం వెళ్ళాలి గదా" అన్నాడు శాస్త్రి.

"మువ్వలవాని పాలెం కదూ అన్నావు. అక్కడ వెంకటేశ్వర్రావిల్లు నీకు తెలుసా?"

శాస్త్రి తెల్లబోతూ "ఆ యింటికే మేము వెడుతూంట" అన్నాడు.

"ఆ ఇంటికే అంటూ వేమిటి — ఆవిడ కావలసిన వెంకటేశ్వర్రా వెవరో తెలుసుకోకుండానూ" అన్నాడు శర్మ స్నేహితుణ్ని మందలిస్తూ.

"ఆ వెంకటేశ్వర్రావు మహాపిసినిగొట్టులే. పేరు మోసిన వడ్డీ వ్యాపారి. వాళ్ళింట్లో ఓ కాపలావాడు న్నాట్ట. వాడొక సారి యిక్కడ కొచ్చి నన్ను కలుసుకుంటే బాగుండును. ఇంటికి కాపలాగా వుంటానంటే యిల్లే వాడికి వదిలేసి పోతాను" అందా స్త్రీ.

"మీ యింటికి కాపలా కావాలంటే ఆయనెవరో ఎందుకు? మేమే వుంటాం" అన్నాడు శర్మ వెంటనే ఆశగా.

"అద్దెకు వచ్చిన వాళ్ళని కాపలాగా వుంచుతానేమిటి? అయినా అడ్డమైన వాళ్ళనూ నే నెందుకు నమ్ముతాను?" అందా స్త్రీ.

"మీ రెక్కడికి వెళ్ళాలి!" అన్నాడు శాస్త్రి.

"అదంతా నీ కనవసరం. నీకు వీలైతే ఆ కాపలా వాడికి చెప్పు..." అందా స్త్రీ. అప్పుడామె మాట

కసురుతున్నట్లుగా ఉంది.

ఇద్దరూ అక్కణ్నించి చిన్న గదిలోకి వచ్చి జోళ్ళు వేసుకుని నడవలోకి వచ్చారు. వారి వెనుకనే చిన్న గది తలుపులు మూసుకున్నాయి.

# 5

మోటారు సైకిలు ముత్యాలవానిపాలెంలో ఓ యింటి ముందాగింది.

ఇంటిచుట్టూ నాలుగడుగుల ఎత్తుగోడ ఉంది.

ఓ చిన్న గేటు....

శాస్త్రి యింటి నంబరు మరోసారి శ్రద్ధగా చూశాడు. తృప్తిగా తలాడించాడు. ఈలోగా శర్మ మోటార్ సైకిల్ను స్టాండు వేశాడు.

శాస్త్రి గేటుతీసి లోపల ప్రవేశించాడు.

శర్మ లోపలకు ప్రవేశించి గేటు వేశాడు.

చుట్టూ మొక్కలున్నాయి. అవన్నీ కాయగూరలవే.

ఇద్దరూ సన్నని బాటలో ముందుకు వెళ్ళారు.

సరాసరి కాలిదార్లోకి వెళ్ళారు.

తిన్నగా ఓ గుమ్మం. ఎడమపక్కగా ఓ గుమ్మం.

తలుపులు దగ్గరగా వేసిఉన్నాయి.

ఇంటికి కాలింగ్ బెల్ ఉంది. శాస్త్రి బటన్ నొక్కాడు.

కొద్ది క్షణాల్లో తలుపులు తెరుచుకున్నాయి.

సుమారు ముప్పైఏళ్ళ యువకుడు. అతడి ముఖం చిరాగ్గా ఉంది.

“ఎవరుకావాలి?” అన్నాడతడు.

“శ్రీ వెంకటేశ్వరావుగారు—” అన్నాడు శాస్త్రి.

“ఆయనతో మీకేం పని?”

"ఓ, పట్టుచీర తాకట్టు పెట్టాం ఆయన దగ్గర. అదిప్పుడు విడిపించుకోవాలి...."

"ఎంత కాలమయింది?"

"చాలా ఏళ్ళయింది!" అన్నాడు శాస్త్రి.

"ఇప్పుడు వడ్డీ వ్యాపారం జరగడం లేదిక్కడ...." అన్నాడతడు.

"అదంతా నాకెందుకు? నా పట్టుచీర నాకు వాపసు కావాలి...."

అతడో క్షణం ఆలోచించి — "వెంకటేశ్వర రావుగారిప్పుడు బ్రతికి లేరు. ఆయన పిల్లలు వేర్వేరు ప్రాంతాల స్థిరపడ్డారు. నేను వారి దూరపు బంధువుని. ఈ యింట్లో అద్దెకుంటున్నాను. మీ పట్టుచీర వివరాలు తెలియాలంటే...." అని ఆగాడు.

"ఊఁ చెప్పండి—" అన్నాడు శాస్త్రి.

అతడు తటపటాయిస్తూ — "చెప్పాలంటే పట్టుచీర ఈ యింట్లో గదిలోనే ఉందని నేననుకుంటున్నాను...." అన్నాడు.

శాస్త్రికీ, శర్మకూ అతడు చెప్పేది అర్థం కావడానికి కాసేపు పట్టింది.

వెంకటేశ్వరరావు పద్ధతులు పిల్లలకు నచ్చలేదు. ఆయన సంపాదించినకొద్దీ యింకా సంపాదించాలనుకునే వాడు. సంపాదించిన డబ్బు అనుభవించాలన్న కోరిక ఆయన కుండేది కాదు. ఆయన భార్య కానీ, పిల్లలు కానీ ఆ డబ్బువల్ల సుఖాలు పొందలేదు సరిగదా ఊళ్ళో వాళ్ళాయన్ను గురించనుకునే పరిహాస వాక్యాలు విని బాధ పడుతూండేవారు.

వెంకటేశ్వరరావు తను కూడబెట్టిన డబ్బుని

బంగారంగా, వజ్రాలుగా మార్చి ఇనప్పెట్టెలోకి తోసేస్తూండేవాడు. మొదట్లో ఊళ్ళో చాలా చిన్న యిల్లుండేది. అది సెంటర్లో యిల్లు. అదమ్మేసి ఆ డబ్బుతోనే అప్పట్లో చవగ్గా వస్తూంటే ముత్యాలవానిపాలెంలో యిల్లుకట్టి అక్కడకు మారాడు. కనీసం పెద్ద మేడైనా కట్టలేదని అంతా బాధపడేవారు.

అయితే ఆయన పిల్లలకు మంచి చదువులు చెప్పించాడు. ఉన్న ఒక్క కూతురికీ ఎన్నికైన సంబంధం చేశాడు. వాళ్ళెవరికీ ఆయన దారి నచ్చక రెక్కలు రాగానే ఎగిరిపోయారు. భార్య మాత్రం తప్పనిసరై ఆయనతో ఉండిపోయింది. ఆమె అదృష్టంకొద్దీ ఆయన పోయాడు.

పోయే ముందాయన “నేను నా పిల్లలకు చేసిన లోటేమీ లేదు. వాళ్ళను పైకి తెచ్చాను. నా సంపాదన మీద ఆశకొద్దీ వాళ్ళు నాకు దూరమయ్యారు. బ్రతికుండగా నేను వాళ్ళకక్కర్లేకపోయాను. చచ్చేక నా సంపాదన అనుభవించాలని వాళ్ళకుండవచ్చు. అది సాగనివ్వను. నా ఇనప్పెట్టి ఎప్పటికీ యీ యింట్లోనే ఉంటుంది. దానికి గట్టి కాపలాకూడా ఏర్పాటు చేస్తాను....” అని భార్యకు చెప్పాడు.

ఆయన పోయాక ఓ ముసలివాడు ఇనప్పెట్టికి కాపలాగా ఉంటున్నాడు. వాడెంత గట్టివాడంటే వారంతా ఊరొదిలిపెట్టి పోయినా ఇనప్పెట్టి గదికి ఏ భద్రతా అవసరం లేదు.

“మీ పట్టుచీర ఆ ఇనప్పెట్టిలోనే ఉంటుంది. కాపలావాడికి నచ్చచెప్పి ఇనప్పెట్టిలోంచి ఆ పట్టుచీర తీసుకోండి__”. అన్నాడా ఇంటి యువకుడు.

"పట్టుచీర ఇనప్పెట్టిలో ఉంటుందా?" అన్నాడు శాస్త్రి ఆశ్చర్యంగా.

"తాకట్టు వస్తువులందులోనే ఉంటాయి మరి...."

"తాళాలు....?"

"అవి ఇనప్పెట్టికే ఉంటాయి...."

"అదేమిటి? అవి వెంకటేశ్వర్రావుగారి భార్య దగ్గరుంటాయనుకుంటాను."

"ఆమె కొడుకుల దగ్గరుంటోంది...."

శాస్త్రి, శర్మ జరిగిందానికి, విన్నదానికి చాలా ఆశ్చర్యపడుతూ లోపలకు వెళ్ళి ఆ యువకుడు చూపిన గది వైపుకి వెళ్లారు.

"జోళ్ళు విప్పుకుని లోపలకు వెళ్ళండి. ఇనప్పెట్టి గది ఆయనకు దేవాలయంకంటే ఎక్కువ—" అన్నాడా ఇంటి యువకుడు.

ఇద్దరూ జోళ్లు విడిచి లోపలకు వెళ్లారు.

గది విశాలంగానే ఉంది. అక్కడ వారికెవ్వరూ కనపడలేదు.

ఓ మూలగా నిలువెత్తు ఇనప్పెట్టి ఉంది. తాళాలు దానికి వేలాడుతున్నాయి.

శాస్త్రి ఇనప్పెట్టి సమీపించి తాళం తిప్పబోయాడు.

శర్మ గదిలో చుట్టూ చూస్తున్నాడు.

అప్పుడతడికి ఓ మూల కనిపించాడు....సుమారు అరవై యేళ్ళ వృద్ధుడు. నెరసినజుట్టు. కానీ బట్టతల కాదు. అయిదడుగుల పదంగుళాల పొడవుంటాడు. మనిషి కండలు తిరిగిలేడు కానీ దృఢంగా ఉన్నాడు.

"ఏయ్—" అన్నాడా వృద్ధుడు.

అతడెక్కణ్ణించి వచ్చాడా అని శర్మ ఆశ్చర్యపడు

తున్నాడు.

శాస్త్రి ఆగిపోయాడు తాళాలు తీయకుండా.

వృద్ధుడు వారిద్దర్నీ సమీపించి— "ఎవరు మీరు?" అనడిగాడు.

శర్మ తడబడ్డాడు. శాస్త్రిమాత్రం వెంటనే— "నీ కోసమే వచ్చాం...." అన్నాడు.

"నా కోసం వచ్చినవాళ్ళు—ఇనప్పెట్టె తాళాల జోలికెందుకు వెళ్ళారు?" కొట్టొచ్చినట్లు అడిగాడు వృద్ధుడు.

"గదిలో ఎవ్వరూ కనపడలేదు. ఇనప్పెట్టె తాళాల మీద చేయివేస్తే ఎవరైనా రాకపోతారా అనుకున్నాను. నువ్వు వచ్చావు...."

వృద్ధుడు నవ్వుతూ—"అంతా అబద్ధం. నన్ను చూసి భయపడి మాట మారుస్తున్నావు...." అన్నాడు.

"నీ వయసులో కూడా నిన్నెదిరించగల శక్తి మాకుంది. ఈ వయసులో నువ్వంటే మాకెందుకు భయం?" అన్నాడు శాస్త్రి.

"బహుశా నా శక్తి తెలిసి ఉండదు...."

"ఏమిటి నీ శక్తి?"

"ఇనప్పెట్టె తాళాలమీద మరోసారి చేయ వేసి చూడు. అప్పుడు నీకు నా శక్తి తెలుస్తుంది...."

ఏం జరుగుతుందో చూడాలని శాస్త్రి ఇనప్పెట్టె తాళాలమీద చేయివేశాడు. వృద్ధుడు మెరుపు వేగంతో అతణ్ని సమీపించి గట్టిగా లాగాడు. ఆ విసురుకు శాస్త్రి అక్కణ్నించి మరో మూలకు వెళ్ళి పడ్డాడు.

శాస్త్రి పాటు చూసి శర్మ తనూ రియాక్ట్ అవ్వాడు కానీ వృద్ధుడు వెంటనే అతణ్ణీ మరో మూలకు విసిరేశాడు.

ఇద్దరికీ మామూలు మనిషి కావడానికి చాలా సేపు పట్టింది.

వృద్ధుడు నవ్వుతూ వారినే చూస్తున్నాడు.

"మాకు చాలా విద్యలు తెలుసు. కానీ నీ ముందు చాలలేదు. నీకు శిష్యరికం చేస్తాం. ఈ విద్య నేర్పుతావా?" అన్నాడు శర్మ.

"ఇది ఒకరు నేర్పితే వచ్చేది కాదు. డ్యూటీపట్ల బాధ్యత ఉండాలి. అదే నీకు కొత్త విద్యలు నేర్పుతుంది—" అన్నాడు వృద్ధుడు.

"కానీ...." అని ఆగాడు శర్మ.

"ఏం—మరో ప్రయత్నం చేస్తారా?" అన్నాడు వృద్ధుడు.

"వద్దు—" అన్నాడు శాస్త్రి.

ప్రత్యర్థిని బలంతో జయించలేమని అతడికి తెలిసిపోయింది.

"ఇప్పుడు చెప్పు. ఇక్కడికెందుకు వచ్చావు?" అన్నాడు వృద్ధుడు.

"పట్టుచీర కోసం...." అన్నాడు శాస్త్రి.

"పట్టుచీర అంటే సోమయాజులు భార్యదా?" అన్నాడా వృద్ధుడు వెంటనే.

"అంత వెంటనే ఎలా చెప్పగలిగావు?" అన్నాడు శాస్త్రి ఆశ్చర్యంగా.

"ఇనప్పెట్టిలో ఉన్న పట్టుచీర అదొక్కటే!" అంటూ వృద్ధుడు తనే వెళ్ళి తాళం తీసి తలుపు తెరిచాడు.

ఇద్దరికీ కళ్ళు జిగేల్మన్నాయి.

పెట్టెలో ప్రతి అరలోనూ నోట్లకట్టలు, బంగారు

నగలు, కళ్ళు జిగేల్మనే వజ్రాలు....

బహుశా ఆ ఇనప్పెట్టెతో ఓ నగరాన్ని కొనిపారేయవచ్చునేమో!

మిత్రులిద్దరూ తెల్లబోయి చూస్తూండగా వృద్ధుడు ఇనప్పెట్టెలోంచి ఓ పట్టుచీర తీసి — "ఇదే కదూ!" అన్నాడు.

అవునో కాదో తెలియకపోయినా — "ఊఁ" అన్నాడు శాస్త్రి.

వృద్ధుడు పట్టుచీర మడతలోంచి ఒక కాగితం తీసి దానికేసి శ్రద్ధగా చూసి — "ఇది వెనక్కి పట్టుకుని వెళ్ళాలంటే పదహారువేల నాలుగు వందల ఇరవై ఒక్క రూపాయి డెబ్బైనాలుగు పైసలివ్వాలి. అంత డబ్బు తెచ్చారా?" అన్నాడు.

"పట్టుచీరకు అంత డబ్బా!"

"లేకుంటే నా దగ్గరే ఉంటుంది. అప్పు తీసుకున్నాక సోమయాజులు పైస కూడా తీర్చలేదని ఈ కాగితంలో ఉంది. వడ్డీ పెరక్కమవుతుంది!"

"నీ దగ్గర డబ్బు దాచుకుంటాను. ఇదే వడ్డీ ఇస్తావా?" అన్నాడు శర్మ వెంటనే.

"నేను వడ్డీవ్యాపారం చేయడంలేదు. ఉన్నదానికి కాపలా—అంతే!" అన్నాడు వృద్ధుడు.

"నువ్వు చాలా గొప్ప కాపలావాడివి. అందుకే కాబోలు ఆమె నిన్ను రమ్మంది...." అన్నాడు శాస్త్రి.

"ఆమె ఎవరు?" అన్నాడు వృద్ధుడు.

"పేరు మాకూ తెలియదు. చెంగల్రావు పేటలో ఉంటోంది..."

"ఆమెకు నాతో పనేమిటి?"

"తనింటికి కాపలా కాయాలట?"

"కాపలాకాస్తే ఏమిస్తుందిట!"

"తన యిల్లే వదిలి వెడుతుందిట...."

వృద్ధుడి కళ్ళు చిత్రంగా మెరిశాయి— "వదలాలనుకుంటున్న ఇంటికి కాపలా ఎందుకు?"

"అదే మాకూ అర్థంకాలేదు...."

"మీరు నిజమే చెబుతున్నారా?" అన్నాడు వృద్ధుడు.

"నీకు అబద్ధమెందుకు చెప్పాలి!"

"ఎందుకంటే—నన్నిక్కడ్నుంచి తరిమెయ్యడానికి!" అని నవ్వాడు వృద్ధుడు— "కానీ ఇవప్పెట్టిని నేను లేకున్నా మీరు తెరువలేరు, అది తెలుసుకోండి...."

"బలంలో చాకచక్యంలో మేము నీకు సాటిరాక పోవచ్చు. కానీ మా శక్తియుక్తులను నువ్వు తక్కువ అంచనా వేయకద్దు...." అన్నాడు శాస్త్రి.

"అదీ చూద్దాం—తర్వాతెప్పుడైనా...." అని— "చెంగల్రావుపేటలో ఇల్లంటే అది నా అదృష్టమే! కానీ మీ మాటలే నాకు నమ్మతగ్గవిగా లేవు...." అన్నాడు వృద్ధుడు.

"ఒక్కసారి వెళ్ళిరావచ్చుగా—" అన్నాడు శాస్త్రి.

"మరోసారి ఆమెను కనుక్కొనిరండి. తన ఇంటిని కాపలావాడి కెందుకివ్వాలనుకుంటోందో...."

"అదీ నువ్వే కనుక్కోవచ్చుగదా!"

"ఆ అవసరం నాకు లేదు...."

"నువ్వీ గదిని వదిలి వెళ్ళడానికి భయపడుతున్నావు." అన్నాడు శర్మ చిరాగ్గా.

"భయం నా కెందుకు?" అంటూ వృద్ధుడు పట్టు చీరను ఇనప్పెట్టెలో పెట్టి తలుపు తాళం వేసి తాళాల గుత్తి కేసి శర్మమీదకు విసిరి-"ఇనప్పెట్టె తెరు చూద్దాం-" అన్నాడు.

అది సవాలుగా తోచింది శాస్త్రికీ, శర్మకూ.

ఇద్దరూ ఆ తాళాలతో చాలా సేపు ప్రయత్నించారు. ఎంత ప్రయత్నించినా ఇనప్పెట్టె తలుపులు తెరుచుకో లేదు.

"నువ్వెలా తెరిచావు?" అన్నాడు శాస్త్రి ఆశ్చర్యంగా.

"అది నేను చెప్పను. ఎవ్వరూ తెలుసుకోలేరు...." అంటూ నవ్వి—"నేను నిజమే చెప్పానని తెలిసింది కదా! వెళ్ళి మరోసారి చెంగల్రావు పేట మనిషిని విషయమడిగి రండి. నేను వెళ్ళి ఆమెను కలుసుకుంటాను.." అన్నాడు వృద్ధుడు.

"ఆమెను మళ్ళీ కలుసుకోవడమా?" అని శాస్త్రి కంగారుపడ్డాడు.

"పద—పోదాం—" అన్నాడు శర్మ.

మిత్రులిద్దరూ అక్కణ్ణించి బయటపడ్డారు.

వాళ్ళు జోళ్ళు వేసుకుంటూంటే—"అరే! అప్పుడే వెళ్ళిపోతున్నారే—" అంటూ ఆ యింటి యువకుడు వారిని పలకరించాడు.

"వెళ్ళిపోతున్నాంగానీ—మళ్ళీ వస్తాం!" అన్నాడు శర్మ.

"మళ్ళీ వస్తారా?" అన్నాడా యింటి యువకు డాశ్చర్యంగా.

# 6

"అమలనూ, విమలనూ వాళ్ళ కర్మానికి వదిలిపెట్టడం మంచిదనిపిస్తోంది. మరోసారి చెంగల్రావుపేట వెళ్ళామంటే ఆ యింటావిడ వేదాంతం పేరు చెప్పి మన ప్రాణాలు తీస్తుంది...." అన్నాడు శర్మ.

"నువ్వు చెప్పింది నిజమే-కానీ నేనలా ఊరుకోలేను. మన తెలివితేటలన్నీ ఓ నడివయసు స్త్రీముందు వృథా అయితే—మన బలపరాక్రమం అరవై యేళ్ళ వృద్ధుడికి సాటి రాకపోతే మనం బ్రతికీ ప్రయోజనంలేదు. పట్టుచీర, ఆ యింట్లో కాపురం సాధించితీరాలి. ఇది మన శక్తిసామర్థ్యానికే సవాలు ..." అన్నాడు శాస్త్రి.

శర్మ ఆశ్చర్యంగా శాస్త్రి వంక చూసి—"అంటే అమల నన్నాకర్షించినకంటే ఎక్కువగా విమల నిన్నాకర్షించిందన్నమాట—" అన్నాడు.

"అలా ఎందుకనుకుంటున్నావు?"

"మనిషి అవకాశవాది. ఆదర్శంకోసం జీవితమంటాడు. జీవితంకోసం ఆదర్శాలు సృష్టించుకుంటాడు. నువ్వు విమలను ప్రేమిస్తున్నావు. ఆమెకు ప్రేమ కానుక ఇవ్వాలనుకుంటున్నావు .... అందుకని మనశక్తిసామర్థ్యాలకు సవాలంటున్నావు—" అన్నాడు శర్మ.

"కానీ—అలాగే అనుకో—నీ సంగతేమిటి?"

"నీకు సహకరించడం నా బాధ్యత అనుకుంటాను.."

"అంటే నువ్వూ అమలను నేను విమలను ప్రేమించినంతగా ప్రేమిస్తున్నావన్నమాట.... దానికి సహకారమని పేరు పెడుతున్నావు...."

ఇద్దరూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

శాస్త్రికి శర్మ కళ్ళలో అమల కనబడింది. శర్మకు

శాస్త్రి కళ్ళలో విమల కనబడింది.

"మనం నిజంగానే ప్రేమలో పడ్డాం—" అన్నారిద్దరూ ఒకేసారి.

"అయితే ఇప్పుడేం చేయాలి?" అన్న సందేహం కూడా వారిరువురికీ ఒకేసారి కలిగింది.

వృద్ధుడు మహా బలవంతుడు.

నడివయసు స్త్రీ మహాబోరు.

ఇద్దర్నీ ఎలా జయించాలి?

"మనకు ఓర్పు కావాలి. వాళ్ళిద్దర్నీ జాగ్రత్తగా పరిశీలించి ఇద్దరి బలహీనతలూ తెలుసుకుని సరైన దెబ్బ తీయాలి...." అన్నాడు శర్మ.

"కానీ చెంగల్రావు పేటావిడ వేదాంతం వింటూంటే బుద్ధి పనిచేస్తుందా?" అన్నాడు శాస్త్రి.

"కాలమే నీ ప్రశ్నకు సమాధానం చెబుతుంది—" అన్నాడు శర్మ.

## 7

మళ్ళీ మిత్రులిద్దరూ చెంగల్రావు పేటలో ఆ ఇంటికి వెళ్ళారు.

ఆమె వారి మాటలు వినిపించుకోకుండా వారికి వేదాంతబోధ చేసింది.

రెండుగంటలపాటు వారామెను సహించారు.

ఆమె అందుకెంతో సంతోషించి—"మీరు నాకు నచ్చారు. ఎందుకంటే నా వేదాంతం విని మళ్ళీ నా యింటికి వచ్చారు—" అంది.

"అసలెప్పుడూ మీ యింట్లోనే ఉండిపోదామనుకుంటున్నాం మేము—" అన్నాడు శర్మ.

"నాకు కొత్తమనుషులు కావాలి. ఎప్పుడూ మీకే

చెప్పాలంటే విసుగ్గా వుంటుంది—" అందామె.

"వేదాంత బోధకులకొత్తమనుషులెందుకు?" అన్నాడు శాస్త్రి.

"నాకు తెలిసింది చాలా తక్కువ. మీకు రెండ్రోజుల్లో నాకు తెలిసినదాంట్లో నాలుగింట మూడొంతులు చెప్పేశాను. ఇంకొక్కవంతు మిగిలింది. ఆ తర్వాతినుంచి నా పాఠం మళ్ళీ మొదటికి వస్తుంది—" అందామె.

"ఫరవాలేదు. ఎన్నిసార్లైనా మీ పాఠం మేము మళ్ళీ మళ్ళీ వినగలం—" అన్నాడు శర్మ వినయంగా.

"వినడానికి మీకు విసుగు లేకపోవచ్చు. కానీ చెప్పడానికి నాకు విసుగే మరి!" అందామె.

శాస్త్రి, శర్మ ముఖ ముఖాలు చూసుకున్నారు.

"అవునూ — నిన్న మీతో కాపలావాడి సంగతి చెప్పాను. మాట్లాడరా?" అందామె మళ్ళీ.

"మాట్లాడేము. అతడు మీ మాటలు నమ్మడంలేదు. ఇల్లొదిలి పెట్టాలనుకునే వారికి కాపలావాడెందుకూ అంటున్నాడు...." అన్నాడు శర్మ.

"జీవితంలో తన బాధ్యతనంత గొప్పగా నిర్వహించే వాళ్ళు అరుదు. నేనిల్లు వదిలిపెడితే అలాంటి వాడికే వదుల్తాను. అతడితో కాసేపు మాట్లాడాలని నా కోరిక. ఏవిధమైన సందేహాలు పెట్టుకోక అతణ్ని నా వద్దకు రమ్మని చెప్పండి.." అందామె.

"అలాగే—ఈ రోజుకు సెలవు.." అంటూ మిత్రులా యింట్లోంచి బైటపడ్డారు.

మోటర్ సైకిల్ శర్మ స్టార్టుచేశాడు. శాస్త్రి వెనక కూర్చున్నాడు.

దారిలో—"నీకావిడ బలహీనతేమైనా తెలిసిందా?" అన్నాడు శర్మ.

"తెలిసింది. ఆమెకిలా వేదాంతం బోధించడం యిష్టంలేదు. ఈ యిల్లొదిలిపోవాలనుకుంటోంది. కానీ మనకు మాత్రం యిల్లద్దెకిచ్చేలా లేదు...."

"అంటే మనం ఆ ముసలి కాపలావాడినే కాకా పట్టాలి. పట్టుచీర, అద్దె యిల్లు—రెండూ అతడివల్లనే మనకు దొరకాలి.." అన్నాడు శర్మ.

"చూద్దాం. మన అదృష్టమెలాగుందో—" అన్నాడు శాస్త్రి.

ఇద్దరూ మువ్వలవాని పాలెంలో ఆ ఇల్లు చేరుకున్నారు.

ఆ యింటి యువకుడు వాళ్ళిద్దర్నీ చూసి ఆశ్చర్యపడుతూ—"నిజంగానే మళ్ళీ మీ యిద్దరూ వచ్చారు-?" అన్నాడు.

"అందులో ఆశ్చర్యమేముంది?" అన్నాడు శాస్త్రి.

"గజదొంగలుకూడా ఆ గదిలోకి రెండోసారి వెళ్ళాలనుకోరు.."

"మేము గజదొంగలం కాదు. పెద్దమనుషులం..." అంటూ శాస్త్రి అతడి అనుమతికోసం ఎదురుచూడకుండా లోపలకు నడిచాడు. తర్వాత యిద్దరూ జోళ్ళు దిగ విడిచి ఇనప్పెట్టె ఉండే గదిలో ప్రవేశించారు.

"డబ్బు తెచ్చారా?" అన్న గంభీర స్వరం వారి చెవులకు వినపడింది.

ఇద్దరూ అటు చూశారు.

ఒక మూలనుంచీ వచ్చాడు వృద్ధుడు.

"డబ్బేమిటి?" అన్నాడు శాస్త్రి.

"పట్టుచీర విడిపించుకుని వెళ్ళరూ?"

"మా దగ్గరంత డబ్బులేదు. మేము నిన్ను చెంగల్రావు పేట పంపించడానికి వచ్చాం, నువ్వు తిరిగొచ్చేదాకా మేమిక్కడే నీ గదిలో కాపలాగా ఉంటాం—" అన్నాడు శర్మ.

వృద్ధుడు వారివంక అదోలా చూసి—"మీ మనసులో యేదో దురాలోచన వుంది....—" అన్నాడు.

"ఉంటేమాత్రం మావల్ల నేమవుతుంది? ఇనప్పెట్టె తెరవడంకూడా మాకు చేతకాదు-" అన్నాడు శాస్త్రి.

వృద్ధుడు నవ్వి—"ఆమాత్రం నిజం గ్రహించారు. తెలివైనవాళ్ళే! ఇక నా మాటకు బదులు చెప్పండి. ఏమంటుంది చెంగల్రావు పేటావిడ!" అన్నాడు.

శాస్త్రి, శర్మ విషయం వృద్ధుడికి చెప్పారు. ఇల్లతడికి వస్తే తామిందులో అద్దెకుండి అతడికి సక్రమంగా అద్దె కూడా చెల్లించుకుంటామన్నారు.

వృద్ధుడొక్క నిమిషం ఆలోచించి—"సరే—నేను వెడతాను....అయితే నేను వచ్చేవరకూ మీరిక్కడే వుండండి. వెళ్ళడానికి ప్రయత్నించినా, వెధవ పనులు చేసినా తిరిగివచ్చి మీ అంతు చూస్తాను...." అన్నాడు.

శాస్త్రి, శర్మ బుద్ధిగా తలాడించారు.

వృద్ధుడు గదిలోంచి వెళ్ళిపోయాడు.

కాసేపు మిత్రులిద్దరూ గదిలో బుద్ధిగానే కూర్చున్నారు. కానీ ఉన్నట్లుండి శాస్త్రి లేచి నిలబడి—"మనం మరో ప్రయత్నం చేద్దాం—" అన్నాడు.

శర్మ భయంగా—"వద్దు—" అన్నాడు.

"ఇప్పుడు టైము పదిన్నర దాటింది. ఈ రాత్రి వృద్ధుడు బయల్దేరి వెళ్ళాడు. చెంగల్రావు పేటకతడు

కాలినడకన వెడితే గంటకు పైగా పడుతుంది. ఏ ఆటోలో నైనా వెడితే అది వేరే సంగతి. అయినా అతడు తిరిగి రావడానికి చాలాసేపు పడుతుంది. ఈలోగా మనం కనీసం పట్టుచీర సాధించవచ్చు.."

"నువ్వు పట్టుచీర సంపాదిస్తే నీ పని అవుతుంది. మరి నావల్ల నేమవుతుంది?" అన్నాడు శర్మ.

"నువ్వు అమలను పెళ్ళిచేసుకున్నాకే — నేను విమలను పెళ్ళిచేసుకుంటాను. సరా?" అన్నాడు శాస్త్రి.

"తాళంమీద చేయివేయగానే ఆ కాపలావాడు కనబడితే!"

"వాడు బైటకు పోయాడుగా...."

"ఏమో — పోయాడో లేదో — ఎలా తెలుస్తుంది? నిన్న వాడు ముందు మనకు కనబడలేదు. తర్వాత ప్రత్యక్షమయ్యాడు."

శాస్త్రి సాలోచనగా — "వాడి సంగతి నాకు తెలిసింది. వాడు మనిద్దర్నీ హిప్నొటైజ్ చేస్తున్నాడు. వాడు ప్రత్యక్షం కావడం, మనల్ని విసిరేయడం, వాడికి పనిచేసిన తాళాలు మనకు పనిచేయకపోవడం — అంతా హిప్నొటిక్ ఎఫెక్టు...." అన్నాడు.

"అదంతా ఎందుకంటావు?"

"ఆలోచిస్తుంటే ఇదంతా పెద్ద గూడుపుఠాణీ అనిపిస్తోంది. అమల, విమలలకు కూడా ఇందులో పాత్ర ఉందేమో! చెంగల్రావు పేటలోని ఆడమనిషి, ముక్కాల వారి పాలెంలోని ఈ వృద్ధుడిని కలుసుకుని మాట్లాడుకోవాలనుకోవడంలో ఒక రహస్యముంది. అందుకు మననుపయోగించుకున్నారు.."

"ఎలా?" అన్నాడు శర్మ.

"వృద్ధుడు నిన్న మనని భ్రమలో వుంచాడు. ఈ గదిలో మనం శక్తిహీనులమన్న నమ్మకం కలగ చేశాడు. ఆ ధైర్యంలో వాడు మననిక్కడ వదిలి వెళ్లాడు. చూద్దాం ఈసారి ఏమవుతుందో...వాడిక్కడలేడు కాబట్టి మరోసారి మన ప్రయత్నాలు చేద్దాం.." అన్నాడు శాస్త్రి.

అంటూనే అతడు వెళ్ళి ఇనప్పెట్టె తాళాలు తెరవ బోయాడు వెంటనే తెలుపు తెరుచుకుంది.

ఇద్దరికీ కలిగిన ఆశ్చర్యమింతా అంతా కాదు.

ఇనప్పెట్టినిండా డబ్బు, నగలు, వజ్రాలు...

ఓ, మూలగా పట్టుచీర...

శాస్త్రి పట్టుచీర తీసుకున్నాడు.

"ఇప్పుడేం చేద్దాం?" అన్నాడు శాస్త్రి.

శాస్త్రి పట్టుచీర మడతల్లోంచీ ఓ కాగితం తీశాడు.

సోమయాజులు పట్టుచీరను తాకట్టు పెట్టి తీసుకున్న అప్పు మొత్తం అయిదువందల రూపాయలు. చీరనిండా వెండి, బంగారు జరీ వుంది.

అప్పుడు శాస్త్రి తన జేబులోనుంచీ ఆరువందలు తీశాడు.

"అసలు అయిదువందలు, అందుకు తేనిచ్చికోగల వడ్డీ వంద. మొత్తం ఆరువందలు—ఇనప్పెట్టెలో పెడు తున్నాను. ఈ వ్యవహారం నీకు నచ్చనిపక్షంలో నా పెళ్ళయ్యాక చీర వాపసు చేస్తాను. నా అడ్రసు...." అంటూ ఆ కాగితంమీద వ్రాశాడు.

"ఈ కాగిత మీ యింటి యోజకుడి కిద్దాం—" అన్నాడు శాస్త్రి.

శర్మ ఆ కాగిత మందుకుని చదువుతూంటే శర్మ ఇన ప్పెట్టెకు తాళం వేశాడు.

ఇద్దరూ గదిలోంచి బయటపడి ఆ యింటి యువకుణ్ణి కలుసుకున్నారు. అతడు వరండా దగ్గర పట్టుచీర చూసి ఆశ్చర్యపడ్డాడు. అది పట్టించుకోకుండా శాస్త్రి, శర్మ యింట్లోంచి బైటపడ్డారు.

"తిన్నగా విమల దగ్గరకు వెడదాం—" అన్నాడు శాస్త్రి.

"ఇద్దరం ప్రేమకానుకలు సాధించినప్పుడే నువ్వు విమలను కలుసుకున్నా, నేను అమలను కలుసుకున్నా...." అన్నాడు శర్మ.

అప్పుడు శాస్త్రి చటుక్కున—"అయితే మనమిప్పుడు చెంగల్రావు పేట వెడదాం. అక్కడేం జరిగిందో తెలుసుకుందాం—" అన్నాడు.

"అక్కడింకా వృద్ధుడుండి—మన దగ్గర్నుంచీ పట్టుచీర లాక్కుంటే యేం చేస్తావు?" అన్నాడు శర్మ.

"భయం యిప్పట్నుంచీ వద్దు. పెళ్ళయ్యాక ఎలాగూ తప్పదు. ఆ వృద్ధుడికూడా జరిగింది చెబుతాం. వారం రోజుల భాగ్యానికి పట్టుచీరకు ఆరువందల రూపాయల అద్దె యువరిస్తారు....—అతడొప్పుకుంటాడని నా మనసు చెబుతోంది. పద...." అన్నాడు శాస్త్రి.

మోటార్ సైకిల్ చెంగల్రావు పేటవైపు సాగింది.

వారు చెంగల్రావు పేటలోని ఆ యింటిని చేరుకునేసరికి వృద్ధుడు—ఆమె చెబుతున్న వేదాంత పాఠం వింటున్నాడు.

ఇల్లు, ఇల్లాలు మిథ్య అంటోం దామె. మనిషి మాయా మోహం నుంచి బయట పడాలంటోం దామె.

ఆ పాఠానికి శాస్త్రి, శర్మ భంగం కలిగించారు.

వృద్ధుడు శాస్త్రి చేతిలోని పట్టుచీర చూశాడు,

శాస్త్రి అతడికి తను చేసినపని చెప్పాడు.

"మీరు పట్టుచీర ఒక్కటే తీశారా? లేక...." అన్నాడు వృద్ధుడు.

"కావాలంటే మేమూ నీతో వస్తా. నువ్వు మమ్మల్ని పరీక్షించుకోవచ్చు—" అన్నాడు శాస్త్రి.

"ఇనప్పెట్టెలో అంత డబ్బు, అన్ని నగలు, విలువైన వస్త్రాలు—ఉండగా పట్టుచీర ఒక్కటే ఎందుకు తీశారు మీరు?" అన్నాడు వృద్ధుడు.

శాస్త్రి తన కథ చెప్పాడు.

వృద్ధు డాశ్చర్యంగా—"అవకాశం చేజిక్కినపుడు ఇంకా డబ్బెందుకు తీసుకోలేదు?" అన్నాడు.

"అవకాశాన్నిబట్టి డబ్బు తీసేవాడు దొంగ. అవసరానికి దొంగతనం చేసేవాడు మనిషి.... నాది అవసరం. అవకాశంతో నాకు నిమిత్తం లేదు...."

ఆమె వృద్ధుడివంక చూసి నవ్వుతూ—"చూశావా—నేను చెప్పింది నిజం—" అంది.

"ఏమిటి మీరు చెప్పినది—....?" అన్నాడు శాస్త్రి.

"ఈ తనువు శాశ్వతం కాదు. ఈ ఆస్తి శాశ్వతం కాదు. అసలీ భూమి కూడా శాశ్వతం కాదు. అలాంటప్పుడు జీవమున్నంత కాలం మనిషి తన దేహాన్ని అరిషడ్వర్గాలకు బానిసగా ఉంచడంలోవల్ల—బ్రతుకులోని మాధుర్యాన్ని కోల్పోతున్నాడు. లోభాన్ని వీడి, వ్యామోహాన్ని వదలిపెట్టి విశాల దృక్పథాన్నలవర్చుకుంటే మనిషీ భగవంతు డౌతాడు. నాకు మీలో ఉత్తమ మానవుడు కన్పించాడు. అదే ఈ వృద్ధుడికి చెప్పాను. బుజువు కావాలన్నాడు. బుజా

వయింది—...."

"అమ్మా! నీవు వయసులో నాకన్న చిన్న. కానీ జ్ఞానంలో నేను పసివాణ్ణి నా కళ్ళు తెరుచుకున్నాయి...." అన్నాడు వృద్ధుడు.

ఆ స్త్రీ శాస్త్రి, శర్మలవంక గంభీరంగా చూసి—"ఆ పట్టుచీర ఇక్కడ పెట్టి వెళ్ళండి. రేపుదయం రండి. చీరా మీకు దక్కుతుంది. ఇల్లూ మీదవుతుంది—" అంది.

## 8

మర్నాడుదయం ఏడు గంటలకు శాస్త్రి. శర్మ—చెంగల్రావు పేటలోని ఆ యింటికి వెళ్ళారు. ఇంటిముందు టులెట్ అన్న బోర్డుంది. వివరాలకు పక్కింట్లో సంప్రదించమని వ్రాసి వుంది.

ఇద్దరూ ఆశ్చర్యపడి పక్కింటికి వెళ్ళారు. పక్కింటాయన అది విని ఆశ్చర్యపడి తనూ వచ్చి టులెట్ బోర్డు చూసి—"ఇది నేను పెట్టినదే—కానీ చాలా కాలంగా గల్లంతయింది...." అన్నాడు.

అప్పుడు శాస్త్రి తామా యింట్లోకి వెళ్ళిన విషయం చెప్పి — "ఆ స్త్రీ యేమయిందంటారు? .... —" అన్నాడు.

పక్కింటాయన బెదురుగా—"ఆమె ఎవ్వరో నాకు తెలియదు. కానీ-ఇంటికి వచ్చినవాళ్ళని వేదాంత పాఠాలతో బెదరగొట్టేస్తుంది. ఆమె కారణంగా నే నీ ఇంటి నెవరికీ అద్దెకివ్వలేక పోతున్నాను. నేనూ ఉండలేకపోతున్నాను ...." అన్నాడు.

"కానీ ఆమె ఈ రోజునుంచీ ఈ యింట్లో మే ముద్దుండవచ్చునంది—" అన్నాడు శాస్త్రి.

"మీరుంటారా? అయితే తప్పకుండా ఉండొచ్చు. సాయంత్రానికి రండి. ఇల్లు శుభ్రం చేయించి ఉంచు తాను—...." అన్నాడు పక్కింటాయన.

"చాలా థాంక్స్....మీరు చెప్పినట్లే చేస్తాం. కానీ ముందుగా యింట్లో ఓ పట్టుచీర వదిలివెళ్ళాం. తెచ్చుకో వచ్చా?" అన్నాడు శాస్త్రి.

"ఉంటే అది మీదే—పదండి చూద్దాం—" అన్నాడు ఇంటాయన కుతూహలంగా.

ఇద్దరు మిత్రులూ, ఇంటాయనా లోపలకు వెళ్ళారు.

ఇంటికి తాళం వేసి వుండడంవల్ల పక్కింటాయన తాళం తీయవలసి వచ్చింది. లోపల యెప్పుడూ వుండే బరకమూ వ్యాసపీఠమూ లేవు. అసలింట్లో నరసంచార మున్నట్లే లేదు. ఒక మూలగా పట్టుచీ మడతలు విడి కుప్పలా పడి వుంది. చూస్తే అది కట్టివిడిచిన చీరలాగుంది.

శాస్త్రి చీరను మడతపెట్టుకున్నాడు. పక్కింటాయన దగ్గర సెలవు తీసుకుని యిద్దరూ ముందు తమ గదికి వెళ్ళారు.

అప్పటికే యింటిముందో కారాగి వుంది.

గదిముందో యువకుడు నిలబడి వున్నాడు.

"నా పేరు శ్రీనివాసరావు. నేను వెంకటేశ్వర్రావు గారి అబ్బాయిని. మీరు మా యింటికి రావాలి. మా ఇనప్పెట్టె తెరిచిపెట్టాలి—" అన్నాడతడు.

శాస్త్రికీ శర్మకూ ముందేమీ అర్థంకాలేదు.

ఆ యువకుడు ముందు వారిని కారెక్కమన్నాడు. కార్లో వారికి తన కథ వినిపించాడు.

వెంకటేశ్వరరావు చనిపోయాక కూడా దెయ్యమై ఇనప్పెట్టెనే అంటిపెట్టుకుని తిరుగుతున్నాడు. అందుల్లో

డబ్బు నెవరూ ముట్టుకుందుకు లేదు. ఆయనే దెయ్యమయ్యాడంచే బాగుండదని వాళ్ళాగదిలో ఓ కాపలావాడున్నాడని నలుగురికీ చెప్పుకుంటూ తా మా యింటిని వదిలి పెట్టారు.

నిన్నరాత్రి శ్రీనివాసరావుకు వెంకటేశ్వర్రావు కలలో కనబడి—తనకు జ్ఞానోదయమై సకల వ్యామోహాలూ నశించాయనీ—తానిక యిల్లొదిలి వెళుతున్నాననీ చెప్పాడట. ఇనప్పెట్టెలోని డబ్బు భార్య, బిడ్డలు కాక శాస్త్రి, శర్మ అనే మరో యిద్దరు కూడా సమంగా పంచుకోవాలని ఆయన చెప్పాడట. తాళం శాస్త్రి, శర్మల ద్వారా తప్ప మరెవరికీ తెరుచుకోదనీ, ఎంత ప్రయత్నించినా లాభం లేదని ఆయనన్నాడు. శాస్త్రి శర్మల అడ్రసు ముత్యాలవానిపాలెం యింట్లోని యువకుడి దగ్గరుంది. శ్రీనివాసరావు జరిగిందంతా తెలుసుకుని శాస్త్రి, శర్మల కోసం వచ్చాడు.

ఈ కథను శాస్త్రి, శర్మలు ఆశ్చర్యంగా విన్నారు. వా రాశ్చర్యం నుంచి తేరుకునేసరికి కారు ముత్యాలవాని పాలెం చేరుకుంది.

అప్పటికే యింట్లో చాలామంది చేరారు. వెంకటేశ్వర రావు భార్యాబిడ్డలందరూ అక్కడే వున్నారు.

ఆ గదిలో....

ఇనప్పెట్టె తాళం తీయడం యెవరివల్లా జరగడం లేదు.

శాస్త్రి ముందుకు వెళ్ళి తాళం తిప్పాడు. తక్కున తలుపు తెరుచుకుంది.

న్యాయంగా పంచుకోగా మిత్రులిద్దరికీ కలిసిన ఆస్తి విలువ చెరొక అయిదులక్షలూ....

"దేవుడు మన నాశీర్వదించాడు. జీవితంలో స్థిరపడమంటున్నాడు. లేకుంటే యిలాంటి విచిత్రం జరగదు...." అన్నాడు శర్మ.

"వెంకటేశ్వరరావును మార్చినది దేవుడా, చెంగల్రావుపేటావిడ వేదాంతమా, మన సత్ప్రవర్తనా అన్నది నాకు తెలియడంలేదు...." అన్నాడు శాస్త్రి.

"ఏమో—అంతా కలలా ఉంది. మనమిప్పుడు అర్జంటుగా అమలనూ, విమలనూ కలుసుకోవాలి—పద!" అన్నాడు శర్మ.

ఇద్దరూ సోమయాజు లింటికి వెళ్ళారు.

శాస్త్రి విమలకు పట్టుచీర యిచ్చాడు.

శర్మ అమలతో అద్దెయింటి గురించి చెప్పాడు.

ఆ సమయంలో సోమయాజులు భార్య పూజలో ఉంది. బావమరిది స్కూలుకు వెళ్ళాడు. సోమయాజులు ఆఫీసులో వున్నాడు.

"ఎలా సాధించారు?" అన్నా రమల, విమల ఏకకంఠంతో.

శాస్త్రి, శర్మ తమ విజయగాథ వివరించారు.

"అంటే మీ రిప్పుడు లక్షాధికారులు. అయినా యింకా మమ్మల్ని ప్రేమిస్తున్నారా?" అంది అమల ఆశ్చర్యంగా.

"మా లక్షలు మీ అదృష్టాన్ని పెంచడానికే—మా ప్రేమను త్రుంచడానికి కాదు—" అన్నాడు శర్మ.

"అసలు మీకు—విచిత్రమైన ప్రేమకానుకలు కోరాలని ఎందుకో కోరిక పుట్టింది?...." అన్నాడు శాస్త్రి ఆశ్చర్యంగా.

"మా అమ్మ చనిపోయే ముందా చీర కట్టుకుని ఆ యింట్లో మసలాలని ఎంతో మనసు పడింది. నాన్న ఆ కోరిక తీర్చలేదు. ఆ కోరిక తీరకుండానే అమ్మ పోయింది. ఆమెకు మేము ప్రతిరూపాలం కాబట్టి కాబోయే భర్తల ద్వారా ఆ కోరిక తీర్చుకోవాలనుకున్నాం. నిజంగా యిలా తీరుతుందనుకోలేదు. మీరు నిజంగా అసామాన్యులు. అసాధారణ పురుషులు. ఒక్కసారి పక్కగదిలోకి రండి. మా అమ్మ ఆశీర్వాదం పొందవచ్చు—" అంది అమల.

అంతా పక్కగదిలోకి వెళ్ళారు.

అక్కడ గోడకు వ్రేలాడుతోందొక పటం. పటానికి పూలమాల వుంది.

"తనకేమీ అపకారం చేయకూడదని పిన్ని రోజూ అమ్మ పటానికి మాలవేసి పూజ చేస్తూంటుంది. పిన్నికి బతికున్నవాళ్ళంటే ప్రేమ లేకపోయినా చచ్చినవాళ్ళంటే భయమెక్కువ—" అంది విమల.

శాస్త్రి శర్మ—యిద్దరూ ఆ ఫోటోవంకే ఆశ్చర్యంగా చూస్తున్నారు.

కట్టి విడిచిన చీర యిద్దరి కళ్ళ ముందూ మెదుల్తోంది.

అందరికీ వేదాంతబోధన చేయాలనుకుంటున్న చెంగల్రావు పేటావిడ—పట్టుచీరపై మమకారంతో దెయ్యమై ఆ యింట్లో తిరుగుతోంది. అంతవరకూ ఆ మిత్రుల బుర్రలో ఉన్న సందేహాలెన్నో పటాపంచలై పోయాయి. కానీ తాము నిజంగా రెండు దెయ్యాలతో వ్యవహరించామన్న స్పృహ వారి వళ్ళు జలదరించేలా చేస్తోంది.

శాస్త్రి విమల చేయి పట్టుకున్నాడు. శర్మ అమల

చేయి పట్టుకున్నాడు. రెండు జంటలూ వెనక్కి తిరి
గాయి.

గుమ్మంలో అప్పుడే పూజ చేసుకుని వచ్చిన సోమ
యాజులు భార్య వుంది. ఆమె కళ్ళలో నిప్పులు కురుస్తు
న్నాయి.

శాస్త్రి భయపడలేదు, శర్మ భయపడలేదు. ఎప్పుడూ
భయపడే అమల, విమల భయపడలేదు.

ఆ తర్వాత వచ్చిన పున్నమికి ఆ రెండు జంటలూ
వెన్నెల్లో బీచీవద్ద ఉన్నాయి.

—: అయిపోయింది :—

# చావు దెబ్బ

కె. వి. వి. సత్యనారాయణరాజు

ఆ రోజు ఉదయం రేడియోలో ఆ వార్త విన్నప్పటి నుండి, 'ఇహ తన జీవితం అయిపోయింది!' అనే నిర్ణయాని కొచ్చింది సుజనాదేవి.

ఆ న్యూస్ రేడియోలో విన్న తర్వాత అన్ని పేపర్లలోనూ మెయిన్ హెడ్డింగ్ గా ప్రచురితమైన ఆ వార్తను చదివింది.

"ప్రముఖ అంతర్రాష్ట్రీయ నేరస్థుడు బృహస్పతి— విశాఖపట్నం సెంట్రల్ జైలు నుంచి పరారీ. ప్రాణాలతో అతడిని పట్టి అప్పగించినవారికి లక్షరూపాయల నగదు బహుమతి!"

అదే వార్తను, ఆ వార్తకు సంబంధించిన వివరాలను ఎన్నోసార్లు చదివింది.

బృహస్పతి జైలు నుంచి తప్పించుకున్నాడంటే.... ఇహ తను మరణించినట్టే! తన జీవితం ముగిసినట్టే లెక్క!!

అతడు తనవద్దకు తప్పకుండా వస్తాడు. కానీ అతడు తనను కల్సుకోనక ముందే యేదో ఒకటి చేయాలి!

టెలిఫోన్ డైరెక్టరీ అందుకొంది. రెండు క్షణాల్లో నెంబరు మనసులో మననం చేసుకుంటూ వణికే చేతుల్లో రిసీవర్ పైకెత్తి డయల్ చేసింది.

అటునుంచి రెస్పాన్స్ రాగానే—"హలో.... నేను సుజనాదేవిని మాట్లాడుతున్నాను....ఇంటర్ స్టేట్ క్రిమినల్ బృహస్పతి పరారీ విషయమై మీతో ఏకాంతంగా మాట్లాడాలి. ప్లీజ్! ఒక్కసారి రాగలరా?" అని తన చిరునామా చెప్పి రిసీవర్ క్రెడిల్ చేసి మొహాన పట్టిన చిరుచెమటను సుతారంగా తుడుచుకొంది.

పది నిమిషాల్లో ప్రత్యక్షమయ్యాడు ఇన్ స్పెక్టర్ రవీంద్ర.

పదినిమిషాల తర్వాత లాన్ లో కూర్చొని ఉన్నారిద్దరూ. సంధ్యచీకట్లు ముసురుకుంటున్నాయప్పుడే.

చల్లటిగాలి శరీరానికి హాయిని కలిగిస్తోంది. కాళ్ళ క్రింది మెత్తటి పచ్చిక పరవశాన్ని కలిగిస్తోంది.

టీ త్రాగడం పూర్తిచేసి కప్పును ఎదురుగా వున్న టీపాయ్ మీద ఉంచాడు రవీంద్ర.

ఓ పెద్దపైజు కవరు నతడి చేతి కందిస్తూ అంది సుజన—"ఈ కవరు మరో వ్యక్తి కివ్వవలసిన అవసరం కలుగుతుందని నే నేనాడూ అనుకోలేదు. కానీ అనుకోనిది జరగడమే గా జీవితం!

"ఇందులోని విశేషాలు పూర్తిగా చదవండి. తర్వాత నా నిర్ణయ మేమిటో, నే నెందుకు మీ కీ వివరాలన్నీ తెలియజేస్తున్నానో చెబుతాను."

ఆమె చేతిలోంచి ఆ కవరు అందుకున్నాడు రవీంద్ర.

ఆమె లేచినిలబడి—"మీరిది చదువుతూ వుండండి. నేను ఇప్పుడే వస్తాను" అంటూ అక్కణ్ణించి కదిలింది.

## 2

"ష్...."

విజిల్ వినిపించి వెనక్కి తిరిగి చూసింది సుజన.

ఆమెకు పదడుగుల దూరంలో ఓ యువకుడు నిలబడి వున్నాడు. ఆమె వెనుదిరగడం చూసి అతడు మొహం మరోవైపుకు తిప్పుకొని ఎటో చూడసాగాడు.

చేతిలోని పుస్తకాలను గుండెలకదిమిపెట్టి తిరిగి నడకసాగించిందామె.

"ష్....ష్...."

నాలుగడుగులు ముందుకు వేశాక మళ్ళీ వినిపించింది విజిల్.

ఈసారతడు ముందే జాగ్రత్తపడి పూర్తిగా వెనుదిరిగి వీపునామెవైపు ఉంచి నడవడం ప్రారంభించాడు.

"ఇడియట్...." గొణుక్కుంటూ వడివడిగా అడుగులు వేసింది సుజన.

"ష్....ష్....ష్...."

మళ్ళీ వినిపించింది విజిల్.

ఈసారామె వెనుదిరగలేదు.

విజిల్ ఆపకుండా ఆమె వెనుకే నడుచుకుంటూ వస్తున్నాడా యువకుడు.

అతణ్ని బాగా దగ్గరకు రానిచ్చి గిరుక్కున వెనుదిరిగిందామె.

ఈసారతడు దొరికిపోయాడు.

అతడు మొహం పక్కకు తిప్పుకునేలోగా అతడి వద్దకు పరుగులాంటి నడకతో చేరుకొంది సుజన.

మరునిమిషంలో ఆమె కాలిజోడు ఆ యువకుడి చెంపలమీద నాట్యం చేసింది.

ఆ నాట్యప్రహసనం చాలామంది చూశారు.

వాళ్ళంతా ఖర్చులేకుండా సినిమా చూసి ఆనందించే బాపతు వాళ్ళేకావడాన ఎవరూ ఆమెనాపే ప్రయత్నం చేయలేదు.

చేతులు నొప్పిపుట్టేటంతవరకూ కొట్టి చేతిలోని జోడును క్రిందికి విసిరి ఎడంకాలును అందులోనికి దూరుస్తూ అంది సుజన—"ఇంకెప్పుడైనా ఇటువంటి పిచ్చి పిచ్చి వేషాలేశావంటే నోరు కుట్టించేస్తాను, జాగ్రత్త!!"

ఏం జరిగిందో తెలుసుకునేందుకు కొంచెం సమయం పట్టిందా యువకుడికి.

తేరుకుని చూసేసరికి అల్లంతదూరంలో నడుచుకుంటూ వెళ్ళిపోతోన్న సుజన అతడికి కనిపించింది.

తన చుట్టూ చెల్లాచెదురుగా నిలబడి వున్న జనాన్ని చూసేసరికి అతడి శారీరక బాధస్థానే మానసిక వ్యధ చోటుచేసుకుంది.

ఆ వ్యధ అతడి నరాల నుద్రేకపరిచింది. ఆ ఉద్రేకం అతడిలో అగ్నిని రగిల్చింది.

కానీ ఏం లాభం? అతడి అగ్నికాహుతి కాగలందుకతడి యెదురుగా ఆమె లేదు.

మర్నాడు—

బస్ స్టాప్ లో ఒక యువకుడు సుజనను పలకరించాడు.

"నిన్న కాలేజీ ఆవరణలో మీరా శేఖర్ ను బాగా బుద్ధి చెప్పారు. ఈ విషయమై నిన్నే మిమ్మల్నభినందిం

చాలనుకున్నాను. కానీ నిన్నటి మీ రూపం బెజవాడ కనకదుర్గలా, కలకత్తా కాళిలా దర్శనమివ్వడంతో మీ దరిదాపుల కొచ్చేందుక్కూడా నాకు భయం వేసింది."

విసుగ్గా చూసింది సుజన అతడివైపు.

ఆ యువకుడు తడబడి అన్నాడు. "అయామ్ సారీ, మీ పర్మిషన్ లేకుండా మాట్లాడుతున్నానేమో? ఎందుకో నిన్నట్నించి మిమ్మల్ని కల్సుకొని అభినందించాలని మహా కోరిగ్గా వుంది నాకు—మీరేమనుకున్నా సరే."

జిడ్డులా వదలకుండా పట్టుకొన్న అతడివైపు సూటిగా చూసిందీసారి సుజన.

"మరీ అంత తీక్షణంగా చూడకండి. నాకు భయం వేస్తోంది. ఇహ మిమ్మల్నెక్కువసేపు బాధ పెట్టనులెండి. నా పేరు రామకృష్ణ మీకు రెండేళ్ళు సీనియర్ని. నాదీ కెమిస్ట్రీ మెయినే. మళ్ళీ కలుసుకుందాం" అంటూ ఆమె సమాధానంకోసం ఎదురుచూడకుండా ఓ వారగా పార్క్ చేయబడి వున్న తన స్కూటర్ వైపు నడిచాడు.

పదిరోజుల తర్వాత—

బస్ స్టాప్ లో ఆగని సిటీబస్సులకోసం వెయిట్ చేయాల్సిన అవసరం తప్పింది సుజనకు.

స్కూటర్ వెనుక కూర్చొని రామకృష్ణ నడుంచుట్టూ సుతారంగా చేయిబిగించి, సిటీబస్ లకోసం వెయిట్ చేసే తోటి విద్యార్థినులమీద జాలిపడడం యెంతో బాగుందది సుజనకు.

నెలరోజుల తర్వాత—

హోటల్ సుధాలో మూడో అంతస్తులోని ముప్పై మూడో నంబరు గదిలో మొదటిసారిగా చీరవిప్పవలసి వచ్చిందామె.

పెళ్ళిగాక పూర్వం ఒక మగాడి ముందులా ప్రవర్తించాల్సి వచ్చినందుకామె యెంతో సిగ్గుపడింది.

'నీకోసం నా ప్రాణాలర్పిస్తా'ననే ఏ బడుద్ధాయీ కూడా తన మాట నిలబెట్టుకోడనే విషయం ఆమెకప్పట్లో తెలియదు.

అదామె తప్పుకాదుకూడా!

పద్దెనిమిదేళ్ళ వయసులో యే ఆడది మాత్రం అటువంటి మాటల్ని నమ్మకుండా ఉండగలదు?

“పెళ్ళిగాకముందే మన పరిచయం ఇంతవరకూ వచ్చుండకూడదు. కానీ వచ్చింది కనుక ఈ కోరిక కోరుతున్నాను. ఇప్పుడు నువ్వు నా కోరిక తీర్చనిపక్షంలో రేపుదయమే జననమరణాల ఆఫీస్‌లో నా చావును గురించి రికార్డు చేయించే బాధ్యతను నువ్వు చేపట్టాలి. అందుకు నీకిష్టమైన పక్షంలో ఇప్పుడే ఇక్కణ్ణించి వెళ్ళిపోదాం, లేదూ....”

అతడి కోరిక ఆమెను కలవరపెట్టింది.

ఆ కలవరపాటునుంచి ఇంకా కోలుకోకుండానే అతడి కోరిక తీర్చాలనే నిశ్చయానికొచ్చిందామె.

ఏ పనైనా మొదటిసారి చేసేందుకే సిగ్గేస్తుంది తప్ప మళ్ళీ మళ్ళీ చేసేటందుక్కాదు కదా!

ఆ తరువాత-రోజూ అదే గదిలో కలుసుకోసాగారు.

ఒకరోజు సాయంత్రం అయిదుగంటలకామెకు రామకృష్ణనుంచి ఫోన్ వచ్చింది.

“నిన్ను పిక్ చేసుకుందుకీరోజు నేను రావడంలేదు. సరాసరి నువ్వే ఆరుగంటలకు మన రూమ్‌కొచ్చేయ్.”

ఎప్పటిలానే తన సహ విద్యార్థిని సుభాషిణి దగ్గర చదువుకుందుకు వెడుతున్నానని చెప్పి ఇంట్లోంచి బయట

పడింది సుజన.

అరగంటలో ఆమె హోటల్ సుధా ముందుంది.

రూమ్ నంబరు ముఫ్ఫైమూడుకు చేరుకొని అప్రయత్నంగా చేతికున్న వాచీవైపు చూసుకుంది. పావుతక్కువ ఆరయింది టైమ్.

తలపంకించి చేతిని కాలింగ్ బెల్ మీదకు పోనివ్వబోయి, కరెంట్ షాక్ కొట్టినట్టు అదిరిపడింది, గదిలోంచి మాటలు వినబడడంతో. చెవులు రిక్కించి డోర్‌కు కుడిచెవిని ఆనించింది.

“రియల్లీ యూ ఆర్ జీనియస్. మంచివాడిగా మన్నన పొందుతూనే దాన్ని లైన్‌లోకి తెచ్చావ్. ఇహ నువ్వెళ్ళిపో. తనొచ్చే టైమ్ అయిందికదా? మనిద్దర్నీ ఈ గదిలో చూసిందంటే అంతా రసాభాస అవుతుంది.”

ఆ వ్యక్తి గొంతు అంతకుముందు వినకపోయినా అతడు తన గురించే మాట్లాడుతున్నాడనే విషయమామెకు అర్థమైంది.

ఇంతలో ఆమెకు పరిచితమైన గొంతు అంది — “ఓ.కే, నేను తప్పుకుంటాను. తను చాలా ప్రాంప్ట్ — అన్న మాట నిలబెట్టుకోవడంలోనే కాక పక్కమీదకూడా. విష్ యూ బెస్టాఫ్ లక్!”

ఆ గొంతు రామకృష్ణది.

ముచ్చెమటలు పట్టాయామెకు.

ఆమె మెదడు ప్రమాదాన్ని శంకించింది.

అక్కణ్ణించి పరుగెత్తి ఆ వరండా చివరకు చేరుకొంది. ఆ లాబీలోని చివరి రూమ్‌కూ, పిట్టగోడకూ మధ్య ఉన్న ఖాళీస్థలంలో నక్కింది.

ఈలోగా గదితలుపులు తెరుచుకోవడం, రామకృష్ణ,

అతడితోపాటు మరొక యువకుడూ బయటకురావడం జరిగాయి.

రామకృష్ణ ఆ యువకుడి చేయినొక్కి — "మరో కొద్దినిమిషాల్లో జరగబోయే కథ రేపు చెబుదువ్ గాని. ఇహ నువ్వు లోపలికి వెళ్ళు!" అంటూ మెట్లవైపు అడుగులు వేశాడు.

ఆ యువకుడు, రామకృష్ణ కనుమరుగయ్యేవరకూ గుమ్మంలో నిలబడి—కాస్సేపట్లో తనెదురోబోయే తీయటి అనుభవం, నరాలను మెలిపెడుతోండగా గది లోకి నడిచాడు.

వరండా చివరినుంచి తల మాత్రమే బయటకు పెట్టిన సుజన దృష్టినా యువకుడు దాటిపోలేదు.

అతన్ని చూసీ చూడగానే గుర్తుపట్టిందామె.

అతడు శేఖర్!

రెండు నెలల క్రితం కాలేజీ ఆవరణలో తనచేత చెప్పుదెబ్బలుతిన్న శేఖర్!!

ఆమెకంతా అర్థమైంది.

తనను ప్రేమించినట్టు నటించి తరువాత స్నేహితుడి కప్పగించేందుకు చాలా పటిష్టమైన ప్రణాళిక వేశాడు రామకృష్ణ.

తనేం చేయాలో అప్పుడే, అక్కడే నిర్ణయించు కుంది సుజన.

సరిగ్గా అరుగంటలకామె ఆ గదిముందు నిలబడి కాలింగ్ బెల్ నొక్కింది.

అసహనంగా గదిలో తిరుగుతూ చేతికున్న వాచీవైపు మాటిమాటికీ చూసుకుంటోన్న శేఖర్ మదిలో కాలింగ్ బెల్ మోత మధుర రాగాలను పలికించింది.

తనను తాను కంట్రోల్ చేసుకుంటూ తలుపు తెరిచి, ఒక చెయ్యి ముందుకు చాపాడు—ఆమె తనను గుర్తించే లోగా గదిలోకి లాగి తలుపు వేసేందుకు.

కానీ అతడికా అవసరం కలగలేదు.

డోర్ తెరుచుకొన్న వెంటనే అతణ్ని చూసి నవ్వు మొహంతో లోపలకడుగు పెట్టింది సుజన.

ఆమె రియాక్షన్ చూసి అతడు బిత్తరబోయాడు.

అతడి ఆశ్చర్యాన్ని మరింత పెంచేలా అందామె— "ఏమిటలా ఆశ్చర్యపోతున్నారు?! మీ ఇద్దరి మాటలూ విన్నాను. మీ ప్లాన్ అమోఘం! కానీ నాకొక్కటే నచ్చలేదు. మీకు నామీదంత మనసున్నపుడు డైరెక్టుగా వ్యవహారంలోకి దిగక మధ్యలో ఆ డాఫర్ వెధవనెందుకు కిరికించారు?"

తెరిచిన నోరు మూతపడలేదు శేఖర్‌కు.

"ఆ రోజు మిమ్మల్ని కొట్టినందుకు నేనెంతో బాధపడ్డాను. తరువాత మీరు కనిపిస్తే క్షమాపణ చెప్పుకుందామని చూశాను. కానీ ఇంతవరకూ మిమ్మల్ని కలిసే అవకాశమే కలగలేదు. నన్ను క్షమించరూ?" అందామె దీనంగా మొహం పెట్టి.

తననుతాను గిల్లి చూసుకున్నాడు శేఖర్!

తన ప్రణాళిక తెలిసికూడా అంత నిబ్బరంగా మాట్లాడుతూ పైగా తనను క్షమించమని అడుగుతోన్న ఆమెను ఏ విధంగా అర్థం చేసుకోవాలోనన్న విషయం అతడి ఊహ కందలేదు.

అతడికి దగ్గరగా వచ్చి—"నా మాటలు నమ్మలేకపోతున్నారా? నేను మనఃస్ఫూర్తిగానే అడుగుతున్నాను. నన్ను క్షమించరూ?" అందామె అతడి చేతి నందుకుని

తన గుండెలమీద వుంచుకుంటూ.

పూర్తిగా కరిగిపోయాడు శేఖర్.

అతడు తిరిగి ఘనీభవించి మామూలుగా అయ్యే అవ కాశాన్నతడికివ్వకుండా—"నలుగురూ తిరిగే చోట విజిల్ వేస్తే నావ కోసం రాదూ మరి! అయినా మీ క్కావల్సింది పొందే పద్ధతి అదేనా?" అంటూ చిరు కోపంతో మృదువుగా మందలిస్తున్నట్టుగా అందామె.

శేఖర్ గుండెలు విపరీతంగా కొట్టుకోవడం ప్రారం భించాయి.

అతని కాలర్ను ఓ చేత్తో సవరిస్తూ బుంగమూతి పెట్టి అందామె.

"ఎవరూ లేనప్పుడు నన్ను కలిసి మీ కోరిక వ్యక్తం చేస్తే నేను కాదనేస్తానని భయపడ్డారా? మన మధ్యలో ఆ వెధవ నెందుకు కిరికించారు? నిజానికి మీ గురించి, అతడితో పరిచయమైన మర్నాడే అడిగాను. కానీ దాటవేశాడు.

మీ ప్రణాళిక ప్రకారం నన్ను పరిచయం చేసు కున్నాక అతడు నన్ను మీకు తప్పగించాలి! అంతేగా? కానీ ఆ రామకృష్ణ యెంత స్వార్థపరుడో చూడండి. నే నతడి స్వంతం అయ్యేక కూడా చాలా రోజులు తాత్సారం చేశాడు, మీ కప్పగించేందుకు. ఇదేనా మీ యిద్దరి స్నేహం?"

శేఖర్ దవడలు బిగుసుకున్నాయి.

"అతడు నన్ను ముందే మీకు తప్పగించి వుంటే.... కన్యగానే మీ స్వంతం అయ్యుండేదాన్ని కదా? కానీ మీరు స్నేహితుడని నమ్మినందుకు తన అవసరం తీర్చు కున్నాక నే మీ కప్పగించాడు నన్ను.

మీ కెలా వుందో గానీ నాకు మాత్రం అతణ్ణి నిలువునా చీరేయాల నుంది, అతడు చేసిన నమ్మక ద్రోహానికి...."

శేఖర్ కు ఆవేశం వచ్చింది. "ఆ వెధవను చంపేస్తాను" అన్నాడు.

సుజన నవ్వి అంది—"నిజంగా ఆ సాహసం చేయగలరా మీరు?"

"వాణ్ణి చంపాక నే నీ దగ్గర కొస్తాను" అంటూ కట్టుకొన్న లుంగీ విప్పి పాంట్ ధరించేందుకు హేంగర్ వైపు నడిచాడు.

చప్పట్లు కొడుతూ అంది సుజన—"తలచిన నాడే తాత పెళ్ళి జరగాలంటే యెలా? కొంచెం ఓపిక పట్టండి. మీ రనుకున్నది సాధిస్తారనే నమ్మకం నాకుంది."

తన ప్రయత్నాన్ని విరమించుకొని ఆమె దగ్గరకు నడిచి ఆమె భుజంమీద చేతులు వేస్తూ అన్నాడు శేఖర్—"ఆలస్యమెందుకు?"

ఓ చేత్తో అతణ్ణి విడిపించుకుంటూ—"నా తనువును మీ కర్పించాలని మీ కంటే యెక్కువ తహ తహగా వుంది నాకు. తొందరెందుకు? ఆ నయవంచకుడీ లోకం నుంచి శాశ్వతంగా దూరమైన నాడే నన్ను నేను మీకు సంతోషంగా అర్పించుకోగలను. అంతవరకూ ఆగలేనంటే మీ ఇష్టం...." అందామె నిరాసక్తంగా.

అతడి వేడి చల్లారింది.

"కంగారేం లేదు. రేపే ఆ వెధవను చంపుతాను. ఎల్లుండే మనకు శోభనం!" అన్నా డావేశాన్ని సంతోషంతో మిళితం చేసి.

"విష్ యూ బెస్టాఫ్ లక్!" అంటూ అతడి నుదుటి మీద ముద్దు పెట్టుకొని గదిలోంచి బయటకు నడిచింది సుజన.

# 3

మర్నాడు—

కాలేజీలో తనను చూసి మొహం చాటు చేసుకొని పోబోతున్న రామకృష్ణను పేరు పెట్టి పిలిచింది సుజన.

అతి డాశ్చర్యంగానూ, భయంగానూ ఆమె వద్దకు వచ్చాడు.

అతణ్ణి సీరియస్ గా చూస్తూ అందామె—"నిన్న నన్ను రమ్మని చెప్పి నువ్వెందుకు రాలేదు? మనిద్దరి సంగతి గమనించిన వెధవ—వాడే. ఆ రోజు నాతో చెప్పు దెబ్బలు తిన్న చవట—ఆ రూమ్‌లో వున్నాడు.

మనిద్దరి గురించి తనకంతా తెలుసునని, అసలు నువ్వే నన్ను వాడికప్పగించేందుకు నన్ను ప్రేమించినట్టు నటించావని, కారుకూతలు కూశాడు.

నాకప్పుడే అనుమానం వచ్చింది—నిన్నెక్కడో దాచిపెట్టి, మాయకబుర్లు చెప్పి నన్ను లొంగదీసుకుందుకు ప్రయత్నిస్తున్నాడని. పిచ్చి పిచ్చి వేషాలు వేస్తే ప్రాణాలు తీయిస్తానని చెప్పి మరోసారి చెప్పుతో ఎడా పెడా వాయించి వచ్చాను.

ఆ వెధవ కెంత ధైర్యం? నువ్వు డాఫర్ వట. నన్నా వెధవ కప్పగించేందుకే నువ్వు నన్ను ప్రేమించినట్టు నటించావట, నువ్వు వాడి కిరాయి మనిషివట.

తను చెప్పే పనులు చేసేందుకే నీకు కాలేజీ ఫీజ్ కడుతూ నిన్ను పోషిస్తున్నాడట.

రేపొద్దుట నీకు పెళ్ళయినా ముందు వాడు రుచి

చూసిన తరువాతే నీ పెళ్ళాన్ని నీ కప్పగిస్తాడట. అప్పుడు కూడా నువ్వు వాణ్ణేమీ అనలేవట.

వాడి మాటలు వింటూంటే నా వళ్ళు ఉత ఉతా ఉడికిపోయింది. "నిను ఒక్క రోజు టైమిస్తున్నాను. నువ్వు వాణ్ణి చంపినా సరే, లేదా నన్నే వాణ్ణి చంపమన్నా సరే! ఆలోచించుకో!"

ఊపిరి బరువుగా పీల్చి వదిలాడు రామకృష్ణ.

"నిన్న నీ కోసం బయల్దేరి వద్దామని స్కూటర్ స్టార్టు చేశాను. ఒక్క అడుగు కూడా ముందుకు కదల దేం? అప్పుడు చూశాను, టైర్ల వంక. గాలి పూర్తిగా దిగిపోయి వుంది రెండు చక్రాల్లోనూ.

ఏం చేయాలా? అని ఆలోచిస్తోంటే నా వద్దకు వచ్చాడు శేఖర్. అతడితో నా కంతగా పరిచయం లేదు. అయినా పెద్ద పరిచయం ఉన్నవాడిలా—'ఎక్కడికో బయలుదేరినట్టున్నారు. పదండి నేను డ్రాప్ చేస్తాను' అన్నాడు అప్రయత్నంగానే కారెక్కాను.

వెనుక సీట్లో ఎవరో అమ్మాయుంది. కొంచెం దూరం ప్రయాణించానో లేదో వెనుక సీట్లోని అమ్మాయి ముందుకు వంగి తన చేతిలోని కర్చీఫ్‌ను నా మొహంమీద బలంగా అదిమి పెట్టింది.

తరువాత నేను కళ్ళు తెరిచేసరికి పేవ్‌మెంట్ మీద పడివున్నాను. హోటల్‌కి వెళ్ళి చూస్తే నువ్వు లేవు. నాకు స్పృహ తప్పించాక నా జేబులోంచి హోటల్ రూమ్ కీ తీసుకుని వుండివుంటాడు వెధవ!

వాడి అంతు తేల్చేందుకే నేనీ రోజు కాలేజీకి త్వరగా వచ్చాను. రాత్రి నీకేం జరిగిందో అని భయ పడడం వల్ల నే నీకు మొహం చూపించేందుకు నేను సిగ్గు

పడాల్సి వచ్చింది" అంటూ అందంగా కథ అల్లి చెప్పి తల దించుకున్నాడు రామకృష్ణ.

"రాస్కెల్, వాణ్ని నలుగుర్లోనూ అవమానించానని ఇలా కత్తి తీర్చుకునే ప్రయత్నం చేస్తాడా? వాడు చచ్చే వరకూ నా మనసుకు శాంతి లేదు. ఇంకా నయం! రాత్రి నాకేమీ కాలేదు కనుక సరిపోయింది. ఒకవేళ నాకేమైనా అయ్యుంటే...." అంటూ రెండు చేతుల్లోనూ మొహం దాచుకొంది సుజన.

ఆమె మాటలు విని పళ్ళు పటపట లాడించాడు రామకృష్ణ.

ఆ రోజు సాయంత్రం కాలేజీ ఆవరణలో సైన్స్ బ్లాక్ వెనుక వళ్ళంతా కత్తిపోట్లతో కనబడిన రెండు శవాలను అందరిలాగానే అమాయకంగా చూసింది సుజన.

కానీ మిగిలినవాళ్ళలా ఆశ్చర్యపోలేదామె.

## 4

తలెత్తకుండా ఓరగా చూసింది సుజన.

ఆమెవైపే అంతవరకూ చూస్తూన్న ఆ యువకుడు తల తిప్పుకొని చేతిలోని పెన్‌తో ఎదురుగా వున్న ఫైల్ మీద సంతకాలు చేయడంలో బిజీ అయిపోయాడు.

కాలేజీ చదువులు బుద్ధిగా ముగించుకొని, తన చదువుకు సంబంధం లేని ఉద్యోగంలో ఈ మధ్యనే చేరిందామె.

ఫార్మల్‌గా ఏవో పెళ్ళి సంబంధాలు వెతుకుతున్నారే గానీ ఆమెకిప్పట్లో పెళ్ళిచేసే ఉద్దేశ్యమామె తల్లిదండ్రులకు లేదు.

ఏ అమాయక చక్రవర్తో తమ కూతురి అందచందా

అను చూసి మోజుపడి, తనంతట తనే ఆమెను పెళ్ళి చేసుకుందుకు ముందుకొచ్చి—తమనూ అతడితోనే కలిసి ఉండమంటే బావుంటుందనే ఆశతో రోజులు వెళ్ళబుచ్చుతున్నారు, వాళ్ళిద్దరూ.

తల్లిదండ్రుల మనోవాంఛ ఆమెకు తెలుసు. అందుకే ఉద్యోగంలో చేరిన దగ్గర్నుంచీ ఆ ప్రయత్నంలోనే వుందామె.

కానీ నాలుగేళ్ళ క్రితం తన కెదురైన భయంకరమైన అనుభవాన్నామె మరచిపోలేదు. అందుకే ఈసారి తనెన్నుకోబోయే మగవాడి విషయంలో అన్ని జాగ్రత్తలూ తీసుకోదలచిందామె.

ఆమె పనిచేసే ఆఫీస్‌లో ఆమె కాక ముగ్గురాడవాళ్ళున్నారు. వాళ్ళలో ఇద్దరికి పెళ్ళిళ్ళయ్యాయి.

మిగిలిన నారీమణి—సునీతకు పెళ్ళి కాకపోయినా ఆమె ఏ విధంగా పోల్చినా సుజన ముందు తీసికట్టే!

సుజన ఆ ఆఫీస్‌లో చేరక ముందు అడపాదడపా ఆమెవైపు వెకిలిగా చూసే మగవాళ్ళు సుజనక్కడ చేరాక తమ చూపులన్నామెమీదే కేంద్రీకరించడం ప్రారంభించారు.

నిత్యమూ ఆమెను చూడడంలోనే ఎక్కువ సమయం గడిపేవాళ్ళలో సుధాకర్ ప్రథముడు. మిగిలినవాళ్ళంతా అతడి తర్వాతే.

అందుకు కారణం—సుజన ప్రవర్తనే కావచ్చు.

సుధాకర్‌ని తప్ప ఆ ఆఫీసులో మరే మగవాడినీ ఆమె పట్టించుకోలేదు. కాకపోతే గత అనుభవంవల్ల తొందరపడకుండా అతణ్ని అబ్జర్వేషన్‌లో ఉంచిందామె.

ఆమెకు తెలిసిన వివరాల ప్రకారం—అతడి కింకా పెళ్ళి కాలేదు. చెడు అలవాట్లు లేవు. సున్నిత మనస్కుడు.

ఒకసారి ఆఫీసులో ఓ కండచీమ అతణ్ని కుట్టింది. కానీ దాన్నతడు చంపే ప్రయత్నం చేయకుండా వంటి మీదినుంచి విదిల్చి—"పాపం శివు డాజ్ఞ ప్రకారం నా దగ్గరకు వచ్చి వుంటుంది...." అన్నాడు పక్కసీటు కొలీగ్ తో.

అతడి మాటలు సుజన వింది.

అమాయకత్వం, క్షమాగుణం—అనే రెండు గుణాలూ అతడిలో వున్నాయనే విషయ మప్పుడే తెలిసింది సుజనకు.

మరికొన్ని పరీక్షలు చేసి—అతణ్ని తన జీవితంలోకి ఆహ్వానించవచ్చునని నిర్ణయాని కామె వచ్చింది,

ఆ మర్నాడు తనవైపు చూస్తూన్న అతడి కళ్ళలోకి చూసి సన్నగా నవ్వింది.

అతడూ నవ్వాడు—భయం భయంగా.

తర్వాత—సుధాకర్ నో రోజు ఇంటికి తీసుకువెళ్ళి తల్లిదండ్రులకు పరిచయం చేసింది.

సుధాకర్ వారికెంతో నచ్చాడు.

మాకు సుజన ఒక్కర్తే సంతానమనీ, ఆమెను చూడ కుండా మేముండలేమనీ, అతడామెను వివాహం చేసు కోవాలనే పక్షంలో అతడే తమింటికి రావాల్సి వుంటుం దని—తమ మనసులోని అసలు కోరికను దాచి పెట్టి మహా తెలివిగా అతణ్ని బుట్టలో వేశా రిద్దరూ జమి లిగా.

అందు కతడంగీకరించడంతో మర్నాటి నుంచీ ఆ

ఊళ్ళోని సినిమాహాళ్ళూ, పార్కులూ, వాళ్ళిద్దరి ప్రేమను పటిష్టం చేసుకునేందుకు సహకరించాయి.

సుజన ఓ రోజు సుధాకర్ రూమ్‌కు వెళ్ళింది.

అత డారోజు సాయంత్రం అయిదు గంటలకు బీచ్‌లో వుంటానని ప్రామిస్ చేశాడు. అతడికోసం ఆరుగంటల వరకూ చూసి చీకటి పడిపోవడంతో యింటికి బయ ల్దేరింది.

కానీ మధ్యలో ఆమె ఆలోచన మారింది. సుధాకర్ రూమ్‌వైపు ఆమె కాళ్ళు అప్రయత్నంగానే దారి తీశాయి.

అతడి రూమ్‌వద్దకు చేరి ఓరగా వేసున్న తలుపులు తోయబోతూ లోపల్నించి మాటలు వినబడడంతో ఆగి పోయింది.

లోపల్నించి వినిపిస్తోన్న రెండు గొంతులూ పరిచిత మైనవే.

ఒకటి సుధాకర్‌ది.

మరో గొంతు సునీతది.

సునీత అంటోంది—"సుజన మన ఆఫీసులో చేరక ముందు నాతో యేమని చెప్పేవాడివి? నీ కోసమే నేను పుట్టి వుంటానన్చెప్పి నన్ను లొంగదీసుకున్నావు. ఇప్పుడు నీ కన్ను సుజనమీద పడింది. పోనీ ఆమెనైనా పెళ్ళి చేసుకుంటావా?"

"సుజనను చూడకముందు నువ్వు నా కంటికి కందంగా కనిపించావు. ఆ మాటా ఇప్పుడూ ఒప్పుకుంటాను. నేను సుజనను పెళ్ళిచేసుకుంటానో, మరో సుమిత్రను చేర దీస్తానో నీ కనవసరం.

"నిన్ను మాత్రం పెళ్ళి చేసుకోననే విషయం నువ్వు

ఇప్పటికైనా గ్రహిస్తే సంతోషిస్తాను"—వ్యంగ్యంగా అన్నాడు సుధాకర్.

మ్రాన్పడిపోయింది సుజన.

తను జీవితంలో రెండోసారి మోసపోయింది.

ఆమె దేహంలోని రక్తం కుత కుతా ఉడికిపోయింది.

మర్నాడు—ఆఫీస్‌లో, తన ప్రణాళిక గురించి సునీతతో వివరంగా చర్చించాక ఆమె మనసు కుదుట పడింది కొంతవరకూ.

ఆ రోజు సాయంత్రం ఎప్పటిలా సుధాకర్ పార్కులో గడిపింది సుజన చీకటిపడేవరకూ.

విడిపోయే ముందు తనంతట తనే. 'నీ రూమ్‌కు వస్తానని' సుజన అనడంతో ఆశ్చర్యపోయి ఆమె బుగ్గమీద చిటిక వేసి అన్నాడు సుధాకర్—"యు ఆర్ వెల్‌కమ్ సుజీ, నే నెప్పట్నించో నిగ్రహించుకోలేకపోతున్నాను. నువ్వేమంటావోనని భయపడుతూ ఇన్నాళ్ళూ తాత్సారం చేశాను. రియల్లీ ఆయామే ఫూల్. "ఆడది నోరువిప్పి అడిగేటంతవరకూ ముద్దపప్పులా పడుండడం—నా తెలివి తక్కువతనం కాక మరేమిటి?"

సుజన నవ్వి అంది—"రాత్రికూడా అలానే ప్రవర్తించవు కదా, కొంపదీసి?"

సుధాకర్ మొలికలు తిరిగి పోయాడు. "నువ్వే చూస్తావుగా?!" అంటూ అక్కణ్ణించి కదిలి హడావుడిగా వెళ్ళిపోయాడు—తన గదిని ఆ అత్యల్ప వ్యవధిలోనే శోభనం గదిలా మార్చేందుకు.

రాత్రి తొమ్మిది గంటలకు సుధాకర్ రూమ్‌లోకి అడుగుపెట్టింది సునీత.

శోభనం పెళ్ళికొడుకులా మంచంమీద పడుకొని

ఉన్నాడు సుధాకర్. తలుపు తోసిన చప్పుడు కావడంతో తలెత్తి చూశాడు.

గుమ్మంలో నిలబడిన సునీతను చూసి అదిరిపడ్డాడు.

"నువ్వెందుకొచ్చావ్. దిష్టి మొహమా? వెళ్ళు, ఇక్కడ్నించి త్వరగా వెళ్ళిపో!"

సునీత తిరిగివెళ్ళే ప్రయత్నంచేయకుండా అతడివైపు అడుగులు వేస్తూ అంది—"ఎందుకలా కంగారుపడతావ్? నన్ను పెళ్ళిచేసుకోమని పోరేందుకు మళ్ళీ రాలేదులే! నువ్వు నన్నెంత కాదన్నా నాకెందుకో నీమీద మనసు చావలేదు. ఇలా సిగ్గువిడిచి అడుగుతున్నందుకైనా నువ్వు నా కోరిక తీర్చొచ్చు."

సుధాకర్ మంచంమీద నుంచి క్రిందకు దిగాడు.

ఆమె భుజంమీద ఓ చేయి వేసి, మరోచేతి నామె గడ్డం క్రింద వుంచి—"నా చిట్టితల్లివి కదూ, ఈ రోజుకు వెళ్ళిపో! రేపు రాత్రి ఇదే టైముకు నీ ముద్దు చెల్లిస్తాను తప్పకుండా."

మరుక్షణం—"హియర్, హియర్" అనే మాటలతో పాటు చప్పట్లు వినిపించాయతడికి.

అవాక్కైపోయాడు సుధాకర్.

గుమ్మంలో నిలబడి వుంది సుజన.

అతడికి నోరు పెగలలేదు. సుజన గదిలోకి వచ్చి తలుపులు మూసి గడియ బిగించి—"చీమకు కూడా అపకారం చేయని సున్నిత మనస్కుడనుకున్నాను ఇన్నాళ్ళూ. అవసరమైతే డబుల్ గేమ్స్ ఆడే సామర్థ్యం కూడా నీకు ఉందని ఇప్పుడే తెలిసింది నాకు.

ఎనీవే, ఇప్పటిదాకా నువ్వు ఆడవాళ్ళతో ఆడుకున్నావు. ఇక నీతో ఆడవాళ్ళాడే ఆట యెలా

వుంటుందో చూద్దువుగాని" అంటూ అతనికి సమీపంగా వచ్చింది.

సుధాకర్ మొహంమీది నుంచి చెమటలు ధారపాతంగా కారుతున్నాయి. మాట్లాడే శక్తి ఏనాడో కోల్పోయాడతడు.

సునీత అతడి కాలర్ పట్టుకొని గుంజింది. సుజన అతడి గ్లాస్కో పంచె పట్టుకొని లాగింది.

చేయి సాచి సునీత అతడి ముక్కుమీద బలంగా చరిచింది.

సుజన రెండు చేతుల మధ్యా అతడి మొహాన్నిరికించి చేతిగోళ్ళతో అతడి చెంపలు చీరింది లోతుగా. మొహం మీదినుంచి కారుతోన్న చెమటతో కలిసి రక్తం ధారలుగా క్రిందికి ప్రవహించి అతడి తెల్లటి షర్టును తడిపేసింది.

పక్కనే టేబిల్ మీద ఉన్న పేపర్ వెయిట్ నందుకొని అతడి తొడల మధ్య బలంగా కొట్టింది సునీత.

మరో పావుగంట తర్వాత—అతడిలోని పురుషత్వపు అహంకారానికి కారణమైన అవయవాల్ని యెందుకూ పనికిరాకుండా చేయడంలో యిద్దరూ కృతకృత్యులయ్యారు.

సుజనకి అప్పటికిగానీ చల్లారలేదు.

రక్తసిక్తమైన పొడవాటి చేతిగోళ్ళను తృప్తిగా చూసుకుంటూ సునీత భుజంమీద చేయివేసి ఆ గదిలోంచి బయటకు నడిచింది సుజన.

# 5

పన్నెండేళ్ళు గడిచాయి.

సుజన తల్లిదండ్రులు కాలగర్భంలో కలిసిపోయారు.

మిస్ సుజన, సుజనాదేవిగా మారినా ఇంకా మిస్ గానే మిగిలిపోయింది.

మగాడివైపు కన్నెత్తి చూడకుండా దృష్టినంతా పని మీదే కేంద్రీకరించి ఒక పెద్ద కంపెనిలో ఆఫీసరు ఉద్యోగాని కెదిగింది.

తన పని తప్ప మరో ప్రపంచ మామెకు తెలియదు. భరించరాని ఒంటరతనా న్నెదుర్కొనేందుకు పనిమీద కాన్సన్ట్రేట్ చేయడం ఓ వరంలా అనిపించే దామెకు.

సాఫీగా సాగుతూన్న ఆమె జీవితంలో ఒకనాటి రాత్రి అనుకోని సంఘటన జరిగింది. ఆ సంఘటన ఆమె జీవితపు సరళిని మార్చివేసింది.

ఆ రాత్రి—

బంగాళాఖాతంలో యేర్పడిన అల్పపీడనం కారణంగా— చెవులు హోరెక్కేంతలా గాలి వీస్తోంది.

ఉరుములు, మెరుపులతో ఆకాశం బీభత్సంగా ఉంది.

వర్షం కుండపోతగా కురుస్తోంది.

వర్షపుజల్లు ఇంట్లోకి రాకుండా, కిటికీలన్నీ మూసి, తలుపులకున్న గడియలన్నీ జాగ్రత్తగా వేసి బెడ్ రూమ్ లోకి చేరుకుందామె.

ఇర్వింగ్ వాలెస్ నవల— 'ది పీజియన్ ప్రాజెక్ట్' చదువుతూ అందులో వర్ణించబడిన ఒక శృంగార సన్నివేశాన్ని మదిలో తలచుకుంటూ నిద్రలోకి జారుకొంది.

సరిగ్గా రెండు గంటల తర్వాత ఆమె ఇంటి తలుపులు దడ దడా శబ్దం చేశాయి.

మత్తుగా కళ్ళు విప్పిందామె.

బెడ్ లాంప్ ఉంటే ఆమెకు నిద్ర పట్టదు. ఆ చీకటి కామె కళ్ళు అలవాటు పడేందుకు కొంచెం సమయం పట్టింది.

ఎదురుగా అల్మైరాలో ఉన్న రేడియం డయల్ అలారం టైమ్‌పీస్ ఒంటిగంటా పదిహేను నిమిషాలు సూచిస్తోంది.

తలుపుమీద చప్పుళ్ళు ఆగకుండా వినిపిస్తూనే ఉన్నాయి.

అంత రాత్రివేళ తనింటి కెవరొచ్చారో అర్థంకాలేదామెకు. ఆలోచించిన కొలదీ ఆమె మనసు కీడును శంకించసాగింది.

ఒళ్ళు విరుచుకొని లేచి నిలబడి—"ఎవరది?" అని గట్టిగా అరిచిందామె.

కానీ ఆ వాతావరణంలో తన మాట తనకే వినిపించనట్టుగా అనిపించడంతో స్లిప్పర్స్ తొడుక్కొని డ్రాయింగ్ రూమ్‌వైపు నడిచింది.

మెయిన్ డోర్ బోల్టు తీయబోతున్నదల్లా ఆ ప్రయత్నం విరమించుకొని డోర్ మీద గుండ్రంగా ఉన్న చెక్కపలకను పక్కకు జరిపి మొహం దూరంగా ఉంచి ఆ రంధ్రంలోంచి బయటకు చూస్తూ గట్టిగా అరిచింది—"ఎవరూ, ఎవరది!"

బయటి నుంచి వినబడిన చప్పుళ్ళు ఆగిపోయాయి.

"హెల్ప్.... హెల్ప్....దయచేసి తలుపుతీయండి. వాళ్ళొచ్చేస్తున్నారు....నన్ను చంపేస్తారు...." ఆ.

కంగారుగా అరిచిందో కంఠం.

ఒక్క క్షణం ఆమె తటపటాయించింది. చివరకు బోల్టు తీసి తలుపు కొద్దిగా తెరిచి పట్టుకొంది.

తలుపవతల వున్న వ్యక్తి తలుపును బలంగా తోసుకొని లోపలకు ప్రవేశించాడు. వెనువెంటనే ఆలస్యం చేయకుండా డోర్ మూసి బోల్టు బిగించాడు.

తలుపుకు జేరబడి బరువుగా ఊపిరి పీల్చి వదులుతూ అన్నాడు—"థాంక్స్. థాంక్యూ వెరీమచ్! మీ ఋణం ఉంచుకోను" అంటూ జేబులో చెయ్యిపెట్టి ఒక వస్తువు బయటకు తీశాడు.

దాన్ని చూసి అదిరిపడింది సుజన.

అతడి చేతిలో నల్లగా నిగనిగలాడుతూ మెరుస్తోంది రివాల్వర్!

ఆమె తత్తరపడి రెండడుగులు వెనక్కి వేసింది.

అతడామెను సమీపిస్తూ—"అయామ్ సారీ, జేబులో చెయ్యి పెట్టగానే అలవాటు ప్రకారం బయటికొచ్చేసిందిది" అని కుడిచేతిలోని రివాల్వర్‌ను బొడ్లో దోపి మళ్ళీ జేబులో చెయ్యిపెట్టాడు.

ఈసారతడి చేతిలోకి వచ్చిన వస్తువును చూసి ఆమె కళ్ళు ఆశ్చర్యంతో విచ్చుకున్నాయి.

రత్నాల నెక్లెస్ ధగధగా మెరుస్తోందతడి చేతిలో!

దాన్నామె మీదకు విసురుతూ అన్నాడు—"నన్ను ప్రాణాపాయం నుంచి రక్షించినందుకు నీకిది బహుమతిని తీసుకో!"

ఆమె ఆ నెక్లెస్ నందుకునే ప్రయత్నం చేయకపోవడంవలన అదామె వంటికి తగిలి నేలమీద పడింది.

ఒకసారి క్రిందపడిన ఆ నెక్లెస్ వైపు చూసి తిరిగి అతడి

వైపు దృష్టి సారించిందామె. అతడి ఒంటిమీది బట్టలు పూర్తిగా తడిసిపోయి వున్నాయి.

అతడి కళ్ళు చిన్నవే అయినా చాలా చురుగ్గా కదులుతున్నాయి.

నీలం రంగు జీన్స్‌పాంట్ అతడి ఒంటి కతుక్కుపోయి ఉంది. అదే రంగులో వున్న జర్కిన్ అతని ఒంటి మీద వుంది.

క్రిందకు వంగి నేలమీద పడిన నెక్లెస్ నందుకొని అతడివైపు చేయిసాచి—"టేక్ దిస్ అండ్ ప్లీజ్ గెటవుట్" అంటూ డోర్ వైపు అడుగులు వేసింది సుజన, బోల్టు తీసేందుకు....

అతి వేగంగా కదిలాడతడు.

మరుక్షణం—ఆమె చేయి అతని పిడికిలి మధ్య ఇరుక్కుంది.

"ప్లీజ్, నన్ను మరికాస్సేపు ఇంట్లో దాక్కోనీ. తరువాత నా దారిన నేను పోతాను."

సుజన తీక్షణంగా చూసిందతడివైపు.

ఆమె ఏదో సమాధానం చెప్పేంతలో తలుపులు తిరిగి శబ్దం చేశాయి.

ఇద్దరూ ఉలిక్కిపడ్డారు.

అతడామెవంక దీనంగా చూస్తూ—"వాళ్ళొచ్చేశారు. వెళ్ళి తలుపు తీయి. ప్లీజ్! వాళ్ళకనుమానం కలక్కుండా ఏదో చెప్పిపంపించు" అని ఆమె సమాధానం కోసం యెదురుచూడకుండా కిచెన్‌లోకి దారితీశాడు.

"తలుపులు తెరవండి. ఎవరది లోపల?" అనే మాటలతో పాటు తలుపులు దబ దబా శబ్దం చేస్తూనే ఉన్నాయి.

చురుగ్గా కదిలించా మె.

మెయిన్ డోర్ వద్దకు వచ్చి—"ఎవరది?" అంది, విసుగునూ, మాతునూ కంఠంలో మిళితం చేస్తూ.

"ఇన్ స్పెక్టర్ సక్సేనా... తలుపులు తెరవండి" అనే మాటలు వినిపించి, డోర్ మీద వున్న గుండ్రటి పలకను తప్పించి అందులోంచి చూస్తూ—"వాటీజ్ దిస్ నాన్సెన్స్" అంది.

తలుపుదగ్గర ఉన్నది స్త్రీ అని తెలియడంతో ఇన్ స్పెక్టర్ గొంతులోకి అప్రయత్నంగానే మృదుత్వం వచ్చింది.

"సారీ మేడమ్, ఒక దొంగ మీ యింటి ఆవరణలో ప్రవేశించాడు. ఇంట్లోకేమైనా వచ్చాడేమోనని ....."

అతడి మాటలు పూర్తికాకుండానే బోల్టుతీసి తలుపు తెరుస్తూ అంది—"వాడ్డూ యూ మీన్? దొంగా నా యింట్లో దూరితే వాడితో పరాచికాలాడుతూ, ఇంట్లో దాచిపెట్టానంటారా? కమిన్ ....... సెర్చ్ ది హోల్ హౌస్."

ఆ ఇన్ స్పెక్టర్ లోపల కడుగుపెట్టే ప్రయత్నం చేయలేదు.

"నో మేడమ్, ఐ డోన్ట్ మీన్ ఇట్. మిమ్మల్ని ఎలర్ట్ చేసేందుకే మీకు నిద్రాభంగం కలిగించాల్సి వచ్చింది.

ఇఫ్ యు డోన్ట్ మైండ్, మీ ఇంటి ఆవరణలో ఓ సారి సెర్చ్ చేస్తాను. ఇంట్లో వుంటే మీరే వాణ్ని తప్పించేవారుగా?" అంటూ తన బలగంతో మెట్లు దిగి యింటి చుట్టూ వున్న మొక్కల మధ్య వెదకసాగాడు సక్సేనా.

పదినిమిషాల సేపు టార్చ్ లైట్ల వెలుతురులో ఆ ఆవరణంతా క్షుణ్ణంగా శోధించి సక్సేనా ఆమె దగ్గరకు వచ్చి అన్నాడు—"సారీ మేడమ్. వాడీ యింటి గేటు దాటి లోపలకు దూకడం నా కళ్ళతో చూశాను. అందుకే మీకిబ్బంది కలిగించవలసి వచ్చింది. మా తృప్తికోసం ఇంట్లో కూడా ఒకసారి సెర్చ్ చేసి వెళ్ళిపోతాం!"

సుజన గుండెలు దడ దడా కొట్టుకున్నాయి.

చేసేదేమీ లేక—"ఆల్ రైట్! నా నిద్రెలాగూ పోయింది. రండి లోపలకు" అంటూ డోర్ కడ్డం తొలగింది.

సక్సేనా లోపలకు ప్రవేశించాడు.

డ్రాయింగ్ రూమ్ దాటి వరండాలోంచి కిచెన్ రూమ్‌లోకి నడిచాడు.

సుజన గుండె ఒక్కసారి ఆగి కొట్టుకుంది.

సరిగ్గా అదే సమయంలో కరెంట్ పోయింది.

పోలీసుల చేతుల్లోని ఫైవ్ సెల్స్ టార్చ్ లైట్లు ప్రకాశవంతంగా వెలిగాయి. కిచెన్ నలుమూలలా వెదికారు.

సుజన కళ్ళు మూసుకొని వుంది. కాస్సేపట్లో తనెదుర్కోబోయే విపత్కర పరిస్థితి నెలా ఎదుర్కోవాలా? అని ఆలోచిస్తూ.

కానీ ఆమె ఆశించినట్టుగా ఏమీ జరగలేదు.

ఈలోగా వాళ్ళు కిచెన్‌లోంచి బయటకు వచ్చి బాత్ రూమ్, టాయ్‌లెట్ అన్నీ వెదికారు. ఇహ మిగిలింది బెడ్ రూమ్ ఒక్కటే,

[illegible] రూమ్‌లోకి అడుగు పెట్టాడు సక్సేనా తన

బృందంతో.

అక్కడ—కొద్ది నిమిషాల క్రితం సుజన పడుకున్న బెడ్ మీద కనిపించిన దృశ్యం చూసి ఆమె అదిరిపడింది.

ఆమె గొంతు పిడచకట్టుకొని పోయింది.

మైగాడ్! ఇప్పుడెలా?

ఆ మంచంమీద నిలువునా పడుకొని దుప్పటి తల నుంచే పాదాలవరకూ కప్పుకొని ఉన్నాడో వ్యక్తి.

సుజన కరమొంది— ఆ ఆకారం ఎవరిదో?

సక్సేనా బెడ్‌రూమ్‌లో మంచం క్రిందా, బీరువా వెనుక, వార్డ్‌రోబ్ అంతా క్షుణ్ణంగా వెదికి మంచం దగ్గర కొచ్చాడు.

సుజన ఊపిరి బిగబట్టింది.

సక్సేనా బెడ్ వైపు తిరిగి అన్నాడు—"మీ వారిది మొద్దు నిద్రనుకుంటాను."

చాలా తెలివిగా అతణ్ని లేపమంటున్నాడీ ఇన్‌స్పెక్టర్! అనుకోగానే ఆమె వెన్నులోకి చలి జర జరా ప్రాకింది.

"నో....అదేం లేదు. ఈ మధ్య ఆయన కొంట్లో బావుండడం లేదు. సెడెటివ్ వేసుకుని పడుకున్నారు. ఆయన్ని లేపమంటారా?" అంది సుజన అతి కష్టంమీద.

"నో... నాట్ నెసెస్సరీ....ఇప్పటికే మీకు చాలా శ్రమిచ్చాం. ఆయన నిద్ర కూడా పాడుచేయడ మెందుకు?" అంటూ తన బలగంతో వీధిగుమ్మంవైపు నడిచాడు.

వదుటపడిన గుండెలతో అతడి వెనుక నడిచింది సుజన.

సక్సేనా మరోసారి 'సారీ' చెప్పి మెట్లు దిగాడు.

నిట్టూర్చి సుజన తలుపు మూసుకోబోయింది.

అతడు వెనక్కి తిరిగి వెళ్లక్కి ఆమె దగ్గరకు వచ్చి-"బి కేర్‌ఫుల్! నెత్తురు త్రాగే కిరాతకుడు వాడు. దయా దాక్షిణ్యాలే కోశానా లేవు వాడికి. ఎవరొచ్చినా తలుపు తీయకండి. చివరకు నేనొచ్చినా సరే!" అంటూ జోక్ చెప్పి ముందుకు నడిచాడు.

## 6

డోర్ మూసి తడుముకుంటూ బెడ్‌రూమ్‌లో కొచ్చిందామె.

ఆమె గదిలో కొచ్చీరావడంతోనే చిత్రంగా కరెంట్ వచ్చి లైట్లు వెలిగాయి.

అంతకంటే విచిత్రంగా ఆ గదిలో బెడ్ మీద ఇప్పుడెవరూ లేరు.

కొద్దిక్షణాల క్రితం తను చూసిన వ్యక్తేమయ్యాడు?

తన కళ్ళు తనను మోసం చేశాయా?

అసలిదంతా కలా? నిజమా?

ఆలోచిస్తూ బెడ్ మీదకు వాలింది.

మంచం క్రిందినుంచి శబ్దం చేయకుండా వచ్చి లేచి నిల్చున్నాడా యువకుడు.

అతడి ఒంటిమీద డ్రాయర్ తప్ప మరేమీ లేదు. తడి బట్టలు విప్పి ఎక్కడో దాచివుంటాడు మంచంమీద పడుకునే ముందు.

అతని విశాలమైన ఛాతీమీద నల్లటి వెంట్రుకలు రింగులు తిరిగి వున్నాయి. మెడలో పులిగోరు పతకం వేలాడుతోంది.

సింహంలాంటి నడుము, కండలు దేరిన భుజాలు, తొడలు, పిక్కలు చూస్తుంటే ఆమెలోని స్త్రీత్వం

మేల్కొనడం ప్రారంభించింది.

అతడు బెడ్ దగ్గరకు చేరి—"థాంక్యూ మై డియర్ లేడీ, థాంక్ యూ వెరీమచ్! నీ శాయశక్తులా ప్రయత్నించి నన్ను కాపాడావు. నీ కేమిచ్చి నీ ఋణం తీర్చుకోమంటావ్?"

అప్రయత్నంగా అతనిమీద చేతులు వేసి దగ్గరకు లాక్కుందామె.

ఆమెకా సమయంలో అతడు పచ్చి నెత్తురు త్రాగే రాక్షసుడనే విషయం గుర్తుకురాలేదు.

పావుగంట తర్వాత ఆమెనుంచి విడివడుతూ అన్నాడా యువకుడు—"థాంక్యూ వన్స్ ఎగైన్! నేనెవరో తెలిసి కూడా యేమీ దాచుకోలేదు నువ్వు. నా వద్ద రివాల్వర్ చూసి కూడా బెదరలేదు నువ్వు.

ఎంతోమంది ఆడవాళ్ళతో పరిచయం వుంది నాకు. కానీ నీకున్న ప్రత్యేకతల్లో ఒక్కటీ వాళ్ళకు లేదు. కోరుకో, నువ్వేం అడిగినా యిస్తాను. నా ప్రాణాలైనా సరే!"

అతనివైపు చూస్తూ అందామె—"నా కంటే ఏడెనిమిదేళ్ళు చిన్నవాడివే అయివుంటావు. ఇంత చిన్నవయసులో ఇలా ఎందుకు మారావని అడగను నేను.

సంఘవిద్రోహక శక్తిగా మారేటందుకు ప్రతి వ్యక్తికీ తగిన కారణాలుంటాయి. నాకూ నువ్వు మొదటి మగాడివి కాదు. అందుకే నువ్విలా ఎందుకు మారేవని అడిగే హక్కు నా కుందని అనుకోను."

ఆమెవైపు అభిమానంగా చూస్తూ అన్నాడా యువకుడు—"చెప్పు డియర్, మొదటి పరిచయంతోనే నన్ను దోచుకున్న నీ కోసం నీ సంతోషం కోసం యేం

చేయమంటావ్ ?"

సుజన అతనివైపు తిరిగి అతని గుండెలమీద రాస్తూ అంది—"మగతోడు లేని స్త్రీ జీవితాని కర్థంలేదు. తన దంటూ ఒక స్త్రీ లేని మగవా డెప్పుడేం చేస్తాడో అతడికే తెలియదు. మనిద్దరం ఇంచుమించు ఒకే నావలో ప్రయాణిస్తున్నాము. నీ కభ్యంతరం లేకుంటే, నా మీద నీకు నమ్మకముంటే ఇహనుంచీ నన్ను నీ దానిగా భావించవచ్చు."

అతడి కళ్ళు మెరిశాయి. "నిజంగానా!?" అంటూ పట్టరాని ఆనందంతో ఆమెను వాటేసుకున్నాడు.

ఆమె అతణ్ని సుతారంగా విడిపించుకుంటూ అంది—"కానీ నువ్వు వెంటనే చేయాల్సిన పనొకటి ఉంది."

అత డావేశంగా అన్నాడు—"చెప్పు, నీవ్వేం చేయమన్నా చేస్తాను. నీలా నన్ను లాలించి, అనురాగంతో దగ్గరకు తీసుకున్నవా ళ్ళింతవరకూ నా జీవితంలో తారసపడలేదు.

"నువ్వే నాకు అయిదారేళ్ళ క్రితం కనబడి వుంటే, నేనూ అందరిలానే హాయిగా నవ్వుతూ, తుళ్ళుతూ జీవితం గడిపేవాణ్ని. పోనీలే ఇప్పుడైనా నా అదృష్టం కొద్దీ నీ దగ్గరకు చేరాను.

"చెప్పు, నన్నేం చేయమంటావో చెప్పు. ఈ హత్యలకూ, లూటీలకు యిక నుంచి ఫుల్‌స్టాప్ పెట్టేయ దలచుకున్నాను. నువ్వు కోరేదదే అయితే అది నీ ఆజ్ఞగా భావిస్తాను."

"నాకు చాలా సంతోషంగా వుంది. గతంలో నాకు తారసపడిన మగవాళ్ళలో లేని నిజాయితీ నీలో చూస్తున్నాను. వాళ్ళంతా మంచివాళ్ళలా నటించి నన్ను

మోసం చేసిన దొంగలు.

నువ్వు నిజాయితీగా నీ నేరాల్ని అంగీకరిస్తున్న మంచి వాడివి" అంటూ అతణ్ని ముద్దుపెట్టుకొని—"రేపుదయం పోలీస్ స్టేషన్‌కు వెడదాం. నీ నేరాలన్నీ ఒప్పుకొని వాళ్ళకు లొంగిపో. కోర్టులో హాజరుపరిచాక నీకు శిక్ష వేస్తారు.

పశ్చాత్తాపంతో నీ అంతట నువ్వే లొంగిపోతున్నావు కనుక నీకు కొద్దిపాటి శిక్షనే వెయొచ్చు. శిక్ష అనుభవించిన తరువాత నాదగ్గర కొచ్చెయ్. నేను చచ్చిపోయేంతవరకూ ఎదురుచూస్తూ వుంటాను."

అతడి గుండెల్లో రాయి పడింది.

ఏమంటోందీమె?! తను పోలీసులకు లొంగిపోతే ఇహ తనకు జీవితమేముంది?

తను చేసిన నేరాలన్నీ ఒప్పుకున్నంత మాత్రాన ఈవిడ చెప్పినట్టుగా జరగాలనేముంది?

అతడి పెదాలమీద సుతారంగా వేళ్ళతో రాస్తూ అంది సుజన—"మరేం ఆలోచించకు, కళ్ళు మూసుకొని పడుకో!!"

—ఆఖరి వాక్యం చదివి, కాగితాలన్నీ కవర్‌లో వుంచాడు ఇన్‌స్పెక్టర్ రవీంద్ర. అతడికి మళ్ళీ టీ అందించింది సుజనాదేవి. తర్వాత చెప్పింది—"బృహస్పతిని తప్పించి పోలీసులకు అప్పగించాక, అతడు జైలునుంచి విడుదలయ్యే తేదీకోసం ఆత్రుతగా ఎదురుచూస్తూ రోజులు గడుపుతున్నాను. కానీ అశనిపాతంలా నా ఆశల్ని వమ్ము చేస్తూ తిరిగి జైలు నుంచి తప్పించుకున్నాడు బృహస్పతి.

ఉక్రోషంతో శంకర చందంగా అతడు తిరిగి జైలుకు నుంచి తప్పించుకొనడంతో నేను తట్టుకోలేకపోతున్నాను.

నా అంచనా ఈసారి తప్పడంతో నాకు మానవత్వంమీద నమ్మకం అంతరించిపోయింది.

అతడు నా కోసం తప్పక ఈ ఇంటికి వస్తాడు. ఈ యింటిచుట్టూ మఫ్టీలో మీ వాళ్ళను కాపలా ఉంచండి. నా పేర్న వచ్చే కరెస్పాండెన్స్ అంతా మీకు డైవర్ట్ చేయమని రేపే పోస్టు మాస్టర్‌కు ఆథరైజేషన్ యిస్తాను.

నేను చేయగలిగిందంతా చేస్తాను. అతణ్ని తిరిగి మీకు వప్పగించే ప్రయత్నంలో నా ప్రాణాలు పోయినా నేను లెక్క చెయ్యను."

అభినందనపూర్వకంగా ఆమెవైపు చూస్తూ అన్నాడు రవీంద్ర—"మిమ్మల్నత రేమీ చేయలేదు. మీ ప్రాణానికి నా ప్రాణం హామీ. మా డిపార్టుమెంట్‌కు మీ రింత సహకరిస్తున్నందుకు మీ ప్రాణాలు కాపాడకపోతే మేం మా ఉద్యోగాలు చేయడం అనవసరం!"

ఆమె నిర్లిప్తంగా నవ్వింది.

## 7

కానిస్టేబుల్ అందించిన కవరు నందుకొని ఎడ్రస్ చూశాడు రవీంద్ర.

అది సుజనాదేవి పేర్న వ్రాయబడింది. ఆ కవర్ విశాఖపట్నంలోనే అల్లిపురం పోస్టాఫీసు పరిధిలో పోస్టు చేయబడింది.

కవరును ఆత్రుతగా చించి చదివిన రవీంద్ర కళ్ళు ఆనందంతో మెరిశాయి.

అది బృహస్పతి సుజనాదేవికి వ్రాసిన ఉత్తరం!

"డియర్ సుజీ—

నేను జైలు నుంచి తప్పించుకున్నానన్న

విషయం తెలిసి నామీద నీకు అసహ్యం వేస్తోంది కదూ? నే నెందు కిలా చేశానో తెలిస్తే నన్నసహ్యించుకోకపోగా అభినందిస్తావు. నా విలువ నాకు తెలుసు.

నేను జైలు నుంచి తప్పించుకున్న మరుక్షణం నన్ను వప్పగించినవారికి ప్రభుత్వం పెద్ద మొత్తంలో బహుమతి ప్రకటిస్తుంది. నేను దొరికిపోవాలనుకుంటే తప్ప యెవరూ నన్ను పట్టుకోలేరు.

రేపు రాత్రి ఎనిమిది గంటలకు నీ ఇంటికొస్తాను. ఓ అరగంట తర్వాత నువ్వు ఫోన్ చేసి పోలీసులకు నా ఆచూకీ తెలియజేయి. కొంచెం ప్రతిఘటించి వాళ్ళకు లొంగిపోతాను నేను.

తరువాత ప్రభుత్వం అందించిన బహుమతి అందుకొని నువ్వు నా కోసం వెయిట్ చెయ్యి. నేను విడుదలయ్యాక సుఖంగా బ్రతికేందుకు మనకు డబ్బు కావాలి కదా?

నీ జీతంతో మనిద్దరం బ్రతకలేమా? అని నువ్వనొచ్చు. కానీ ఊరికే వచ్చే సొమ్ము పోగొట్టుకొనడం ఎందుకు? మహా అయితే ఇలా తప్పించుకుందును నాకు మరి కొంతకాలం శిక్ష పడుతుంది. అంతేగా?

ఎలాగూ నా విడుదల కోసం ఎన్నో సంవత్సరాలు ఎదురుచూడబోతూన్న నీకు ఆ కొంచెం కాలం వెయిట్ చేయడం, పెద్దగా బాధ కలిగించదు కదా?

నా మీది కోపం పోయింది కదూ? నిన్ను

కల్సుకోవాలని నా నర నరమూ ఉవ్విళ్ళూరు తోంది. విత్ స్వీట్ కిసెస్....

నీ

బృహస్పతి."

# 8

అటూ ఇటూ జాగ్రత్తగా చూసుకుంటూ కాంపౌండ్ వాల్ దూకాడు బృహస్పతి. పెరటివైపు తలుపు మూసి ఉండడాన్ని గమనించి పిల్లిలా అడుగులు వేసుకుంటూ ఇంటి ముందుకు వచ్చాడు.

మూసి వున్న తలుపులను చూసి కాలింగ్ బెల్ నొక్కాడు.

డింగ్ డాంగ్ చప్పుడు అతడి గుండెల్లో వీణలు మోగించింది.

కాస్సేపట్లో తను చూడబోయే సుజన సుందర రూపం మనసును కలవరపెడుతోండగా అనిమేషంగా అలాగే చూశాడు తలుపులవైపు.

అత డూహించినట్టుగా తలుపు తెరుచుకోలేదు.

కాలింగ్ బెల్ ని తిరిగి నొక్కాడు.

ఊహుఁ. రెస్పాన్స్ లేదు.

అనుమానం వచ్చి మునివేళ్ళతో తలుపు తోశాడు.

నెమ్మదిగా తెరచుకొందది.

అతడి పెదాలమీద దరహాసం చిందులేసింది.

'అమ్మ దొంగా! నా కోసం బెడ్ రూమ్ లో ఎదురు చూస్తున్నావా?' అనుకుంటూ లోపలకు నడిచాడు.

అక్కడ బెడ్ మీద వెల్లకిలా కళ్ళు మూసుకొని పడుకొని వున్న వ్యక్తిని చూడగానే అతడి గుండె దడ దడా కొట్టుకొంది.

కాళ్ళూ, చేతులూ ఎడంగా సాచి, అర్ధనగ్నంగా అదమరచి నిద్రపోతోంది సుజన. ఆమె నా పొజిషన్‌లో చూడగానే అతడి నరాల్లో ఆవేశం ఉవ్వెత్తున ఎగిసింది.

ఒక్క ఉదుటున బెడ్ దగ్గరకు చేరి నిలువునా ఆమెను కప్పుతూ ఆమెమీద పడిపోయాడు.

మరుక్షణం—అతడి గుండె ఝల్లుమంది!

సుజన శరీరం మంచు కంటే చల్లగా వుంది.

ముక్కు దగ్గర వేలుపెట్టి చూసి అదిరిపడ్డాడు.

మైగాడ్! ఇదెలా సంభవం?

తన సుజన ...తన ప్రియాతిప్రియమైన సుజన....తనలోని రాక్షసుణ్ని సమాధి చేసి తనలో రాగోదయాన్ని కలిగించిన సుజన....తన నొదిలి వెళ్ళిపోయిందా?!

రెండు చేతులూ మొహంమీద కప్పుకొని ఏడ్చాడు. ఆ ఏడుపు క్షణ క్షణానికీ ఉధృతమై ఆ ఇల్లంతా ప్రతిధ్వనించింది.

అరగంటసేపు ఆపులేకుండా ఏడ్చాడతడు.

అతడు కళ్ళు తెరిచి చూసేసరికి ఇన్‌స్పెక్టర్ రవీంద్ర దర్శనమిచ్చాడు.

బృహస్పతి చేతులకు బేడీలు వేస్తూ—ఒక కవరతడి చేతి కందించి అన్నాడు రవీంద్ర—"అయామ్ వెరీ సారీ, సుజనాదేవిగారిలా చేస్తారని నే నెంతమాత్రమూ ఊహించలేదు. ఆమెను కాపాడుకోలేక పోయినందుకు ఎంతో విచారిస్తున్నాను."

తన కళ్ళముందేం జరుగుతోందో అర్థంకానివాడిలా, రవీంద్ర తన చేతిలో ఉంచిన కవర్ విప్పాడు బృహస్పతి.

"డియర్ పతీ—

నువ్వు హంతకుడివైనా నీ లోని నిజాయితీని ప్రేమించాను నేను. కానీ నా నమ్మకంమీద మరోసారి చావుదెబ్బ తగిలింది. నేను మనసారా ప్రేమించిన వ్యక్తికి ఇంత చిత్తచాంచల్యం గలవాడనే విషయం తలచుకొంటే నా మీద నాకే అసహ్యం వేస్తోంది.

అందుకే నన్ను నేనే శిక్షించుకుంటున్నాను. మరో జన్మంటూ వుంటే అప్పటికైనా నువ్వు మారతావనీ, కనీసం అప్పుడయినా మనిద్దరం కలిసి కలకాలం జీవించవచ్చునని ఆశతో ఈ జీవితానికి ఇక్కడితో ఫుల్ స్టాప్ పెడుతున్నాను. నిన్ను బాధ పెట్టివుంటే నన్ను క్షమించు.

నీ

సుజీ."

ఉత్తరం చదివి కప్పలా కూలిపోయాడు బృహస్పతి. అతడివైపు సానుభూతిపూర్వకంగా చూశాడు ఇన్స్పెక్టర్ రవీంద్ర.

—: అయిపోయింది :—

# వజ్ర కిరీటం

## ఏ. యస్. రావ్

హోటల్ ఎంట్రెన్సు ముందు కారాగింది.

యూనిఫామ్‌లో వున్న డ్రైవర్ ఆదరాబాదరా దిగి, వెనక తలుపు తెరిచి, తలవాల్చి నిలబడ్డాడు.

బలరామ్ నిర్లక్ష్యంగా కార్లోంచి దిగి, ఠీవిగా నిలబడ్డాడు. ఖరీదైన వైట్ సూట్. నల్లగా తళతళ మెరుస్తున్న బూట్లు. వెడల్పాటి నల్ల కళ్ళద్దాలు. వంకీల క్రాపు గాలికి రెపరెపలాడుతోంది. నల్లద్దాలగుండా హోటల్ని వోసారి చూసి, బలరామ్ అద్దాల్ని తీసేశాడు. సన్నగా, పెదవుల చివర్ల దాకా సాగిన మీసాల్ని చూపుడువేలితో గర్వంగా తడువుకున్నాడు!

డ్రైవర్ చప్పుడు కాకుండా డోర్‌ని మూశాడు. బలరామ్ తల కటాలున డ్రైవర్ వేపు తిరిగింది. “ఇడియట్! బ్రీఫ్ కేస్ అందుకో!” కొయ్యముక్క మీద రాస్తున్న ఆకురాయిలా ధ్వనించింది అతని కంఠం.

ఉలిక్కిపడి డ్రైవర్ తలుపు తెరిచి, సీటుమీదున్న

ఎర్రటి బ్రీఫ్ కేస్‌ని అందుకున్నాడు. హేండిల్ బలరామ్ చేతికి అందేలా రెండు చేతులమధ్యా దాన్ని ఇరికించి పట్టుకున్నాడు. బలరామ్ విసురుగా అందుకుని, హోటల్ వైపు తిరిగాడు.

"సార్ ....పదకొండింటికి రమ్మన్నారా?" డ్రైవర్ వినయంగా ప్రశ్నించాడు.

బలరామ్ ఆగాడు. "ఇలా రా!" ఆజ్ఞాపించాడతను, వెనక్కి తిరక్కుండా.

భయభక్తులతో డ్రైవర్ గుండ్రంగా తిరిగి నడుస్తూ అతనిముందు నిలబడ్డాడు.

బలరామ్ కళ్ళు ఎర్రగా అతన్ని చూస్తున్నాయి. ఎర్రటి నెక్ టై కొస పాముపడగలా గాలిలో ఆడుతోంది. "బయల్దేరేముందు ఏం చెప్పాను?" అతని కంఠం ఖంగుమంది.

"తమర్ని దించి వెళ్ళి, ఫోంచేసి....పదకొండింటికి ఇక్కడికి రమ్మన్నారు...." డ్రైవర్ నసిగాడు.

"షటప్! మళ్ళీ ఎందుకు అడిగావ్?" బలరామ్ గద్దించాడు.

డ్రైవర్ తలవాల్చి, నేలచూపులు చూశాడు. "టైమ్....మార్చుకున్నారేమో అని.."

"షటప్! ప్లాను మార్చితే తెలియజేసే డ్యూటీ ఎవరిది?"

"..త..ము..దే..సార్.."

"నా డ్యూటీ నాకు గుర్తుచేసేంత తెలివుందా నీకు? గెటౌట్!" హుంకరిస్తూ బలరామ్ ఠీవిగా అడుగులు వేస్తూ వెళ్ళిపోయాడు.

డ్రైవర్ పొడుగాటి అతని ఆకారాన్ని చూస్తూ

ఆలాగే చెట్టులా నిలబడిపోయాడు. ఇడియట్! అతని ముఖంమీద పెల్లిగా చిరునవ్వు ప్రత్యక్షమైంది. ఇడియట్, ఫూల్, రాస్కెల్ లాంటి — తనకి అర్థంకాని ఇంగ్లీషు తిట్లు తిండానికే తనకి ఇవాళ వందరూపాయలు బక్షీస్ ఇవ్వబడింది!

* * *

లిఫ్టు నాలుగో అంతస్థులో ఆగింది. బలరామ్ ఒంటరిగా మొజాయిక్ మీదకి అడుగుపెట్టాడు. లిఫ్టు పైకి జరిగింది. బలరామ్ అటూ ఇటూ చూసి, మెట్లవైపు హుందాగా నడిచాడు. తనకి కావాల్సిన ఫ్లోర్‌లో అతనెప్పుడూ లిఫ్టు దిగడు. సెకండ్ ఫ్లోర్‌కి వెళ్లాల్సొస్తే మూడో ఫ్లోర్‌లోనో, నాలుగో ఫ్లోర్‌లోనో దిగుతాడు! అలవాటుగా మారిపోయిన ఆ ముందు జాగ్రత్తే అతన్ని ఉక్కు కవచంలా కాపాడుతోంది!

నవ్వుకుంటూ బలరామ్ చకచకా మెట్లు దిగసాగేడు అతని కళ్ళు కళ్లద్దాల వెనకనుంచీ నిరంతరమైన అన్వేషణ సాగిస్తున్నాయి. సెకండ్ ఫ్లోర్‌లో 222 గదిముందు ఆగాడతను. కాలింగ్ బెల్ నొక్కబోతూ, ఆగి, చెవులు రిక్కించాడు. లోపల్నుంచీ బిగ్గరగా నవ్వు వినిపిస్తోంది. అతని అరచెయ్యి తలుపుమీద ఆనింది. తలుపు కొద్దిగా కదిలింది. అప్రయత్నంగా అతను నిట్టూర్చాడు. తలుపులూ, కిటికీలో మూసిన గదిలో పొగలా, కోపం అతనిలో వ్యాపిస్తోంది.

బలరామ్ కొద్దిగా వెనక్కి జరిగాడు. అతని ఎడమ కాలు పైకి లేచింది. బూటు బరువుగా తలుపువైపు దూసుకెళ్ళింది. చప్పుడు చేస్తూ తలుపు విసురుగా లోపలికి కదిలి, గోడకి కొట్టుకుంది. రెప్పపాటులో లోపలికి

జారబడి అతను వీపుతో తలుపు మూశాడు. గదిమధ్యలో టేబుల్ చుట్టూ, ఆవు శవం చుట్టూ వోపిగ్గా కూచున్న గుంటనక్కలా కూచున్న ముగ్గుర్నీ అతని కళ్లు చింత నిప్పుల్లా చూశాయి. మూడు తలలు పాము పడగల్లా మెలిదిరిగి అతన్నే చూస్తున్నాయి. బలరామ్ పొడుగ్గా అంగలు వేస్తూ వాళ్ళ దగ్గరగా కదిలాడు. ముగ్గురూ లేచి, వినయంగా నిలబడ్డారు. అందరి మొహాల్లో అతని రాక పట్ల ఆనందం వ్యక్తమవుతోంది.

గదిలో నిశ్శబ్దం ఆవరించింది. బలరామ్ వాళ్ళందర్నీ ఆక్షేపణగా కలయజూశాడు.

"తలుపులు మూసి, ఎందుకు గొళ్ళెం పెట్టలేదు?" అతని ప్రశ్న గదిలో ప్రతిధ్వనించింది.

అందరి మొహాల్లోని చిరునవ్వుని అతని ప్రశ్న తుడిచేసింది. విశ్వకర్మారావు అందరికన్నా ముందు తెప్పరిల్లాడు. బంగారం చుక్కలున్న పళ్ళని చూపిస్తూ నవ్వే ప్రయత్నం చేశాడు.

"మీకోసమే తెరిచివుంచాం, బలరామ్!"

బలరామ్ ఠీవిగా అతని దగ్గరగా నడిచాడు. పైజామా, జుబ్బాలో దూరిన అస్థిపంజరంలా అవుపిస్తున్న విశ్వకర్మారావుని తీక్షణంగా చూశాడు. రిమ్‌లెస్ అద్దాల్లోంచీ విశ్వకర్మారావు కళ్ళు పాదరసం బిందువుల్లా తళుక్కుమంటున్నాయి. అలాంటి కళ్ళున్న వ్యక్తి పావలాకోసం ప్రాణమిత్రుడి వీపులో బాకు దిగేసి చంపడానికి వెనకాడడని తనకి తెలుసు! అయినా తప్పదు. తను తలపెట్టిన పనికి అతను అత్యవసరం! రెండు వేపులా పదునున్న పదునైన కత్తి వాడుకున్నట్టు తను విశ్వకర్మారావు లాంటి అతితెలివి వ్యక్తుల్ని వాడుకోవాలి!

"నాన్సెన్స్! తలుపు బార్లా తెరచుకూర్చుని చేసే వృత్తికి సంబంధించిన వారు కారు మీరు. ఇలా నిర్లక్ష్యంగా వుంటే మూసిన తలుపుల వెనక గోళ్ళు కొరుక్కుంటూ శాశ్వతంగా కూచోవాల్సివస్తుంది!" బలరామ్ ఆక్షేపణ ధ్వనించే కంఠంతో అన్నాడు.

"సారీ మిస్టర్ బలరామ్" విశ్వకర్మారావు మెల్లిగా అన్నాడు.

బలరామ్ వడగళ్ళలాంటి కళ్ళతో అతన్ని సూటిగా చూశాడు.

"విశ్వకర్మారావ్, బలరామ్ పేరు మరిచిపో. 'బాస్' అను!"

విశ్వకర్మారావ్ హార్మోనియం రీడ్స్‌లా వున్న పళ్ళని చూపించాడు. "సారీ.. బాస్.."

బలరామ్ పక్కకి తిరిగి. టేబుల్ ముందు కుర్చీలో నిటారుగా కూచున్నాడు. టేబుల్ మీద పెట్టిన బ్రీఫ్ కేసుని క్లిక్‌మనిపిస్తూ తెరిచాడు. మినిసైజు కాన్వో టేప్ రికార్డర్ని ఇవతలికి తీశాడు.

"విశ్వకర్మారావ్, వెళ్ళి గొళ్ళెం బిగించు. ఫుల్ వాల్యూంలో ఈ రికార్డర్‌ని తలుపు దగ్గరగా, గోడవార పెట్టు!" బలరామ్ కంఠంలో అధికారం ధ్వనించింది.

టేప్ రికార్డర్ని కాడల్లాంటి వేళ్ళతో పట్టుకుని విశ్వకర్మారావు కదిలాడు. వెస్టర్న్ డిస్కో రిథం గదిలోని నిశ్శబ్దాన్ని చెల్లాచెదురు చేసింది జేబులోంచి తీసిన కరోనా సిగార్ని పళ్ళమధ్య ఇరికించి, తనవేపే చూస్తున్న ఇద్దర్నీ అప్పుడే గుర్తించినవాడిలా చూశాడు బలరామ్ కరోనా మెల్లిగా కదుల్తోంది.

గజపతి కళ్ళు తడిగా మెరుస్తూ బలరామ్‌ని చూస్తు

న్నాయి. ఎప్పుడూ నీళ్ళతో నిండినట్టు కనిపించే కళ్ళు గజపతిని అమాయకుడిగా, మెతక మనిషిగా లోకానికి చూపిస్తాయి.

బలరామ్ చూపులు అతని పక్కనే కూచున్న రాంజోగిమీద వాలాయి. చిందరవందరగా వున్న పొడుగాటి క్రాపు. అంగుళంపైగా పెరిగిన గడ్డం. అక్కడక్కడా వున్న తెల్ల వెంట్రుకలు అతని వయస్సు అనే రోడ్డు మీద నాటిన తెల్లరాళ్ళలా అవుపిస్తున్నాయి. సన్నగా కడ్డీలావున్న రాంజోగిలో విపరీతమైన కండర శక్తి దాక్కుందని బలరామ్‌కి తెలుసు. రాంజోగి కుడిచేతి వేళ్ళు ఎడమచేతి వేళ్ళ సందుల్లో దూరి, మెటికలు విరుస్తూ చిన్నగా చప్పుడు చేస్తున్నాయి.

తిరిగివచ్చి కూచోబోతున్న విశ్వకర్మారావు ఆగి, జేబు లోంచీ అగ్గిపెట్టె తీశాడు. పుల్లగీచి, వొంగి, బలరామ్ పెదాల మధ్యవున్న కరోనా ముందు పట్టుకున్నాడు. బలరామ్ సిగార్ని ఇవతలికి లాగి, నోటితో వూది అగ్గి పుల్లని ఆర్పేశాడు. తెల్లటి పళ్ళు చూపిస్తూ విశ్వకర్మా రావుని క్షణకాలం చూశాడు. కరోనాని మళ్ళీ పళ్ళ మధ్య ఇరికించాడు. ముగ్గురికీ ఒకసారి కలయజూసి, ఏదో చెప్పబోయాడు. టేప్ రికార్డర్ శబ్దాన్ని మింగేస్తూ కాలింగ్ బెల్ మోగింది.

“రాంజోగీ, తలుపు తెరు!” బలరామ్ ఉత్తరువిచ్చాడు.

రాంజోగి చకచకా వెళ్ళి తలుపు తెరిచి, సందుగుండా తొంగి చూడబోయాడు. వెలుపలినుంచీ తలుపు బలంగా తోయబడింది. రాంజోగి అప్రయత్నంగా కొంచెం వెనక్కి జరిగాడు.

ఆమె సుడిగాలిలా గదిలోకి దూరింది. రాంబోగి డేగ కళ్ళతో ఆమెనే చూస్తూ తలుపు మూసేశాడు. జీన్స్ లోపలికి బుష్‌షర్టుని దోపిన ఆమె నడుము సన్నగా వుంది. కాటన్ బుష్‌షర్టు ఆమె వొంపుల్ని పూర్తిగా దాచిపెట్టడంలో విఫలమైందని చూడగానే తెలుస్తోంది. బాబ్డ్ హెయిర్ భుజాల్ని తాకుతూ గమ్మత్తుగా కదుల్తోంది. లిప్‌స్టిక్ పులిమిన పెదవుల సందులోంచీ కడిగిన ముత్యాల్లా ఆమె పళ్ళు మెరుస్తున్నాయి. పెద్ద పెద్ద కళ్ళు బలరామ్‌ని చూస్తున్నాయి.

ఆమె నాట్యానికి నడకలు నేర్పుతున్నట్టు కదిలింది. తన అడుగుల్ని అడ్జెస్టు చేసుకుని, నిర్లక్ష్యంగా నడుస్తున్న ఆమెని బలరామ్ చిరునవ్వుతో చూశాడు. బుష్‌షర్టు పైభాగంలోని గుండీని పెట్టుకోలేదామె. ఆమె నడుస్తుంటే, తను బ్రాసియర్ ధరించలేదని ఆమె చెప్పకుండానే తెలుస్తోంది.

బుష్‌షర్టు చేతుల్ని మోచేతులదాకా కేర్‌లెస్‌గా మడిచి వదిలేసిందామె. ముంజేతులు పసుపుపచ్చని కడ్డీల్లా మెరుస్తున్నాయి. రక్తంతో తడిసిన పులిగోళ్ళలా, ఎర్రటి పాలిష్‌తో మెరుస్తున్నాయి ఆమె గోళ్ళు. టేబుల్ ముందు ఆగి బలరామ్‌ని నవ్వుతూ చూసింది.

"ఆలస్యంగా వచ్చానా?" ప్రేమగీతం పాడుతున్న ఆశాభోంస్లే కంఠంలా ధ్వనించిందామె కంఠం.

"సిడౌన్, కుంకుమా!" బలరామ్ తన దగ్గరగా వున్న కుర్చీని చూపిస్తూ అన్నాడు.

కుంకుమ వొంపులు తిరుగుతూ కదిలి కుర్చీలో కూచుంది. కాలుమీద కాలేసుకుని, వెనక్కివాలి, ఊపిరితిత్తుల నిండుగా గాలి పీల్చి 'ఉఫ్' మంటూ వదిలింది. రెండు

చేతుల్లో బౌల్డ్ హెయిర్ని సర్దుతుంది.

తన తాతయ్య చెక్కిన అప్సరస శిల్పాన్ని చూస్తున్న వాడిలా కుంకుమనే చూస్తూండిపోయాడు విశ్వకర్మారావు.... గజపతీ, రాంజోగీ గుడ్లప్పగించి, ఆమెనే చూస్తున్నారు.

ఆమె చూపులు బలరామ్ వైపు తిరిగాయి. "ఫ్రెండ్స్‌కి నన్ను పరిచయం చెయ్. సస్పెన్స్‌తో గుండెలాగిపోయి చచ్చేలా వున్నారు....!" అందామె, ఏకవచనంలో. మాటల్లోని యుగతాళిని ఆమె నవ్వు ప్రబ్లా తుడిచేసింది.

ముగ్గురూ వొకేసారి ఫక్కున నవ్వారు. బలరామ్ నోట్లోని చుట్ట కదిలింది. "విశ్వకర్మారావూ, గజపతీ, రాంజోగీ, కుంకుమ మనకి యిటుపైన తరుచూ కనిపిస్తూ వుంటుంది...."

"తరచుగా యెందుకు? యెప్పుడూ కనిపిస్తే బావుంటుంది!...." విశ్వకర్మారావు చూపులు తిప్పకుండా అన్నాడు.

బలరామ్ పళ్ళ మధ్య కరోనా కదలడం మానేసింది. కుంకుమ ఫక్కున నవ్వింది. ఆమె చెయ్యి క్రిందకి జారిగింది క్షణంలో యెక్కణ్ణుంచో తీసిన ఫిల్టర్ కింగ్ సిగరెట్‌ని పెదాల మధ్య యిరికించి, సాభిప్రాయంగా టేబుల్ మీదకి చూసింది.

విశ్వకర్మారావు జేబులోంచీ అగ్గిపెట్టెతీసి, పుల్ల గీచి టేబుల్ మధ్యకి జాపాడు. ఎర్రటి మొగ్గకి అతుక్కున్న తెల్లటి కాడలా కుంకుమ పెదాలకి అంటుకున్న సిగరెట్‌ని చూస్తూండిపోయా డతను.

కుంకుమ పైకి లేచి, అగ్గిపుల్లవేపు వొంగింది. సిగ

రెట్ కొస మంటలో గుచ్చుకుంది. బటన్ పెట్టుకోని ఆమె పట్టుని చూస్తున్న విశ్వకర్మారావు చెయ్యి వణికింది! కుంకుమ కుర్చీలో కూలబడి, కానిమ్మన్నట్టు బలరామ్‌ని చూస్తూ పొగ ఊదింది.

"గజపతీ, యెలావుంది నీ వ్యాపారం?" బలరామ్ ప్రశ్నించాడు.

గజపతి సిగ్గుపడుతూ నవ్వాడు. అతని కళ్ళలో తడి యింకొంచెం ఎక్కువైంది. "....సాగుతోంది...." అతని కంఠం కీచుగా వుంది.

బలరామ్ చూపుల్ని రాంజోగివైపు తిప్పాడు. రాంజోగి మెటికలు విరుస్తున్న వేళ్ళని వోసారి చూసుకున్నాడు. "నాట్ బాడ్!"

బలరామ్ పళ్ళ మధ్య చుట్ట కదిలింది. "నాట్ బాడ్ అంటే నాట్ గుడ్ అని అర్థం!" ఈసారి అతని కళ్ళు విశ్వకర్మారావువైపు ప్రశ్నని రువ్వాయి.

విశ్వకర్మారావు ఏదో జ్ఞాపకం వచ్చినవాడిలా తటాలున కళ్ళద్దాల్ని లాగి, జుబ్బా కొసతో ఆవేశంగా పాలిష్ చేశాడు. మళ్ళీ తగిలించి, అద్దాలగుండా కుంకుమను చూడసాగాడు. "వ్యాపారం........కుంటుతోంది...."

బలరామ్ చిన్నగా నవ్వాడు, "మీ ముగ్గురి వ్యాపారాలూ యెలా సాగుతున్నాయో నాకు తెలుసు! కొవ్వొత్తుల్ని రెండువైపులా ఒకేసారి ముట్టించి, యిప్పుడు చీకట్లో తచ్చాడుతున్నారు! అది తెలిసే మిమ్మల్ని రమ్మన్నాను. పెద్ద పెట్టున డబ్బు సంపాయించడానికి ప్రమాదకరమైన అడ్వెంచర్ చేయాలి. చేస్తారా?"

ముగ్గురి చూపులూ కుంకుమమీంచి తటాలున బలరామ్ వేపు తిరిగాయి. ఆడదాన్నుంచీ వాళ్ళ దృష్టిని మళ్ళించ గలిగింది ఒక్కటే: డబ్బు! ఎంత ప్రమాదకరమైన కార్యమైనా బలరామ్ ఆధ్వర్యంలో విజయవంతంగా పూర్తవుతుందని వాళ్ళకి తెలుసు....

"విశ్వకర్మారావ్, ఏమిటాలోచిస్తున్నావ్?" బలరామ్ ప్రశ్నించాడు. అతని నోట్లో నలుగుతున్న చుట్ట క్రమంగా పొట్టిగా తయారవుతోంది.

విశ్వకర్మారావు పళ్ళికిలించాడు. "ఏంలేదు....కుంకుమ వొళ్ళు అంత పచ్చగా యెలా వుందా అని ఆలోచిస్తున్నా...."

కుంకుమ కిల కిల నవ్వింది. బలరామ్ అతన్ని తదేకంగా చూశాడు. "కుంకుమ పసుపు రాసుకుని స్నానం చేస్తుందిలే! ప్రశ్నకి సమాధానం చెప్పు!"

"చెప్పండి; చేస్తాం. పనిలేకా, డబ్బులేకా తల చెడిపోతోంది!" విశ్వకర్మారావు కుంకుమనే చూస్తూ అన్నాడు. గజపతీ, రాంజోగీ అవునన్నట్టు నవ్వారు.

బలరామ్ కరోనాని వేళ్ళతో యివతలకి తీశాడు. ముగ్గుర్నీ తీక్షణంగా కలయజూశాడు. "ఇది చాలా చాలా సీరియస్ విషయం. నేలమీద, మొనలు పైకి వుండేలా నాటిన శూలంమీద నడవడం లాంటిది. పని పూర్తయ్యేదాకా పదునైన కత్తులు మన మెడలమీద వేళ్ళాడుతూ వుంటాయి. జయిస్తే, ఒక్క అడ్వెంచర్‌తో జీవితాంతం మీరు కాలుమీద కాలు వేసుకుని, నిశ్చింతగా వుండొచ్చు. బెడిసికొడితే జైల్లో కుళ్ళిపోవాల్సి వుంటుంది! రెండు ఆల్టర్నేటివ్స్‌కీ మీరు సిద్ధపడితేగానీ మీ అంగీకారం తెలియజేయనక్కర్లేదు. అంగీకారం

తెలిపితే గానీ అసలు సంగతి మీకు చెప్పడం జరగదు....”
బలరామ్ ఆగి, వాళ్ళ మొహాల్లోకి చూస్తూ వుండి పోయాడు. తనకి అదేమీ పట్టనట్టుగా కుంకుమ సిగరెట్ పీలుస్తూ తలని కుర్చీ వెనక ఆన్చి, సీలింగ్ ని చూస్తోంది.

“విషయం విన్నాక వెనకడుగు వేయడానికి మీ కెవ్వరికీ అవకాశం వుండదు!” బలరాం కంఠం గంటలా ధ్వనించింది. అతని కంఠధ్వనీ, అతని చూపులూ ఆ మాటకి ఒకటికన్నా ఎక్కువ అర్థాల్ని చెప్తున్నాయి.

“అంటే....” విశ్వకర్మారావు అనుమానిస్తూ నసిగాడు.

“అంటే నా ప్లాన్ ని విన్నవాడు వెనక్కి జారుకోలేడు. జారుకుంటే అతను శాశ్వతంగా ఆ ప్లాన్ గురించి మరిచిపోవాల్సి వుంటుంది. శాశ్వతంగా మరిచిపోయేలా అన్నీ యేర్పాటు చేయబడతాయి!” బలరామ్ అతని కళ్ళల్లో సూటిగా చూస్తూ అన్నాడు. చిరునవ్వుతో అతని పెదవులు కొద్దిగా విచ్చుకున్నాయి.

ముగ్గురూ భయం భయంగా చూశారు. బలరామ్ రూపొందిస్తున్న పథకంలో చేతులు కలపాలంటే, ముందుగా నీ తల మార్చాలి! విన్నాక, వీల్లేదంటే తల ఎగిరిపోతుంది!

“ఆల్ రైట్ బాస్....విజయమో, వీరస్వర్గమో.... అయామ్ రెడీ!” విశ్వకర్మారావు రెండుక్షణాల తర్వాత ధైర్యంగా అన్నాడు.

గజపతి, రాంజోగీ మొహాలు చూసుకున్నారు. “మేము కూడా అంతే!” ఇద్దరి తరఫునా గజపతి అన్నాడు.

బలరామ్ మొహం నవ్వుతో వికసించింది. పొట్టిగా

అయిపోయిన చుట్టని మళ్ళీ పళ్ళమధ్య ఇరికించాడతను. బ్రీఫ్ కేస్ లోంచి 12″ × 10″ సైజులో వున్న నాలుగు ఫోటోల్ని, ఇంకొంచెం పెద్ద సైజులో వున్న అరడజను ఫోటోల్ని తీసి టేబుల్ మీద పరేశాడు.

రంగుల్లో ధగధగ మెరిసిపోతున్న కిరీటం ఫోటోల్ని నలుగురూ అర్థంకానట్టు చూశారు. బ్రీఫ్ కేస్ లోంచి క్లిప్ తగిలించిన కొన్ని న్యూస్ పేపర్ కటింగ్స్ ని బలరామ్ టేబుల్ మీద పరేశాడు. ఫోటోల్లో రంగుల్లో వున్న కిరీటం కటింగ్స్ లో బ్లాక్ అండ్ వైట్ లో వుంది'

పేపర్ క్లిప్పింగ్స్ మీద, మూడు చేతులు ఒకేసారి వాలాయి. కుంకుమ రంగుల ఫోటోని ఏకాగ్రతతో చూస్తోంది.

"చదవకండి; వినండి!" బలరామ్ వాళ్ళని హెచ్చరించాడు. మూడు చేతులూ దూరంగా జరిగాయి మూడు తలలు అతనివైపు లేచాయి.

"జ్ఞానపర్వతంమీద ఆశ్రమంలో వున్న దశానతారానంద స్వామీజీ గురించి మీరు వినేవుంటారు...."అంటూ ఆగాడతను.

"జ్ఞానపర్వతం....సిటీకి అరవై కిలోమీటర్ల దూరంలో మెయిన్ రోడ్డుకి పది కిలోమీటర్ల దగ్గర్లో వుండే కొండేగా?" రాంబోగి ప్రశ్నించాడు.

"అదే!" బలరామ్ నవ్వుతూ అన్నాడు.

"దాన్ని నా చిన్నప్పుడు గుడ్డికొండ అనేవాళ్ళు. చెట్లు దట్టంగా వుండటంచేత, పట్టపగలు కూడా ఆ కొండమీద చీకటిగా వుండేది. ఆ చీకటి కారణంగా దానికా పేరు వచ్చిందనుకుంటా....అది...." విశ్వకర్మారావు ఏదో అడగబోయాడు.

"విశ్వకర్మారావ్, యూ ఆర్ రైట్! ఒకప్పటి గుడ్డికొండే నేటి జ్ఞానపర్వతం. గుడ్డితనం ముదిరితే జ్ఞానం అవుతుందిలే! అన్నట్టు ఫారెస్టు డిపార్టుమెంట్ పుణ్యమా అని ఇప్పుడు ఆ కొండమీద ఆట్టే చెట్లు లేవు!" బలరామ్ నవ్వుతూ అన్నాడు.

కుంకుమ కిల కిల నవ్వింది. తతిమ్మా ముగ్గురూ శృతి కలిపారు.

"అఫ్‌కోర్స్.... ఆ స్వామీజీ గురించి విన్నాం. విభూది నుంచీ, వేడి వేడి లడ్డులదాకా ఆయన అరచేతిలో సృష్టిస్తాడని విన్నాం...." గజపతి అన్నాడు.

"ఆయన యింకా యెన్నో, యెన్నెన్నో సృష్టిస్తాడు: కరెన్సీ నోట్లు తప్ప!" బలరామ్ నవ్వుతూ అన్నాడు.

అందరూ పగలబడి నవ్వారు. బలరామ్ నవ్వాపేసి, ప్రారంభించాడు:

"అందుకే భక్తులు ఆయనకి ముడుపులు విరివిగా చెల్లిస్తూ వుంటారు. ఆయనకి ఇండియాలోనే కాకుండా అమెరికా, ఇంగ్లండ్, ఫ్రాన్స్ ఇటలీ వగైరా దేశాల్లో యెంతో మంది అంతరంగిక భక్తులూ, శిష్యులూ వున్నారు. అందరూ కనీసం లక్షాధికార్లు...."

"కిరీటం సంగతేమిటో చెప్పండి!" విశ్వకర్మారావు అడ్డొస్తూ అన్నాడు.

"విశ్వకర్మారావ్, అవసరంలేని విషయం గురించి నీ బాస్ మాట్లాడడు; అవసరమైన విషయం చెప్పడం మానడు! అడక్కుండా, అడ్డుతగలకుండా వినడం అలవాటు చేసుకో!" బలరామ్ సగర్వంగా అన్నాడు.

"దశావతారానందకి త్వరలో షష్టిపూర్తి జరుగుతోంది.

ఆ ఉత్సవంలో ఆయనకి ఈ ఫోటోల్లో వున్న కిరీటం,—ఏ పీస్, యిలాంటి కిరీటం సమర్పించబడుతుంది. దళసరి బంగారు రేకు మీద వజ్రాలు పొదిగిన కిరీటం....!"

బలరామ్ ఆగి అనుచరుల్ని చిరునవ్వుతో చూశాడు. ముగ్గురూ గుడ్లప్పగించి చూస్తోన్నారు.

"ఆ కిరీటం విలువ ఎంతో తెలుసా? రెండుకోట్లు!" బలరామ్ ఉద్రేకంతో అన్నాడు.

"గుడ్ గాడ్!...." విశ్వకర్మారావు ఆశ్చర్యం వ్యక్తం చేశాడు.

"తిరుపతి వేంకటేశ్వరస్వామికి ఇటీవల తయారుచేసిన వజ్రకిరీటం తరువాత ఇదే ఖరీదయిన కిరీటం! కింబర్లీ, కిలిమాంజిరో వజ్రాలగనుల యజమాని. మిస్టర్ ఫాక్స్ కిరీటం తయారీకి అవసరమైన వజ్రాలు ఉచితంగా సమర్పించాడు. అనేకమంది ధనికభక్తులు స్వామీజీ మహిమతో తమ మొండిరోగాల్ని నయం చేసుకున్నట్లు మూర్ఖంగా అనుకుంటున్న వాళ్ళు—కిరీటానికి అవసరమైన బంగారం కొనటానికి రెండుచేతులా చందాలు సమర్పించారు. స్వామీజీ ఆశీర్వాదంవల్లే తన వజ్రాల నగలవ్యాపారం బాగా సాగుతోందనీ, ఇన్‌కమ్‌టాక్స్ గొడవలు రావడం లేదనీ, ఆయన ఆశీర్వాదంవల్లే తన నాలుగోభార్యకి కొడుకు పుట్టాడనీ ఖాయంగా నమ్ముతున్న ధీరజ్‌మల్ ధోకా తన కంపెనీ వర్కర్స్‌చేత ఉచితంగా కిరీటం తయారుచేయించాడు...."

"బాస్....ఇదంతా మీకు...." విశ్వకర్మారావు ఆశ్చర్యాన్ని దాచుకోలేకపోతున్నాడు.

బలరామ్ గర్వంగా నవ్వాడు: "కళ్ళూ, చెవులూ

తెరచుకుని వుంటే కథలు తెలుస్తూవుంటాయ్! ఈ వారంలో యిదొక సంచలనవార్త అయ్యింది. ప్రతీ పత్రికా వజ్రకిరీటం గురించీ, స్వామీజీ పవిత్రమూర్తి గురించీ రాస్తోంది...."

"అన్నింటినీ వొదిలేసి, ఆశ్రమంలో వున్న స్వామీజీకి వజ్రకిరీటం దేనికో?" గజపతి ప్రశ్నించాడు.

"స్వామీజీ కిరీటం ధరించడం తనకోసం కాదు; భక్తుల కోసం!" బలరామ్ నవ్వుతూ అన్నాడు అందరూ నవ్వారు.

"గుళ్ళో దేముడికి నగలు అలంకరించి. చూసి ఆనందించే భక్తుల్లా, స్వామీజీని కిరీటంతో అలంకరించి ఆయన భక్తులు ఆనందిస్తారు!" బలరామ్ వివరించాడు.

"ఏమిటో ఈ భక్తుల పిచ్చి, నా కర్థం కావటల్లేదు!" విశ్వకర్మారావు నవ్వుతూ అన్నాడు.

"విశ్వకర్మారావ్, మనిషి తన పాపాల్ని, అక్రమాల్ని కప్పిపుచ్చుకుందుకు ఇలాంటి పనులు చేస్తాడు. బలహీనుల్ని దోచుకొని, ఆ మొత్తంలో దేముడికీ, స్వాములకీ వాటాలు సమర్పించి తన పాపాల్ని శుభ్రంగా కడిగేసుకున్నానని తృప్తిపడతాడు. ఎన్నో మహాత్యాలూ అద్భుతాలూ చూపించి, మనుషుల మతులు పోగొట్టిన దశావతారానంద వేలాదిమంది భక్తుల్ని పోగేసుకున్నాడు. వాళ్ళందరికీ ఆయనే దేముడు. ఆయన దయ లేకపోతే వాళ్ళ వ్యాపారం సాగదు; డాక్టరిచ్చే మందుల్తో వాళ్ళ రోగాలు నయం కావు! చివరికి ఆయన ఆశీర్వాదం లేకపోతే వాళ్ళకి పిల్లలు కూడా పుట్టరు!"

కుంకుమ నవ్వు అందరికీ గిలిగింతలు పెట్టింది. పెదాల

మధ్య మరో సిగరెట్ ఇరికించి, విశ్వకర్మారావు వైపు వంగిందామె. అతను ఆదరాబాదరా ఆమె సిగరెట్ వెలిగించాడు.

“వజ్రాలు ఇస్తున్న మిస్టర్ ఫాక్స్ డయాబిటిస్‌తో చాలా బాధపడ్డాడట. తరవాత స్వామీజీ గోళ్ళసందుల్లోంచీ రాల్చిన విబూది అతని డయాబిటిస్‌ని నయం చేసిందట. ఈ మేరకు ఫాక్స్ ఈ మధ్య ఒక ఇంగ్లీషు వారపత్రికకి ఇచ్చిన ఇంటర్వ్యూలో అన్నాడు!” బలరామ్ నవ్వుతూ ఆగాడు.

“ఫారినర్స్‌కీ ఈ పైత్యం బాగా తలకెక్కింది! మూఢనమ్మకాలు!” విశ్వకర్మారావు అన్నాడు.

“మామూలు మనుషుల మూఢనమ్మకాలు తెలివైన మనిషికి, స్వామీజీలాంటి మనిషికి బాగా ఆర్జించి పెడతాయి. ప్రస్తుతం దశావతారానందస్వామి భక్తుల మూఢనమ్మకం మనకి దాదాపు రెండుకోట్ల రూపాయల్ని ఆర్జించి పెడ్తుంది!”

“వాట్!” విశ్వకర్మారావు అరిచాడు.

“యస్!” తన మొహంలోకి ఉద్రేకంతో, ఆశతో చూస్తున్న మూడుజతల కళ్ళని చూస్తూ అన్నాడు బలరామ్. “చాకచక్యంగా, ధైర్యంగా పనిచేస్తే దశావతారానంద స్వామీజీ తలమీద వజ్రకిరీటం మన వొళ్ళో వాలుతుంది!”

“బాప్!” రాంభోగి ఆశ్చర్యంతో అరిచాడు. “నిజమా?”

గోలీకాయల్లా తయారైన రాంభోగి కళ్ళల్లోకి బలరామ్ నవ్వుతూ చూశాడు. “కాలక్షేపానికి కబుర్లు

చెప్తున్నాననుకుంటున్నావా?"

"మీరు రమ్మనగానే యేదో ఉంటుందనుకున్నాం. ఇంత పెద్ద వేట వుంటుందని ఊహించలేకపోయాం..." గజపతి నవ్వుతూ అన్నాడు.

"కిరీటం గురించి అక్కడా ఇక్కడా విన్నాకూడా ఈ ఐడియా మాకు తట్టలేదు!" విశ్వకర్మారావు మెల్లిగా అన్నాడు.

"అందరికీ అన్నీ తట్టవు. విశ్వకర్మారావ్!" బలరామ్ కొత్త కకోనాని నములుతూ సగర్వంగా అన్నాడు. "సరైన సమయంలో మన హస్తం కదులుతుంది. ఎవరో చిలికిన వెన్న మన వంటింట్లో కరిగి, నెయ్యిగా తయారవుతుంది!"

మూడుతలలు ఆవేశంతో పాముపడగల్లా వూగాయి. విశ్వకర్మారావు ఉద్రేకంతో చూశాడు. "బాస్, మీ మాటలు వింటూంటే, మెహదీహాసన్ గజల్ విన్నట్టుంది!"

బలరామ్ పెదవులు ఎర్రగా విచ్చుకున్నాయి. కుంకుమ అతని మొహంమీద తన చూపుల్ని పర్మనెంట్ గా నాటేసింది.

"ఎవ్వరికీ అనుమానం రాకుండా వజ్రకిరీటాన్ని మాయం చేయడానికి బ్రహ్మాండమైన ప్లాన్ వేశాను. నేను చెప్పినదాన్ని చెప్పినట్టు మరబొమ్మల్లా మీరు చేసుకుపోవాలి...."

"కోట్లు కోటుజేబుల్లో వాలతాయంటే మరబొమ్మ అబ్బలా పనిచేస్తాం!" గజపతి కళ్ళలో తడి ఎక్కువైంది.

"కిరీటం విలువ రెండుకోట్లు. ప్లాన్ చేయడానికి కోటెడు ఖర్చవుతుంది. తరవాత సరుకుని డబ్బుగా మార్చడానికి ఇంకా కోటెడు ఖర్చవుతుంది, నా అంచనా

యాభై లక్షలు. పోతే ఒకటిన్నర కోట్లు నికరంగా మన చేతికి రావొచ్చు. పథకం వేసి, నడిపించినందుకూ, రిస్క్ పూర్తిగా తీసుకున్నందుకూ ఫిఫ్టీ పర్సెంట్ నేను తీసేసుకుంటాను. తతిమ్మా ఫిఫ్టీ మీ నలుగురికీ సమంగా పంచబడుతుంది. అంటే వొక్కొక్కరికి పందొమ్మిది లక్షల్దాకా ముట్టుతుంది!”

నలుగురూ గిలిగింతలు పెట్టినట్టు నవ్వారు. గుజపతీ, రాంజోగీ మొహాల్ని అలుముకుంటున్న చెమటని తుడుచుకున్నాడు. విశ్వకర్మారావు కళ్ళద్దాల్ని తీసి, తుడిచి మళ్ళీ తగిలించాడు. ఇప్పుడు కొత్తగా అవుపిస్తున్న బలరామ్నీ, కుంకుమనీ మార్చి మార్చి చూశాడు. క్షణకాలం గదిలో టేప్ రికార్డర్ శబ్దం మాత్రం వినపడింది.

“బాస్.... పెద్ద మొత్తం....కిరీటాన్ని పైకంగా ఎలా మారుస్తారు?” విశ్వకర్మారావు ప్రశ్నించాడు.

“ఇంకా ఆలోచించాలి. క్షణాలమీద కోట్లు సర్దగలిగిన ఘరానా పెద్దమనిషిని పట్టాలి. తొందరపడి యెవ్వర్నీ నమ్మకూడదు. తల్లి తాళిబొట్టుని తాకట్టు పెట్టుకుని అప్పిచ్చే ‘హృదయం’ వున్న ఆసామీ కావాలి మనకు. అలాంటి వ్యక్తులు దొరకడం పెద్ద కష్టమేం కాదు! అది నాకు వదిలేయండి!

విశ్వకర్మారావు అర్థమైనట్టు నవ్వుతూ తలాడించాడు.

“ప్రెస్ రిపోర్టర్లా నటిస్తూ వెళ్ళి, చాలా కష్టపడి ఎన్నో యాంగిల్స్లో కిరీటం ఫోటో సంపాయించాను. మన ప్లాన్ జయప్రదం కావడానికి విశ్వకర్మారావు తన పనితనం చూపించాలి....” బలరామ్ ఆగాడు. విశ్వకర్మారావు ప్రశ్నార్థకంగా చూశాడు.

“విశ్వకర్మారావ్, ఈ ఫోటోల ఆధారంతో నకిలీ

కిరీటాన్ని సృష్టించగలవా?" బలరామ్ ప్రశ్నించాడు.

విశ్వకర్మారావు ఫోటోల్ని దగ్గరగా లాక్కుని రెండు నిమిషాలు పరిశీలనగా చూశాడు. జుబ్బా జేబులోంచీ సిగరెట్ తీసి పెదాలకి అతికించి, వెలిగించాడు. పొగ వూదుతూ దృష్టిని ఫోటోలమీదే నిలిపాడు.

బలరామ్ బ్రీఫ్‌కేస్‌లోంచీ అరచెయ్యంత వెడల్పుతో వున్న మాగ్నిఫైయింగ్ గ్లాస్‌ని తీసి ఫోటోలమీద పెట్టాడు. విశ్వకర్మారావు మెప్పుగా అతన్ని చూస్తూ మాగ్నిఫెయింగ్ గ్లాస్‌లోంచీ ఫోటోల్ని తీరుబడిగా పరిశీలిస్తూ వుండిపోయాడు. మెల్లిగా తలెత్తి బలరామ్‌ని మెరిసే కళ్ళతో చూశాడు.

"కలవృత్తిలో ఆరితేరినవాడినవుతానని నేను భూమ్మీద పడగానే ఊహించిన మా నాన్న నాకు 'విశ్వకర్మ' పేరు పెట్టాడు. నాది సార్థక నామధేయం బాస్!" అన్నాడతను సగర్వంగా.

"వెరీగుడ్. రోల్డుగోల్డుమీద నకిలీ వజ్రాలు పొదిగి కిరీటం తయారుచెయ్. నకిలీ కిరీటం అసలుదాని కవలలా వుండాలి!"

"ఎంత నకిలీదైనా ఖర్చు యెక్కువే అవుతుంది." విశ్వకర్మారావు ముందు జాగ్రత్తతో అన్నాడు.

"ఎర వేయకుండా ఏనుగును పట్టలేవు. ప్రీమియం చెల్లించకుండా పాలసీ మొత్తాన్ని కొట్టలేవు! ఖర్చు గురించి నీకు బెంగ అనవసరం. అవసరమైనవన్నీ నీకు అందజేయబడతాయి. అందంగా కిరీటాన్ని పోతపొయ్!" బలరామ్ నవ్వాడు.

"డబ్బిచ్చెయ్యండి. అన్నీ నేనే కొంటాను. ఎప్పుడేది కావాలో. ఎంత కావాలో...."

"విశ్వకర్మారావ్, బుర్ర నాది, భుజబలం మీది అని ఇందాకే చెప్పాను. నువ్వు నకిలీనోట్ల ఎక్స్‌పర్ట్‌వని అందరికీ తెలుసు! అవీ, ఇవీ కొంటూ వెళ్ళి ఆనవాళ్లు వదిలేసి, ఆఖర్న మనమీదకి అనుమానాన్ని ఆహ్వానిస్తావు!" బలరామ్ కంఠంలో ఆక్షేపణ దాగలేదు.

విశ్వకర్మారావు దెబ్బతిన్నట్టు చూశాడు.

"నో అఫెన్స్, విశ్వకర్మారావ్! మన ఉనికి ఎవ్వరికీ తెలియకూడదు. మన ఊపిరి యెవ్వరికీ వినబడకూడదు! కార్ఖానాలో కూచుని నువ్వు పనిలో మునిగిపోడానికి నీకు పుష్కలంగా డబ్బిస్తాను. రూపాయి ఖర్చవుతుందని నువ్వు అంటే రెండు రూపాయలు నీ జేబులో వేయబడుతుంది. ఓ.కే?"

విశ్వకర్మారావు మొహంలో నవ్వు నాట్యం చేసింది. సాలోచనగా మాగ్నిఫైయింగ్ గ్లాసుని పైకెత్తి, కళ్ళద్దాలగుండా కుంకుమవేపు చూశాడు. పైగుండీలేని కుంకుమ బుష్‌షర్టు మీద మాగ్నిఫైయింగ్ గ్లాస్ ఫోకస్ చేయబడింది.

"విశ్వకర్మారావ్, కుంకుమని డైరెక్టుగా చూడ్డమే ప్రమాదం. భూతద్దంగుండా చూస్తే కాలి బూడిదై పోతావ్!" బలరామ్ నవ్వుతూ అన్నాడు. కుంకుమ వీణ మీటినట్టు నవ్వింది. విశ్వకర్మారావు తటాలున మాగ్నిఫైయింగ్ గ్లాసుని కిందికి దించేశాడు. నవ్వుతూ బలరామ్ వైపు చూశాడు.

"గణపతీ, రాజోగీ, నువ్వూ ఎక్కడో పాతాళ లోకంలో వర్కుషాపు ప్రారంభించండి. వాళ్ళిద్దర్నీ సంపూర్ణంగా నువ్వు ఉపయోగించుకో. కుంకుమ అప్పుడప్పుడూ మిమ్మల్ని కలుసుకుంటూ వుంటుంది. కొండమీది

కాంతి కావాలంటే ఆమెద్వారా మీకు అందజేయబడుతుంది!" బలరామ్ అన్నాడు.

"నా ఇంట్లో నేలమాళిగ వుంది. అది వున్నట్టు చచ్చిపోయిన మా నాన్నకూ, చచ్చిపోయిన మా అమ్మకూ, చచ్చిపోయిన నా భార్యకీ, బతికున్న నాకూ తప్ప మరెవ్వరికీ తెలీదు! అయితే లోపల కటిక చీకటి! గాలి వుండదు..."

"డోంట్ వర్రీ! గజపతి టెంపొరరీ వైరింగ్‌తో కరెంటూ, ఫాన్లు యేర్పాటు చేస్తాడు. కిరీటం తయారయ్యేదాకా మీరు ఇంట్లోంచీ ఇవతలికి రావాల్సిన అవసరం వుండదు..."

"మాతోపాటు కుంకుమకూడా వుండటం మంచిది. వంటా, వార్పూ, వడ్డనా వగైరా అన్నీ చూసుకుంటుంది!" పదేళ్ళ క్రితం భార్య చనిపోయిన విశ్వకర్మారావు తెలివిగా అన్నాడు.

"విశ్వకర్మా, వెర్రి మొర్రి ఆలోచనలు చేయొద్దు! వంటా, వార్పూ, వడ్డనా మన బిజినెస్ కాదు. మరో సంగతి: నీ చూపులు అదోలా వున్నాయి. వొళ్ళు దగ్గర పెట్టుకొని, కళ్ళని అదుపులో వుంచుకో!" రెప్ప వేయకుండా విశ్వకర్మారావునే చూస్తూ అంది కుంకుమ.

బలరామ్ పగలబడి నవ్వాడు. గజపతీ, రాంజోగీ కులాసాగా శృతికలిపారు. విశ్వకర్మారావు మొహం బిగుసుకుపోయింది.

బలరామ్ బ్రీఫ్‌కేస్‌లోంచీ తీసిన కవర్ని విశ్వకర్మారావు ముందు పడేశాడు. "అందులో కిరీటం కొలతలున్నాయి. ఎత్తూ, అడుగుభాగం వెలుపలి చుట్టుకొలతా, లోపలి చుట్టుకొలతా, పైభాగంలోని శిఖరం కొలతలూ,

ముఖ్యంగా కిరీటం బరువూ వగైరా. కిరీటానికి ఉపయోగించిన బంగారం తూకం. వజ్రాల తూకం, వజ్రాల సంఖ్యా—అన్నీ మరో కాగితంలో వున్నాయి. ఎక్కడ యే రంగు రాళ్ళు, ఎంత సైజువి వుండాలో వివరంగా రాశాను. అడుగున వున్న ఫోటోలో, కిరీటం అసలు సైజులోనే వుంది ..."

"కేవలం ఫోటోలమీద ఆధారపడి డూప్లికేట్ కిరీటం చేయడం అంత సులభంకాదు. అసలు కిరీటాన్ని నేను ప్రత్యక్షంగా ఒకసారి దర్శించాలి...." విశ్వకర్మారావు సందేహిస్తూ అన్నాడు.

"ఆ ఆలోచనకి సమాధి కట్టెయ్. ఎందుకంటే దాన్ని చూడ్డం అసంభవం! తయారైన రోజే అది అతి జాగ్రత్తగా బ్యాంక్ సేఫ్ డిపాజిట్ లాకర్లో భద్రం చేయబడింది. కిరీటం అక్కడున్నంత కాలం బ్యాంక్ సెక్యూరిటీ అధికం చేయబడింది!" బలరామ్ జవాబిచ్చాడు.

విశ్వకర్మారావు నిట్టూర్చాడు. "ఫోటోల్లో వున్నట్టు చేస్తే చాలా?"

"చాలు. ఫోటోలు కిరీటాన్ని అద్దాల్లా చూపిస్తున్నాయి. అలాగని నిర్లక్ష్యంగా పని చేయొద్దు. అతి జాగ్రత్తగా చూస్తేగానీ, అసలో, నకిలీయో తెలీకూడదు. సృష్టికి దీటుగా ప్రతి సృష్టి చేయాలి. విశ్వకర్మారావ్, నీ విశ్వరూపం ఈ పనిలో చూపించు!"

"మీరు చూస్తారు!" విశ్వకర్మారావు సగర్వంగా అన్నాడు.

"గుడ్. నీ హస్త కౌశలంమీద నాకు విశ్వాసంవుంది. అందుకే నిన్ను ఎన్నుకున్నాను. ఇరవై రోజుల్లో పని

అయిపోవాలి...."

"కడుపు చాలా తప్పక!"

"ఊయ్ కాంట్ హెల్పిట్! నీ అండర్ గ్రౌండ్ సెల్‌లో గాఢాంధకారం అన్నావు. లైట్ల మెరుపులో అక్కడుంటే రాత్రేదో, పగలేదో నీకు తెలీదు! నిర్విరామంగా పని చేయి. వాళ్ళిద్దరి చేత పని చేయించు!" అంటూ బలరామ్ కోటుజేబులోంచీ వందరూపాయల నోట్లకట్టని టేబుల్ మీదికి విసిరాడు.

ఆరు కళ్ళు దాన్ని ఆవురావురుమంటూ చూశాయి. అయిదు వేళ్ళు, పాలీడు కాళ్ళలా దాన్ని పట్టుకున్నాయి.

"పన్నెండు వేలు. తలా నాలుగేసి వేలు తీసుకోండి. అది మీ ఖర్చులకి. విశ్వకర్మారావ్, ఎల్లుండి పని ప్రారంభించు. కావాల్సిన వస్తువుల లిస్టు రాసి ఉంకు చేతికి యిచ్చెయ్. అన్నీ ఏర్పాటవుతాయి. బ్రీఫ్ కేసులో ఫోటోలూ, కటింగ్సూ పడేసి తీసుకో" అంటూ బలరామ్ ఆగాడు.

క్షణంలో నోట్లని విప్పదీసి పంచడం పూర్తిచేసిన విశ్వకర్మారావు జేబులోంచి కాగితం, పెన్నా తీసి చకచకా రాయడం ప్రారంభించాడు. పూర్తిగా రాసి, ఫోటోల్నీ, కాగితాల్నీ, మాగ్నిఫైయింగ్ గ్లాసునీ బ్రీఫ్‌లో పడేసి మూశాడు.

"ముగ్గురూ మరో సంగతి గుర్తుంచుకోండి: ఈ రోజు నుంచీ, గడ్డాలు గీసుకోడం, క్రాపులు కత్తిరించడం మానేయండి. అవసరాన్ని బట్టీ మనం ఆశ్రమవాసం చేయాల్సి రావచ్చు. అలాంటప్పుడు అతికించిన గడ్డాల కన్నా అసలు గడ్డాలే క్షేమకరం!" బలరామ్ నవ్వుతూ అన్నాడు.

"ఔను! కిరీటం నకిలీదయితే ఫర్వాలేదు. గెడ్డాలు అసలువే వుండాలి!" కుంకుమ నవ్వుతూ అంది.

అందరూ నవ్వారు. విశ్వకర్మారావు కాగితాన్ని కుంకుమ ముందు పడేశాడు. ఆమె దాన్ని బలరామ్‌కి అందించింది. క్షణకాలం దాన్ని పరిశీలించి అతను ఆమెకే అందించాడు.

బలరామ్ తటాలున లేచి నిలబడి, అందర్నీ కలయ జూశాడు. "థాంక్స్ ఫర్ కమింగ్! ఈ మీటింగ్ గురించీ, చర్చించిన అంశాల గురించీ, తీసుకున్న నిర్ణయాల గురించీ మీరు పూర్తిగా మరిచిపోవాలి. అతిగా తాగకండి. అతిగా వాగకండి!"

"పెదవి కదపాల్సిన అవసరం లేదుగా!" విశ్వకర్మారావు నవ్వుతూ అన్నాడు.

"కదపకపోవడం మీకే మంచిది. పెదవి కదిపితే, నోరు నొక్కబడుతుంది; శాశ్వతంగా!" బలరామ్ కంఠం విని ముగ్గురూ ఉలిక్కిపడి చూశారు.

బలరామ్ నవ్వుతున్నాడు. ఆ నవ్వులో స్నేహభావం లేదు. ఏదో హెచ్చరికా, ఏదో బెదిరింపూ, ఏదో నిర్ణయం వున్నాయి.

"మీరు ముగ్గురూ వెళ్ళండి ఎల్లుండి తెల్లారేలోగా అండర్ గ్రౌండ్ వర్క్‌షాప్‌లో కల్సుకుంటాను!" అన్నాడు బలరామ్.

ముగ్గురూ అతనికి నమస్తే చెప్పి కదిలారు. విశ్వకర్మారావులో కుంకుమ గురించి యేవో ప్రశ్నలు తలెత్తుతున్నాయి.

"కుంకుమా! తలుపులు మూసి, లాక్ చేసి, టేప్ రికార్డర్ నోరు నొక్కేసి, బెడ్‌రూమ్‌లోకి రా!" బలరామ్

ఆజ్ఞాపించాడు.

బలరామ్ ఆజ్ఞ విశ్వకర్మరావులో తలెత్తిన ఒక ప్రశ్నకి సమాధానం చెప్పింది. అప్రయత్నంగా నిట్టూరుస్తూ బ్రీఫ్ కేసుతో అతను గుమ్మం దాటాడు. తలుపు మూసుకుంది....

## 2

పదిహేనుమంది వ్యక్తులు రౌండ్ టేబుల్ చుట్టూ కూచున్నారు. అందరిముందూ ఆరెంజి జ్యూస్ గ్లాసులున్నాయి. జ్ఞానానందాశ్రమ్ మేనేజర్ సౌజన్యమూర్తి అందర్నీ చిరునవ్వుతో కలయజూశాడు. పోలీస్ కమీషనర్ రామలింగం స్టేట్ బాంక్ మేనేజర్ సుబ్బారావు. వజ్రాలగనుల ఓనర్ మిస్టర్ ఫాక్స్. అతని పార్టనర్ మిస్టర్ రాక్స్. ధీరజ్‌మల్ ధోకా. జిల్లా కలెక్టర్ కాంతారావు. ఆర్.టి.సి. జోనల్ మేనేజర్ కూర్మావతారం, దశావతారానంద స్వామీజీ పర్సనల్ అసిస్టెంట్ మంగళం. వివిధ ప్రాంతాల్లో దశావతారానంద సేవా సంఘాల ప్రతినిధులు ఆరుగురూ, స్థానిక పెద్దమనుషులు రఘురామ్‌రెడ్డి, జగన్నాథం, ప్రెస్ రిపోర్టర్ ప్రభంజనం... రావాల్సిన వాళ్ళంతా వచ్చారు. సౌజన్యమూర్తి దగ్గి గొంతు సవరించుకున్నాడు.

“దశావతారానందస్వామీజీ షష్టిపూర్తి మహోత్సవ కమిటీ సభ్యులందరికీ స్వాగతం. స్వామీజీ మనందరికీ ప్రత్యేకంగా ఆశీస్సులు అందజేశారు....” అంటూ ఆగాడతను. చాలా తలలు ఊగిసలాడేయి.

తన ముందున్న పేపర్లని చేతుల్లోకి తీసుకుని, రిమ్‌లెస్ అద్దాలగుండా క్షణకాలం చూసి, సౌజన్యమూర్తి తలెత్తి అందర్నీ సంతోషంతో చూశాడు.

"వచ్చేనెల ఏడో తారీఖు నుండీ మూడురోజుల పాటు జ్ఞానపర్వతంమీద స్వామీజీ షష్ఠిపూర్తి ఉత్సవాలు జరుగుతాయని తెలియజేయడానికి ఆనందిస్తున్నా. ఆ సందర్భంలో మూడు లక్షలమంది దాకా భక్తులు జ్ఞానానందాశ్రమానికి రావొచ్చని అంచనా వేయబడింది. ఇండియా నలుమూలల్నుంచేగాక, విదేశాల నుండి కూడా భక్తులు వస్తారు. అంచేత ఉత్సవం ముందు మూడురోజుల్నుంచీ పూర్తయ్యాక రెండురోజుల్దాకా రక్షణ, రవాణా పారిశుద్ధ్య సౌకర్యాలు చాలా అవసరం. అందుకే ఐజీ ఆఫ్ పోలీస్ శ్రీరామలింగంగారినీ, ఆర్టీసీ కోనల్ అధికారి శ్రీ కూర్మావతారంగారినీ, మన జిల్లా కలెక్టర్ శ్రీ కాంతారావుగారినీ ఈ సమావేశానికి ప్రత్యేకంగా ఆహ్వానించాం. అంగీకరించి విచ్చేసిన వారికి ఆశ్రమ కార్యనిర్వాహక మండలి తన కృతజ్ఞతలు తెలియజేస్తోంది...." సౌజన్యమూర్తి ఆగి, ఐజీని, కలెక్టర్ని చిరునవ్వుతో చూశాడు.

ఐజీ రామలింగం గంభీరంగా తల పంకించాడు. "జ్ఞానపర్వతంమీదా, కొండ కొడ్డుమీదా అవసరమయినంత పోలీసు బందోబస్తు యేర్పాటు చేస్తాం" అన్నాడు.

అతని చూపుల్ని గమనించిన కలెక్టర్ కాంతారావు ముందుకి వంగాడు. "శానిటరీ యేర్పాట్లు చూడ్డానికి అవసరమయిన సిబ్బందిని ఆ శాఖనుండీ డెప్యూట్ చేస్తాం. ఇంకా మా కార్యాలయం చేయదగిన యేర్పాట్లేవైనా వుంటే మీరు అడగండి" అన్నాడు.

"ఉత్సవం ముందు రెండురోజుల్నుంచీ, ఉత్సవం తర్వాత రెండురోజులదాకా, అంటే 5-వ తారీఖు నుండీ

పదకొండో తారీఖుదాకా పది బస్సుల్ని కొండమీదికి నడిపే యేర్పాటు చేస్తాం. అంతేగా?" ఆర్టీసీ కూర్మావతారం అడిగాడు.

"థాంక్స్! అంతే...." అంటూ సౌజన్యరావు ఐజీ వైపు చూశాడు. "స్వామీజీ భద్రతలే పర్వతంమీద చేరినా కూడా, ఖరీదయిన వజ్రకిరీటం ఆ మూడురోజులూ ప్రదర్శింపబడుతుంది కనుక, ముందుజాగ్రత్తతో మఫ్టీలో కొంత సాయుధ బలగాన్ని యేర్పాటుచేయాలని కోరుతున్నాం...."

ఐజీ అర్థమైనట్టు తల పంకించాడు. "కిరీటం ఎప్పుడు పైకి తీసికెళ్ళబడుతుంది?"

బ్యాంక్ మేనేజర్ సుబ్బారావు పైకి లేచి నిలబడ్డాడు. "ఆరో తేదీ సాయంత్రం కిరీటాన్ని సురక్షితంగా కొండకి చేర్చే బాధ్యతని మా బ్యాంకు స్వీకరించింది. ఆర్మ్డ్ గార్డు ప్రొటెక్షన్లో, క్లోజ్డ్ వాన్లో కిరీటం ప్రయాణం చేస్తుంది. ఆ తరువాత ఉత్సవాల్లో కలెక్ట్ అయ్యే పైకాన్ని ఎంచడానికి బ్యాంకు సిబ్బందిని నియోగిస్తున్నాం. కలెక్షన్ మొత్తం ఏ రోజు కారోజు క్లోజ్డ్ వాన్లో మా బాంకుకి చేరుతుంది!" అన్నాడు సగర్వంగా.

"వెరీగుడ్! కిరీటం పైకి వెళ్ళే సమయంలో సాయుధ పోలీసులు దారిపొడువునా పోస్టు చేయబడతారు. ఉత్సవాల తరువాత కిరీటం యెక్కడుంటుంది?" ఐజీ రామలింగం ప్రశ్నించాడు.

సౌజన్యమూర్తి గొంతు సవరించుకున్నాడు. "ఆశ్రమంలో ఒక స్ట్రాంగ్ రూమ్ నిర్మించబడింది. అందులో భద్రపరుస్తాం. స్వామీజీగారి పర్సనల్ అసిస్టెంట్

మంగళంగారి ఆధ్వర్యంలో ఆ ఏర్పాట్లు జరిగాయి!"

"సౌజన్యమూర్తిగారూ, రాబోయే జనసమ్మర్దం దృష్ట్యా అందరికీ వ్యాధినిరోధక టీకాలు వేయడం మంచిదని మా సలహా...." కలెక్టర్ కల్పించుకున్నాడు.

"యస్! ఎ గుడ్ సజెషన్....!" ఐజీ అన్నాడు.

"మీ సలహాకి ధన్యవాదాలు. కాని వ్యాధి నివారణలో స్వామీజీ ఖండాంతర ఖ్యాతి ఆర్జించారు జ్ఞాన పర్వతంమీద యింతవరకూ యెవ్వరికీ పడిశం కూడా పట్టలేదు. అలాంటి ఆశ్రమంలో, అలాంటి స్వామివార్ని దర్శించడానికి వెళ్ళే భక్తులకు అంటువ్యాధుల భయం లేదు. టీకాలు స్వామివారి విషయంలో, భక్తుల విశ్వాసం విషయంలో నెగటివ్ ఎఫెక్టుని పుట్టిస్తాయి...."

"యస్!" మిస్టర్ ఫాక్స్ ఉద్రేకంతో అరిచాడు. "అయామ్ ది లివింగ్ ఎగ్జాంపుల్ ఆఫ్ ది మిరక్యులస్ పవరాఫ్ ది స్వామీజీ! ది గ్రేట్ సోల్ హాస్ క్యూర్డ్ మెడయాబిటీస్ విత్ ఎ స్పూన్ ఫుల్ ఆఫ్ హోలీ యాష్! దేర్ వోంట్ బీ ఎనీ నీడ్ ఫర్ ఇనాక్యులేషన్!"

కలెక్టర్ కాంతారావు తలాడించాడు. చిరునవ్వుతో ఐజీవైపు చూశాడు. సౌజన్య గంగిరెద్దులా తల ఊగిస్తున్నాడు.

"అదీగాక, స్వామీజీ వంటకి ఉపయోగించే అన్ని పదార్థాలమీదా, పాలమీదా, ఇడ్లీ పిండిమీదా, కాయగూరలమీదా, నీళ్ళమీదా మంత్రించిన తమ కమండల జలాన్ని ప్రోక్షిస్తారు! అదే ఏకైక వ్యాధినిరోధక ఔషధం!"

"మీ యిష్టం!" కలెక్టర్ కాంతారావు నవ్వుతూ

అన్నాడు.

సౌజన్యమూర్తి ఆనందంగా తల పంకించాడు. "ధీరజ్ మల్ ఖోశాగారూ, రఘురామ్ రెడ్డిగారూ, జగన్నాథంగారు భక్తులకి అవసరమయ్యే ఆహారపదార్థాల్ని ఏర్పాటు చేస్తున్నారు. వివిధ సేవాసంఘాల కార్యకర్తలు వంటగదిలో స్వచ్ఛందంగా పని చేయడానికి ముందుకి వస్తున్నారు...."

"మిస్టర్ సౌజన్యమూర్తీ! జస్టె మోమెంట్! ఆశ్రమంలో యేవో డెయిలీ కలెక్షన్స్ అన్నారు. ఏమిటవి?" విజీ ప్రశ్నించాడు.

"షష్ఠిపూర్తి రోజునుంచీ మూడు రోజులు స్వామీజీ వజ్రకిరీటం ధరిస్తారు. అది సాయంకాలం ప్రవచనం సమయంలో మాత్రమే. అప్పుడు భక్తులు ఆయనకి ముడుపులు చెల్లిస్తారు. స్వామీజీ ధరించని సమయంలో కిరీటం హాలు మధ్యలో డిస్ ప్లే చేయబడుతుంది. అప్పుడూ భక్తులు తమ శక్తికొద్దీ ధనం సమర్పించుకుంటారు....తరువాత— ఎన్ని లక్షలమందికైనా రెండు పూటలా చక్కటి భోజనం, పొద్దుట టిఫిన్ కాఫీ, సాయంకాలం టీ— ఉచితంగా యివ్వబడతాయి. మా అంచనా ప్రకారం ఉచితంగా ఆహారం తీసుకోడానికి భక్తులు అంతగా ఇష్టపడరు. అంచేత భోజనశాలల్లో, టిఫిన్, కాఫీ కౌంటర్ల దగ్గరా హుండీలు యేర్పాటు చేస్తాం. భక్తులు కావాల్సినంత తింటారు. తోచినంత హుండీలో సమర్పిస్తారు. ఇంక స్వామీజీ ఫోటోలూ, మా వేదాంత గ్రంథాలూ, లాకెట్లూ, ఉంగరాలూ, మంత్రించిన యంత్రాలూ, తాయెత్తులూ వగైరా సేల్స్ భారీగా వుంటాయి!"

"ఆ కలెక్షనని యెప్పటికప్పుడు లెక్కపెట్టి, క్లియర్

చేయడానికి మా బ్యాంక్ సిద్ధంగా వుంది. పైకం ఏ రోజు కా రోజు ఆశ్రమ అకౌంట్‌లో జమ చేయబడుతుంది!" బ్యాంక్ మేనేజర్ సుబ్బారావు కల్పించుకున్నాడు.

రిపోర్టర్ ప్రభంజనం లేచి నిలబడ్డాడు. సౌజన్యమూర్తి అతన్ని ప్రశ్నార్థంగా చూశాడు.

"జనసమ్మర్దం ఎక్కువగా వుండే ప్రదేశాల్లో ఏవైనా అవాంఛితమైన సంఘటనలు జరగొచ్చు. క్రైమ్స్, ఉపద్రవాలు జరక్కుండా ఏ మెషర్స్ తీసుకున్నారు?" ప్రభంజనం ప్రశ్నించాడు.

"టెంపొరరీ పోలీస్ ఔట్‌పోస్టు ఒకటి యేర్పాటు చేయమని ఐజీగార్ని కోరాలనుకున్నాము. తగినంత పోలీసు బలగం, హోమ్‌గార్డ్స్, స్వచ్ఛంద సేవాదళాలు నిర్విరామంగా కృషి చేస్తాయి. ఆశ్రమ్‌కి టెలిఫోన్ కనెక్షన్ వుంది. అయినా ఒక టెలిఫోన్ ఎక్స్‌ఛేంజ్ అవసరాన్ని మేము గుర్తించాం. టెలి కమ్యూనికేషన్ శాఖ పర్వతంమీద తాత్కాలిక ప్రాతిపదికమీద ఒక ఎక్స్‌ఛేంజ్‌ని యేర్పాటు చేస్తోంది. ఒక పోస్టాఫీసు కూడా!"

సౌజన్యమూర్తి ఆగి, ఉత్సాహంగా చూశాడు.

"మిస్టర్ సౌజన్యమూర్తీ! హెల్తు. మెడికల్ మెషర్స్ గురించి ఆలోచించారా?" కలెక్టర్ ప్రశ్నించాడు.

"వ్యాధినిరోధక టీకాలు వద్దన్నాగానీ, అవసరమైన ఇతర యేర్పాట్లు చేశాం. మీ అందరి సందేహాలు నివృత్తి కావడానికి మా యేర్పాట్లని బ్రీఫ్‌గా వివరిస్తాను: మూడు లక్షలమంది వస్తారని అంచనా వేసినా కూడా, అయిదు

లక్షలమందికి సరిపడే యేర్పాట్లు చేశాం. ఒకటిన్నరకిలోమీటర్ల ఏరియాలో పాతిక టౌన్‌షిప్స్ నిర్మాణం సాగుతోంది. టెంపొరరీ రూఫ్స్‌కింద ఒక్కో టౌన్‌షిప్‌లో ముప్ఫైవేలమంది దాకా వుండొచ్చు. నీటి సౌకర్యమూ, మరుగు దొడ్ల సౌకర్యమూ చక్కగా యేర్పాటవుతున్నాయి.

"ఒక్కసారికి వెయ్యిమంది కూచుని భోజనం చేయగలిగేలా అయిదు పెద్ద పెద్ద హాల్సున్నాయి. వాటర్ కంటామినేట్ అవకుండా యేర్పాట్లు జరిగాయి. ఒకడు వాడిన లోటానీ, ప్లేటునీ, మరొకరు వాడే అవసరమే వుండదు. డిస్పోసబుల్ పేపర్ ప్లేట్లూ, కప్పులూ వాడుతాం!

"తరువాత ఒక్కో టౌన్‌షిప్‌లో పాతిక బెడ్స్‌తో ఒక హాస్పిటల్ వుంటుంది. 250 మంది డాక్టర్లూ, వెయ్యిమంది నర్సులూ, మరో వెయ్యిమంది ఇతర సిబ్బందీ ఆ క్లినిక్స్‌లో స్వచ్ఛందంగా పని చేస్తారు. మన దేశంలోని ఫార్మాస్యూటికల్ కంపెనీలూ, ఫారిన్ కంపెనీలు కొన్నీ సాధారణ పరిస్థితుల్లో అవసరమయ్యే మందులూ వగైరా స్వామీజీకి సమర్పించాయి. నిజం చెప్పాలంటే దాదాపు ఏ జబ్బుకయినా ఆ వారం రోజులూ జ్ఞానపర్వతంమీద ట్రీట్‌మెంట్ — ఫ్రీ ట్రీట్‌మెంట్ దొరుకుతుంది!

"మరో గుడ్ న్యూస్: ముందుచూపుతో స్వామీజీ అక్కడ ఒక టెంపొరరీ ప్రసూతి కేంద్రం యేర్పాటు చేయమన్నారు. స్వామీజీ ఆశీర్వాదబలంతో గర్భవతులయిన కొందరు వ్యక్తం చేసిన కోరిక ప్రకారం ఈ సందర్భంలో ప్రసూతి కేంద్రం ఏర్పాటు చేయబడింది. రెండు

డజన్లమందికి పైగా స్త్రీలు ఉత్సవాల రోజుల్లో కల్లలు కాబోతున్నారు!"

"యూ హావ్ టేకన్ కేర్ ఆఫ్ ఎవ్విరిథింగ్? అయితే నేరాల్లాంటి అవాంఛిత సంఘటనల గురించి మీరు అంతగా ఆలోచించినట్టు లేదు!" ప్రభంజనం నవ్వుతూ అన్నాడు.

సౌజన్యమూర్తి చిన్నగా నవ్వాడు. "క్రైమ్ రిపోర్టర్ ప్రభంజనంగారు క్రైమ్ యాస్పెక్ట్ గురించి తప్ప మరో విషయం గురించి మాట్లాడ్డంలేదు!"

గదిలో నవ్వులు వ్యాపించాయి. అయితే, పోలీస్ కమీషనర్, కలెక్టర్, ప్రభంజనం—ముగ్గురూ నవ్వలేదు. ప్రభంజనం లేచి, నిలబడి అందర్నీ కలయజూశాడు. తన చూపుల్ని సౌజన్యమూర్తి ముఖంమీదే నిలిపాడు.

"సౌజన్యమూర్తిగారూ, మీ కాన్ఫరెన్స్‌నీ, ప్రోగ్రాంనీ కవర్ చేయడానికి నేను రానక్కర్లేదు. న్యూస్ రిపోర్టర్ చాలు. అయితే, ఒక ప్రత్యేకమైన కారణంతో మా ఎడిటర్ గారు మీ ప్రోగ్రాంస్‌ని కవర్ చేయడానికి నన్ను నియమించారు. లక్షలాదిమంది గుమిగూడేచోట కోట్లాది రూపాయలు పోగుపడేచోట నేరాలు జరక్కుండా మీరు చేసిన ఏర్పాట్లని అధ్యయనం చేసి, ప్రచురించాలని ఆయన అనుకున్నారు...."

"ఆల్ రైట్....పోలీస్ ఔట్ పోస్టులో,x స్త్రీ వుంటాయని ఇందాకే చెప్పాను. కేవలం అదంతా ఒక హంగు మాత్రమే. జ్ఞాన పర్వతంమీద, దశావతారానందస్వామి వారి సన్నిధిలో దొంగతనాలూ, హత్యలూ జరగవు. గౌతమబుద్ధుడిముందు అంగులీమాలుడు మారిపోయినట్టు,

స్వామీజీ సాన్నిధ్యంలో దొంగ దొర అవుతాడు. హంతకుడు అహింసావాది అయిపోతాడు! యూ నీడ్ నాట్ వర్రీ!" సౌజన్యమూర్తి ఉద్రేకంతో అన్నాడు.

పన్నెండుజతల చేతులు ఆవేశంతో చప్పట్లు కొట్టాయి. సౌజన్యమూర్తి యల్లా వెంకటేశ్వర్రావు సహమృదంగ సమ్మేళనం వింటున్న వాడిలా తల వూగిస్తూ వుండి పోయాడు.

"మీరన్నట్టు జరుగుతుందనే ఆశిద్దాం!" ప్రభంజనం చిరునవ్వుతో అన్నాడు, చప్పట్ల కచ్చేరీ పూర్తయ్యాక.

"తప్పకుండా జరుగుతుంది! అయితే జనసమ్మర్దాన్ని ముఖ్యంగా విదేశీ జనాన్ని దృష్టిలో వుంచుకుని, భారీ ఎత్తున చేస్తున్న అరేంజిమెంట్స్‌కి ఒక పరిపూర్ణ రూపాన్ని ఇవ్వడానికీ పోలీసుబందోబస్తూ వైద్య సౌకర్యాలూ ఏర్పాటుచేయడం జరుగుతోంది. మా అనుభవం దృష్ట్యా, వైద్య సహాయం అవసరమే లేదు! కొండ మీద బండరాతిలోంచీ నిరంతరంగా వూరుతున్న చెలమ లక్షల గ్యాలన్ల నీటిని కోనా పర్వతంకింద ప్రవహిస్తున్న నదిలోకి సరఫరా చేస్తోంది. దాని పేరు 'జ్ఞానతీర్థం' అని నేను మీకు చెప్పాల్సిన అవసరంలేదు! ఆ జ్ఞానతీర్థమే వందలాది కొళాయిలద్వారా జ్ఞాననగర్, ఆదిశంకర నగర్, రామానుజ నగర్, మధ్వ నగర్, రామకృష్ణ నగర్, వివేకానంద నగర్, అరవింద నగర్, రమణ నగర్, రామతీర్థ నగర్ వగైరా పాతిక నగర్‌లకి పాతిక టౌన్‌షిప్స్‌కి మన వేదాంతుల పేర్లిచ్చాం— సప్లై అవుతుంది. కంటామినేషన్‌కి అతీతమైన పవిత్ర జలం అది! ఈ కారణంగా ఎవ్వరికీ రోగాలూ, రొష్టులూ రావు!" సౌజన్యమూర్తి ఊపిరి తిప్పుకోకుండా చెప్పి

ఆగాడు.

"మీరు మాకు చెప్పాల్సిందీ, మేం వినాల్సిందీ ఇంకా యేమైనా వుందా?" వి.జీ. రామలింగం ప్రశ్నించాడు.

"మా ప్రయత్నాలూ, యేర్పాట్లూ మరి కొన్నింటిని మాత్రం మీకు వివరించాలి. అదంతా విన్నాక మీకు ఒక అవగాహన కలుగుతుంది. మా ప్రయత్నాలకి మీ శాఖల సౌజన్య సహకారాలు తరవాత సంపూర్ణంగా లభిస్తాయి...." సౌజన్యమూర్తి ఏకాగ్రతతో చెప్పసాగాడు.

## 3

నీలంరంగు జీన్స్‌మీద చారల బుష్‌షర్ట్ వేసుకున్న కుంకుమ నిర్లక్ష్యంగా తలుపు తోసుకొని గదిలోకి జొరబడింది. ఆమె వెనకే తలుపు టైట్‌గా మూసుకుపోయింది. గొళ్ళెం బిగించి, వెనక్కి తిరిగిందామె. ఎయిర్‌కండిషన్డ్ రూంలో హాయిగా వుంది.

మంచంమీదున్న ఫోమ్‌బెడ్‌మీద వినాయకుడిలా కూచున్న అతను ఆమెకేసి చిరునవ్వుతో చూశాడు. కుంకుమ మంచం దగ్గరగా వున్న మెత్తటి కుర్చీలో కూలబడింది. అతని కళ్ళు ఆమెవైపు మెరుస్తున్నాయి. ఆ మెరుపులో యేదో ఆకలి కనిపిస్తోంది.

"నిన్ను చూస్తూంటే పాతికేళ్ళ వయసులో హిందీ సినిమాల్లో నేను చూసిన నటి కుమ్‌కుమ్ గుర్తొస్తోంది!" అన్నాడతను. అతని కంఠం వర్షాకాలంలో యుగళగీతం పాడుకున్న రెండు కప్పల జంటస్వరంలా ధ్వనించింది.

"థాంక్స్. నన్ను చూస్తే మీకు నేనే గుర్తొస్తానని ఇంతకాలం అనుకున్నా!" కుంకుమ కంఠంలో ఆక్షేపణ ధ్వనించి, అతన్ని గిలిగింతలు పెట్టింది.

"ఏమిటి కథ? బండి కదిలిందా?" అతని కంఠంలో ఇందాకటి నవ్వు లేదు. అధికారం వుంది.

"ఆ. కదిలింది. గమ్యస్థానం చేరుతుంది కూడా!" కుంకుమ అంది.

"గుడ్....అతన్ని నమ్మిచ్చా?"

కుంకుమ అతన్ని సూటిగా చూసింది. "ఆ ప్రశ్నని చాలా ఆలస్యంగా అడుగుతున్నారు!"

అతను తలపంకించాడు. "అఫ్‌కోర్స్...అడ్వాన్సుగా కొంత మొత్తాన్ని యిచ్చాం. అయినా ఫర్వాలేదు. మనల్ని కాదని అతను మరోచోటికి వెళ్ళలేడు! మోసం చేస్తే మసి అయిపోతాడు....ముందుజాగ్రత్తతో నిన్ను అతనికి నీడగా వుంచేశాను...."

"అలాంటప్పుడు అతన్ని నమ్మిచ్చా అన్న అనుమానం దేనికి?" కుంకుమ ప్రశ్నించింది.

"కోట్ల విలువచేసే వ్యాపారం చేస్తూ. లక్షలు అడ్వాన్సుగా యిచ్చాక, ఆ మాత్రం సందేహించకుండా వుండలేం! ఆల్ రైట్ ప్లాన్ యే స్టేజిలో వుంది?" ఇండియా కింగ్స్ సిగరెట్ వెలిగిస్తూ, కాళ్ళు మంచం కిందికి దించి అడిగాడతను.

"తోడేళ్ళు గొర్రెల మందలో కలిసిపోయాయి...."

"కుంకుమ్, అర్థమయ్యే భాషలో మాట్లాడు!"

"నలుగురూ స్వామీజీ శిష్యుల గుంపులో చేరిపోయారు. వాళ్ళని యెవరూ పోల్చుకోలేరు. శతకోటి గడ్డాల్లో నాలుగు గడ్డాలు! ఎల్లుండి షష్టిపూర్తి కార్యక్రమం ప్రారంభమవుతోంది. సమయం చూసి సాధిస్తానన్నాడు బలరామ్. ముందుగా యిద్దరు కిందుకి చేరుకుంటారు...."

"నువ్వూ వెళ్తున్నావుగా....?" అడ్డొస్తూ ప్రశ్నించా డతను.

"వొద్దా?" కుంకుమ వెటకారంగా అడిగింది.

"నిన్ను నమ్మి ఈ బేరంలోకి దిగాను; ఏదయ్యేదాకా నువ్వతన్ని కంట్రోల్ చేయాలి!"

"నన్ను అతనికి అడ్హెసివ్ టేప్‌లా తగిలించిన మీ ఉద్దేశం అతనికి తెలుసు. మీరు కంగారుపడక్కర్లేదు. సరుకు మనకు చేరుతుంది. సొమ్ము అతనికి చేరుతుంది. అంతే!"

అతను యేదో చెప్పబోతూ, ఆగాడు. కొన్ని విషయాలు కుంకుమకి కూడా చెప్పకూడదు! వజ్రకిరీటాన్ని సొంతం చేసుకోడంలో తన ప్లాను తనకున్నాయి....

"ఓకే కుమ్‌కుమ్! ఎల్లుండి రాత్రికోసం వెయ్యికళ్ళతో ఎదురుచూస్తుంటాను...." అంటూ అతను సిగరెట్‌ని యాష్‌ట్రేలో నొక్కేశాడు.

"నాకు పైకం కావాలి........" కుంకుమ మెల్లిగా అంది.

"జ్ఞానపర్వతంమీద అన్నీ నీకు ఫ్రీగా దొరుకుతాయి" అతను నవ్వుతూ అన్నాడు.

"అక్కడ దొరికేది అన్నమే! నాకు వేరే వస్తువులు కావాలి!" కుంకుమ విసుగ్గా అంది.

అతను కొలిమితిత్తిలా శబ్దం చేస్తూ నిట్టూర్చాడు. "ఎంత!"

"పాతిక వేలు."

"వాట్!"

"పాతిక వేలు." ముందుకి వంగి, అతని పాకెట్లోంచి సిగరెట్ అందుకుని ఎర్రటి పెదాల మధ్య యిరికిస్తూ

అంది కుంకుమ.

"నాన్సెన్స్! బూడిద రాసుకుని తిరిగే ఆశ్రమంలో అంత ఖర్చు దేనికి? కాల్చి బూడిద చేస్తావా?"

"తగలేసి బూడిద చేసి, రాసుకు తిరగడానిక్కాదు? నేను యెంతో రిస్క్‌ తీసుకుంటున్నా. రిస్క్‌కి ప్రతిఫలం!" నవ్వుతూ అంది కుంకుమ.

"ఏమైనా, పాతిక వేలు ఎక్కువే!"

"రెండు కోట్ల వజ్రకిరీటం ముందు పాతిక వేలు బూడిదే!" కుంకుమ నవ్వుతూ అంది.

"గాలి వీస్తున్నప్పుడు తూర్పారబడుతున్నావ్! ఆల్ రైట్, పాతిక వేలు ...." అంటూ అతను తలగడకింద నుంచీ వందరూపాయల కట్టల్ని తీసి ఆమె వొళ్ళో పడేలా విసిరాడు.

నోట్లకట్టల్ని అందుకుని కుంకుమ నవ్వుతూ లేచింది. అతను ఆమెవైపు ఆదోలా చూశాడు. గోడవారగా టేబుల్ మీదున్న చిన్న లెదర్ బాగ్‌ని అందుకుని నోట్ల కట్టల్ని అందులో పడేసుకుంది కుంకుమ. ఎర్రటి పెదాల మధ్య తెల్లటి పళ్ళు మెరిసేలా నవ్వుతూ అతన్ని చూసింది.

"ఎల్లుండి!" అందామె కదలబోతూ.

"ఎల్లుండి కోసమే కాదు; నీ కోసం కూడా పొద్దుట్నుంచీ యెదురు చూస్తున్నా, కుంకుమ్!" అన్నాడతను—లెడ్జర్‌ని కింద పడేసి మంచంమీద చేత్తో తట్టుతూ.

కుంకుమ విసుగ్గా చూసింది. ఛాతీమీద వెంట్రుకలు లేని అతను ఫుల్‌గా గాలికొట్టిన రబ్బరు బొమ్మలా వున్నాడు. అతని చిన్నచిన్న కళ్ళల్లో కోరిక నిప్పులా

స్పష్టంగా అవుపిస్తోంది.

"ఇద్దరు పార్ట్‌నర్స్ మధ్యా నలిగి ఛస్తున్నా. అక్కడా మంచం వుంది!......" కుంకుమ చిరాగ్గా అంది.

అతని మొహం బిగుసుకుపోయింది. రెండుక్షణాల్లో మొహంలోని కండరాలు వదులయ్యాయి. చిరునవ్వు అతని మొహాన్ని వెడల్పుగా సాగదీసింది.

"ఇలాంటి అడ్వెంచర్స్‌లో సెక్స్ కత్తిలా ఉపయోగ పడుతుంది, కుంకుమ్! బీ స్పోర్టివ్. కమాన్!" అన్నా డతను నవ్వుతూ.

లెదర్ బాగ్‌ని టేబుల్ మీదికి గిరాటేసి, కుంకుమ మంచంవైపు కదిలింది. సెక్స్ గురించి ఈ పిప్పళ్ళబస్తా తనకి పాఠాలు చెప్తున్నాడు. తన సెక్స్ రెండువేపులా పదునున్న కత్తిలా అతన్నీ, బలరామ్‌నీ కోస్తోందని ఇద్దరికీ తెలీదు.

# 4

డాబామీద నుంచున్న బలరామ్ కింద కిటకిట లాడుతున్న జనాన్ని తృప్తికరంగా చూస్తూండిపోయాడు. చిటారుకొమ్మమీద కూచుని, నేలమీద అటూ యిటూ తిరుగాడుతున్న కోడిపిల్లల్ని చూస్తున్న గద్దచూపుల్లా వున్నాయతని చూపులు.

చుట్టూ పక్కగొడుగుల్లా వున్న టెంపొరరీ టౌన్‌షిప్ నుండీ చీమలబారుల్లా జనం కదిలిపోతున్నారు. మెయిన్ హాల్ ఆనందమందిరంలో కిరీటం డిస్‌ప్లే చేయబడింది. భక్తులు కిరీటం చుట్టూ ప్రదక్షిణంగా వెళ్తూ దర్శనం చేసుకుంటున్నారు. అన్నివేపులా చీమలబారుల్లా ఆశ్రమం ముందుకి చేరుకొంటున్న జనం నీరెండలో బద్ధకంగా

పాకుతున్న పాము లాంటి ఊహ్య రూపంలో కదుల్తున్నారు.

అంగుళము పొడవు పెరిగిన తన గడ్డాన్ని బలరామ్ వేళ్ళతో తృప్తికరంగా తడువుకున్నాడు. రిమ్‌లెస్ అద్దాలగుండా అతను దేనికోసమో వెతుకుతున్నట్టు చూస్తున్నాడు. విశ్వకర్మారావు మందలో గొర్రెలా జనంలో కలిసిపోయాడు. కుంకుమ తన జాతిలో కలిసిపోయింది. సమయం వస్తేగానీ వాళ్ళిద్దరూ తనకి కనిపించరు. ముగ్గురూ ప్రత్యేకంగా యెవరికీ కనిపించరాదనీ, యే కారణంగా అయినా యెవరి దృష్టినీ ఆకర్షించరాదనీ తను ముందే నిర్ణయించాడు. ఆలోచిస్తూ బలరామ్ తన తన కాటన్ జుబ్బా జేబులోంచీ చుట్టముక్కని తీసి నమలడం ప్రారంభించాడు....

అంతా అనుకున్నట్టే జరిగింది; అప్పటిదాకా. విశ్వకర్మారావులో అంత హస్తకౌశలం వుందని తను ఊహించలేక పోయాడు. అసలు కిరీటం తలదన్నేలా నకిలీది రూపొందింది అతని చేతిలో. తన ప్లానులో ఒకటో స్టేజి జయప్రదంగా పూర్తయింది. రెండు, మూడు, నాలుగు స్టేజిలు చకచకా ఒకదాన్నొకటి తరుముకుంటూ జరిగిపోవాలి!

కావాల్సిందాన్ని చేతుల్లోకి తీసుకోడం. జ్ఞానపర్వతం మీంచీ యెవ్వరికీ అనుమానం రాకుండా కిందికి దిగడం, పురుషుని నగరుగా మార్చుకోడం....ఇవి రెండు మూడు నాలుగు స్టేజిలు .... బలరామ్ చిన్నగా నిట్టూర్చాడు. రెండు, మూడు స్టేజిలు అతని బుర్రని వేడెక్కించేశాయి. కిరీటం దగ్గర యెప్పుడూ యెవరో ఒకరు వుంటున్నారు. వున్నవాళ్ళ కళ్ళు కప్పాలి. రెండు రోజులుగా పర్వతం

మీంచీ యెవ్వరూ కిందికి దిగడంలేదు. భక్తుల్ని చేరవేసిన బస్సులు ఖాళీగా వెళ్తున్నాయి. ఎలాగో బస్సులో వెళ్ళొచ్చు. అయితే అది ప్రమాదం. షష్టిపూర్తి రోజున కిందికెళ్తున్న తమని యెందరో గుర్తుంచుకుంటారు. కానీ యెవరికీ అనుమానం రానిపద్ధతిలో తను కిందికి దిగగలడు. తన మార్గం తనకి ఉంది! బలరామ్ చిన్నగా నవ్వుకుంటూ రిస్టువాచీ చూసుకున్నాడు. మెల్లిగా డాబామీంచీ కిందికి దిగసాగేడు.

## 5

నిమిషాలు గంటలుగా మారుతున్నాయి. కందకపైగా వున్న మెగాఫోన్స్‌లోంచీ యేవో అనౌన్స్‌మెంట్ బిగ్గరగా వినిపిస్తోంది. తెలుగు, కన్నడం, తమిళం, హిందీ, ఇంగ్లీషు భాషల్లో వినిపిస్తున్న ఆ అనౌన్స్‌మెంట్ దశావతారానంద స్వామీజీకి అన్ని భాషలకీ, అన్ని ప్రాంతాలకీ చెందిన భక్తులున్నారని చాటుతోంది. పది నిమిషాల్లో అందరూ భోజనశాలల్లోకి చేరుకోవాలని అనౌన్సర్ అభ్యర్థిస్తున్నాడు.

బలరాం తృప్తికరంగా నవ్వుకున్నాడు. భోజనాల వేళకోసం అతను వెయ్యికళ్ళతో యెదురుచూస్తున్నాడు. కానీ, పీకలదాకా మెక్కడానికి కాదు. అతని ఆకలి వేరు....

వజ్రకిరీట దర్శనం తాత్కాలికంగా ఆపుచేయబడింది. జనం ఆదరాబాదరా డైనింగ్ హాల్స్‌లోకి మందలుగా జొరబడుతున్నారు. చివరి మెట్టుమీద నిలబడి బలరాం గుంపుల్ని చిరునవ్వుతో చూస్తూండిపోయాడు. దొడ్లోంచీ పచ్చికబయల్లోకి ఆవురావురంటూ ఉరకలేస్తున్న పశువుల మందలు గుర్తొస్తున్నాయతనికి. తిండి, సెక్స్ ఆ వేసరికి

మనిషి సర్వాన్నీ మరిచిపోతాడు.

బలరాం కళ్ళు విశ్వకర్మారావుకోసం క్షణకాలం చూశాయి. అతను అవుపించలేదు. ఎప్పుడు, ఎక్కడ ఎలా అవుపించాలో విశ్వకర్మారావుకి తెలుసు. బలరాం జోరుగా కదిలాడు. బారులుగా కూచుని, పదార్థాలతో క్రమంగా నిండుతున్న విస్తర్లని నవ్వుముఖాల్తో చూస్తున్న జనం మధ్యనుంచీ అతను వంటశాలవేపు నడిచాడు. పళ్ళేలూ, బకెట్లూ పట్టుకుని ఆత్రంగా ఉరకలు పెడుతున్న వాలంటీర్లని తప్పుకుంటూ లోపలికి దూరాడు.

అతని చూపులు దేనికోసమో ఆత్రంగా చూశాయి. క్షణంలో అతని కళ్ళు మెరిశాయి. గోడవారగా పడున్న టేబుల్ సాల్టు పాకెట్స్‌మీద అతని చూపులు వాలాయి. బలరాం చీకూచింతా లేకుండా నడిచి, ఒక పాకెట్‌ని అందుకుని, వెనుదిరిగాడు. వడ్డించే కార్యక్రమంలో గోలగా అరుస్తూన్న వ్యక్తులెవరూ తనని చూడ్డంలేదు. సాల్టుపాకెట్ అతని జుబ్బా జేబులోకి జారింది. బలరాం నింపాదిగా ఇవతలికి నడిచాడు. అయిదు నిమిషాల్లో డైనింగ్ హాల్ వెనక భాగం చేరుకున్నాడు.

నిర్మానుష్యంగా ఉన్న ఆ ప్రదేశాన్ని చిరునవ్వుతో కలయజూశాడతడు. ఇరవై అడుగుల దూరంలో పది నిమిషాల క్రితం ఆపబడిన ఒంటెద్దుబండి అలాగే ఉంది. కొండపైకి వోపిగ్గా బండిలాగిన ఎద్దు విశ్రాంతిగా పడుకుని, తృప్తికరంగా నెమరు వేసుకుంటోంది. బండి వ్యక్తి అక్కడలేడు. భోజనంలో మునిగిపోయిన అతను మరో గంటదాకా అటువేపు రాడని బలరాంకి తెలుసు. గంట తరవాతగానీ, బండిలోంచీ పాలకేన్లని దించి స్టోర్ రూంలో అప్పగించడనీ అతనికి తెలుసు. ధ్యానంలో

ఉన్న బైరాగిలా మాసిన్నగా ఉన్న ఎద్దును బలరాం చిరునవ్వుతో చూశాడు....

# 6

బలరాం వరండాలో అసహనంగా నించున్నాడు. విశ్వకర్మారావు యెక్కడ చచ్చాడు? విసుక్కుంటూ అతను డైనింగ్ హాల్ వేపు చూశాడు. అతని కళ్ళు మెరిశాయి. మూతి తుడుచుకుంటూ వస్తున్నాడు విశ్వకర్మారావు. బలరాంని చూడగానే పళ్ళు ఇకిలించాడు. బలరాం నవ్వలేదు. ఒకసారి రిస్టువాచీ చూసుకుని, అతనివేపు తీక్షణంగా చూశాడు. విశ్వకర్మారావు అతనివేపు రాలేదు. ఎడమవైపు తిరిగి ఎటో వెళ్ళిపోయాడు:

అయిదు నిమిషాల తరవాత విశ్వకర్మారావు వరండా మీద ప్రత్యక్షమయ్యాడు. అతని చేతిలో వెడల్పాటి, గుండ్రటి పళ్ళెం వుంది. పళ్ళెంలో ఎత్తుగా మైసూరు మల్లెలు రాశిపోసి ఉన్నాయి. శిఖరంలా ఎత్తుగా ఉన్న మైసూరు మల్లెలు పైనుండీ విశ్వకర్మారావు అతనివైపు నవ్వుతున్నాడు. అతని నవ్వు బలరాంకి యెంతో చెప్తోంది. దగ్గరగా వచ్చిన విశ్వకర్మారావుని అతను తదేకంగా చూశాడు. విశ్వకర్మారావు కళ్ళు ఎందుకో మెరుస్తున్నాయి.

"స్వామీజీ ఈ పూలని హాల్లో ఉంచమన్నారు. వాడిపోయిన పూలని తీసేయమన్నారు" అన్నాడతను. రిహార్సు చేసిన డైలాగ్‌ని అతను అప్పచెప్తున్నాడని బలరాంకి తెలుసు.

బలరాం మాట్లాడకుండా పళ్ళెంలోంచీ ఒక మైసూరు మల్లెను తీసుకొని వెనక్కి తిరిగాడు. పళ్ళెం మోసుకుంటూ విశ్వకర్మారావు అతన్ని వెంబడించాడు. వరండా మెట్లు

దిగి, ఎదురుగా ఉన్న హాలు వేపు ఇద్దరూ నడిచారు. డైనింగ్ హాల్లోంచీ ఇవతలికి వస్తున్న వ్యక్తులు పళ్ళెం లోని పువ్వుల్ని భక్తితో చూసారు. మైసూరు మల్లెలు కొత్త వాసనని మత్తుగా వెదజల్లుతున్నాయి.

మూసిన గుమ్మంముందు బలరాం ఆగాడు. గుమ్మానికి తోరణాలు వేళ్ళాడుతున్నాయి. రెండువైపులా ఇద్దరు వ్యక్తులు కాషాయవస్త్రాల్లో ద్వారపాలకుల్లా నిలబడ్డారు. రెండంగుళాలు పెరిగిన గడ్డాల్లో వాళ్ళ మొహాలు ఆరోగ్యంగా మెరుస్తున్నాయి. ఇద్దరూ ప్రశ్నార్థంగా, ఇద్దర్నీ పువ్వుల గుట్టనూ చూస్తున్నారు.

“బెంగుళూరునుండీ స్వామివారి అంతరంగిక భక్తుడు నంజాండప్పగారు ప్రత్యేకంగా ఈ మైసూరు మల్లెల్ని స్వామీజీకోసం ప్లయిట్‌లో పంపించారు. స్వామివారు పొద్దుట వేసిన పూలని తీసివేసి స్పెషల్ మల్లెల్ని కిరీటం కింద మెత్తగా పరచమన్నారు....” బలరాం మర్యాద ఉట్టిపడే కంఠంతో అన్నాడు.

శిష్యులిద్దరూ పారవశ్యంతో తలలు పంకించారు. ఒకతను వెనుదిరిగి, మూసిన తలుపుమీద చప్పుడు చేశాడు. క్షణంలో తలుపు కొద్దిగా తెరుచుకుంది. లోపల్నుంచీ మరో గడ్డం వ్యక్తి తొంగిచూశాడు. బలరాం చెప్పిన విషయాన్ని అతనికి వివరించాడు ద్వారం దగ్గరున్న వ్యక్తి.

తలపంకిస్తూ అతను తలుపుని బార్లా తెరిచాడు. ఇద్దరూ రెండువైపులా పళ్ళెన్ని పట్టుకొని బలరాం, విశ్వకర్మారావు హాల్లో ప్రవేశించారు. లోపలున్న ఆశ్రమ వ్యక్తి తలుపు మూసి గొళ్ళెం పెట్టేశాడు.

వెనుతిరిగిన అతన్ని బలరామ్ చిరునవ్వుతో చూశాడు.

అతని చెయ్యి జుబ్బా జేబులోకి దూరింది. విశ్వకర్మారావు ఆశ్చర్యంగా చూస్తున్నాడు. బలరామ్ చెయ్యి ఇవతలికి వచ్చింది. వేళ్ళ మధ్య యిరుక్కున్న మైసూరు మల్లెను అతను ఆశ్రమం వ్యక్తి ముందుకి చాచాడు.

"స్వామీజీ ఈ పుష్పాన్ని తమకి ఆశీర్వాదపూర్వకంగా అనుగ్రహించారు...." అన్నాడు బలరామ్ వినయంగా.

ఆ వ్యక్తి రెండు చేతుల్తో బంతిపువ్వులా గుండ్రంగా వున్న మల్లెని అందుకున్నాడు. భక్తి ప్రపత్తులతో దాన్ని రెండు కళ్ళకీ అద్దుకున్నాడు. బలరామ్ చిరునవ్వుతో చూస్తున్నాడు. అతను మైసూరుమల్లెను వినయంగా రెండు చేతుల్తో ముక్కు దగ్గరగా వుంచుకుని, పరవశత్వంతో ఆఘ్రాణించాడు. అతని కళ్ళు ఇంకా అర్థనిమీలితంగానే వున్నాయి. అతని అర్థనిమీలిత నేత్రాలు మరో అయిదు నిమిషాలదాకా తెరుచుకోవని బలరామ్‌కి తెలుసు! తన పనికి అయిదు నిమిషాలు చాలు...

తూలిపడబోతున్న ఆ వ్యక్తిని బలరామ్ తన బలమైన హస్తాల్తో ఆపాడు. సునాయాసంగా మోసుకెళ్ళి అతన్ని గోడవారగా వున్న కుర్చీలో భద్రంగా కూచోబెట్టాడు. అతని చేతుల్లోంచి క్రిందికి జారిన పువ్వుని అందుకుని జేబులో పడేసుకున్నాడు. పళ్ళెంలోంచి మరో పువ్వుని అందుకుని, అతని ఒళ్ళో పడేశాడు.

వెనక్కి తిరిగి, ధగ ధగ మెరుస్తోన్న వజ్రకిరీటాన్ని తృప్తిగా చూశాడు. హాలు మధ్యలో వెడల్పాటి టేబుల్ మీద పరిచిన ఎర్రటి వెల్వెట్ గుడ్డమీదున్న వజ్రకిరీటం అతన్ని ఆశతో నింపుతోంది. బలరామ్ జోరుగా నడిచాడు! ఇంకా ఆశ్చర్యం నుంచీ తేరుకోని

విశ్వకర్మారావు అతన్ని యాంత్రికంగా అనుసరించాడు. బలరామ్ ఆలస్యం చేయకుండా పనిలోకి విజృంభించాడు. వజ్రకిరీటాన్ని తీసి టేబుల్ మీద పక్కన పెట్టాడు. వెల్వెట్ గుడ్డమీద మెత్తటి పరుపులా వున్న రకరకాల పూలని అతని చెయ్యి చీపురులా ఒక వైపుకు తోసేసింది.

విశ్వకర్మారావు చేతుల్లోని పళ్ళెంలోంచి మైసూరు మల్లెల్ని తీసి కొత్త పరుపు తయారు చేశాడతను. మైసూరు మల్లెల గుట్టలోంచి ప్రత్యక్షమైన కిరీటం పై భాగాన్ని పట్టుకుని, ఇవతలకి లాగాడు. కొత్త పూల మధ్య దాన్ని జాగ్రత్తగా పెట్టాడు. పళ్ళెంలో మిగిలిన పూలని కిరీటం చుట్టూ పేర్చేశాడు. పక్క పక్కనే వున్న రెండు కిరీటాల్ని క్షణకాలం కళ్ళు చిట్లిస్తూ చూశాడు. అతని చూపులు విశ్వకర్మారావు వైపు తిరిగాయి.

విశ్వకర్మారావు హిప్నటైజ్ చేయబడిన వ్యక్తిలా, మాటలు మరచిపోయి కిరీటాల్ని తదేకంగా చూస్తున్నాడు. పైకి పొడుచుకొస్తున్న అతని కనుగుడ్లనీ, చెమటతో తడుస్తోన్న అతని నుదుర్నీ బలరామ్ చిరునవ్వుతో చూశాడు.

"ఇంతసేపు యిక్కడే వుంటే అసలుదేదో, నకిలీదేదో మనం పోల్చుకోలేం! కమాన్!" అన్నాడు తగ్గు స్వరంలో.

"అ....వు....ను...." విశ్వకర్మారావు కంఠం గుసగుసగా ధ్వనించింది.

అసలు కిరీటాన్ని పళ్ళెంలో పెట్టేసి, వాడిపోయిన పూలని దానిమీద గుట్టగా పోయసాగేడు బలరామ్. వణుకుతున్న తన చేతుల్ని అతిప్రయత్నంమీద కంట్రోల్ చేస్తున్నాడు విశ్వకర్మారావు.

"లెటస్ గో!" పని ముగించిన బలరామ్ అతన్ని హెచ్చరించాడు, "జాగ్రత్తగా నడు. తడబడి, బోర్లా పడితే కుండ పగిలి, అమృతం వొలికిపోతుంది!"

విశ్వకర్మారావు ఆరిపోతున్న పెదాల్ని తడుపుకుంటూ వెర్రిగా చూశాడు. చిరునవ్వుతో అతన్ని చూస్తూ, బలరామ్ అతని చేతుల్లోంచి పళ్ళేన్ని అందుకున్నాడు. కుర్చీలో కూచుని ఇంకా యోగనిద్రలో వున్న వ్యక్తిని ఓసారి చూసి గుమ్మంవేపు కదిలాడు.

వణికే చేతుల్తో విశ్వకర్మారావు గొళ్ళెం తీసి, తలుపు లాగాడు. గుమ్మం ముందున్న వ్యక్తుల్ని చిరునవ్వుతో చూస్తూ, చీకూచింతా లేకుండా బలరామ్ ముందుకి నడిచాడు. తలుపుని పూర్తిగా ముందుకి లాగి, విశ్వకర్మారావు అతన్ని వెంబడించాడు. బలరామ్ ధైర్యం, నిబ్బరం అతన్ని ఆశ్చర్యంతో, గౌరవభావంతో నింపుతున్నాయి....

• • •

విశ్వకర్మారావు ఆరిపోయిన పెదవుల్ని నాలుకతో తడుపుకున్నాడు. రెండంగుళాల గడ్డాన్ని వేళ్ళతో తడుపుకున్నాడు. తన దగ్గరగా వస్తున్న బలరామ్‌ని అయోమయంగా చూశాడు.

"బాస్....అతను....శిష్యుడు.....చచ్చిపోయాడా?" తడబడుతూ గుసగుసగా ప్రశ్నించాడతను.

విశ్వకర్మారావు స్వప్నచారిలా ఎందుకు ప్రవర్తిస్తున్నాడో అర్థమైన బలరామ్ చిన్నగా నవ్వాడు. సగర్వంగా అతని భుజంమీద తట్టాడు.

"కంగారుపడొద్దు. స్వామీజీ అభిమంత్రించి ఇచ్చిన మైసూరుమల్లె కొత్తపరిమళం అతన్ని తాత్కాలికంగా

సమాధిస్థితిలోకి తీసుకెళ్ళింది. అతనీపాటికి మేలుకుని, కోలుకొని వుంటాడు! లోపల్నుంచీ గొళ్ళెం పెట్టేసుకుని, కిరీటాన్ని రెప్పవేయకుండా చూస్తూ, గురువుగారి నామస్మరణలో మునిగిపోయి వుంటాడు...."

"కిందికి యెలా.... వెళ్తాం....? కిరీటం...." విశ్వకర్మారావు పూర్తిగా ప్రశ్నించకుండా ఆపాడు.

బలరామ్ తీక్షణంగా అతని కళ్ళలోకి చూశాడు. "ప్రశ్నలు వద్దు! యాభై నిమిషాల తర్వాత యేమీ ఎరగనివాడిలా, అటువేపుగా చుట్టు తిరిగి, రోడ్డు చేరుకో. టోల్ గేట్ గుండా వెళ్ళొద్దు!"

"అది... కిరీటం...." విశ్వకర్మారావు నసిగాడు.

"చెప్పింది చెయ్!" బలరామ్ కసిరి కదిలాడు....

## 8

పల్చటి తెల్లటిచీరా, పల్చటి తెల్లటి జాకెట్టూ ధరించిన కుంకుమ టెలిఫోన్ ఆఫీసువైపు నడిచింది. మెరుపు తీగలా చలాకీగా నడుస్తున్న ఆమెని కౌంటర్ వెనకున్న వ్యక్తి రెప్పవేయకుండా చూస్తున్నాడు. కౌంటరు ముందు జనం లేనందుకు ఆశ్చర్యపోతూ ఆమె అతనివైపు నవ్వుతూ చూసింది.

"ట్రిబుల్ ఫైవ్ డబుల్ త్రీ, నంబర్ కాల్, లోకల్" అందామె నిర్లక్ష్యంగా.

బలవంతంగా తన చూపుల్ని ఆమెమీంచి టెలిఫోన్ వైపు మళ్ళించి, నంబర్ని డయల్ చేశాడతను. మాట్లాడమన్నట్టు ఆమెవైపు చూస్తూ, బూత్ వైపు చేయి చూపించాడతను.

కుంకుమ బూత్ లోకి దూరింది. రిసీవర్ని పైకెత్తి బాబ్డ్ హెయిర్ని పక్కకి ఎగరేసుకుని, కౌంటర్ వ్యక్తి

వైపు అదోలా చూసింది. ఆమె సౌందర్యాన్ని కళ్ళతో తాగుతూ రిసీవర్ని పెట్టడం మరిచిపోయిన అతను, తెప్పరిల్లి రిసీవర్ని క్రెడిల్ మీద పడేశాడు. కుంకుమ అతని వైపు తః వీపుని తిప్పింది.

"హలో....ఎవరు?" అవతలి కంఠం బొంగురుగా అరుస్తోంది.

కుంకుమ తనెవరో చెప్పలేదు. "పొద్దుట డిస్ప్లే చేసినప్పటికన్నా స్వామీజీ ధరించాక కిరీటం ప్రత్యేకంగా, కళ్ళు చెదిరేలా మెరుస్తోంది!" అందామె చిన్నగా నవ్వుతూ.

"గుడ్.... వెరీగుడ్!" అవతలి కంఠం ఉషారుగా అంది.

"నేను చెప్పింది చెప్పినచోటికి పంపించారా?" కుంకుమ ప్రశ్నించింది.

"అది, అక్కడ అరగంటనుంచీ నీ కోసం యెదురు చూస్తోంది!" బొంగురు కంఠం ఉల్లాసంగా అంది. "వస్తున్నావా?"

"రైటవే!" కుంకుమ నవ్వుతూ అంది.

"కుంకుమా! వాళ్ళు....అతను సరుకుతో దిగేశాడా?" అవతలి కంఠం ఆత్రుతగా అడిగింది.

"డోంట్ టాక్ నాన్సెన్స్!" అంటూ కుంకుమ రిసీవర్ని పెట్టి, బూత్ లోంచి యివతలికి నడిచింది.

"మూడు రూపాయలు" అన్నాడు కౌంటరతను.

బిల్లు చెల్లించి కుంకుమ చకచకా యివతలికి నడిచింది. రసీదు తీసుకోకుండా వెళ్ళిపోతున్న ఆమెని చూస్తూ విగ్రహంలా కూచుండిపోయాడతను. ...

# 9

ఓపన్ ఆడిటోరియం ఫ్లోరసెంట్ ట్యూబుల్లో, రంగు రంగుల సీరియల్ సెట్ లైట్లతో వెలిగిపోతోంది. లక్షలాదిమంది వరుసలుగా కూచున్నారు. పిన్ను కింద పడేసే వినిపించేంత నిశ్శబ్దం అక్కడ తాండవిస్తోంది.

ఎదురుగా, ఎత్తుగా పువ్వుల పల్లకిలా వేదిక మెరిసిపోతోంది. ఎర్రటి సింహాసనం కళ్ళని పొడుస్తూ అవుపిస్తోంది. దానిమీద కృష్ణాజినం పరచబడి ఉంది. వెనుక వైపున్న మెట్లమ్మట పైకెక్కి, ఆశ్రమం మేనేజరు సౌజన్యమూర్తి వేదిక ముందుకి నడిచాడు. మైక్ ముందు ఆగి, అలలు లేని సముద్రంలా వున్న జనసముద్రాన్ని చిరునవ్వుతో తృప్తిగా కలయజూశాడు.

“జై గురుదేవ్! రెండు నిమిషాల్లో స్వామీజీ మనందరికీ తమ దర్శన భాగ్యాన్ని కరుణిస్తారు. తమ షష్ఠిపూర్తి సందర్భంగా, మొదటిసారిగా వజ్రకిరీటాన్ని ధరించి స్వామీజీ మనల్ని ఆశీర్వదిస్తారు! మౌనంగా నిలబడి స్వామీజీకి స్వాగతం చెప్పాలని విజ్ఞప్తి చేస్తున్నా!” సౌజన్యమూర్తి ఉత్సాహంతో అన్నాడు. వంద మెగాఫోన్లు అతని కంఠాన్ని అందరికీ చేరవేశాయి.

వెంటనే సముద్రంలో పెద్ద అల లేచినట్టయింది. లక్షలాది శరీరాలు ఒక్కటిగా లేచి నించున్నాయి. మెగాఫోన్లలోంచీ వేదమంత్రాలు వినిపించడం ప్రారంభించాయి. పూర్ణకుంభాలు పట్టుకున్న ముత్తైదువులు మెల్లగా వేదికమీదికి ఎక్కసాగారు. జనం రెప్పలు వేయడం మరిచిపోయి చూస్తోన్నారు. కాసేపట్లో ధగ ధగ మెరుస్తోన్న వజ్రకిరీటం అందరి దృష్టినీ ఆకర్షించింది. నెమ్మగా, ఠీవిగా అడుగులు వేస్తూ స్వామీ దశావతారానంద

వేదికమీద ప్రత్యక్షమయ్యాడు.

"జై గురుదేవ్!" సౌజన్యమూర్తి ఉద్రేకంతో మైక్‌లోకి అరిచాడు.

లక్షలాది కంఠాలు అతన్ని అనుసరించాయి. క్షణకాలం ఆకాశం దద్దరిల్లిపోయింది.

కాషాయ వస్త్రాల్లో ప్రత్యేకంగా అవుపిస్తున్న స్వామీజీ సింహాసనం ముందు ఆగి తన భక్తుల్ని చిరునవ్వుతో వీక్షించారు. ఎర్రటి పెదవుల మధ్యలోంచి ఆయన పళ్ళు ముత్యాల్లా మెరుస్తున్నాయి. ఎడమచేత్తో ఆయన పట్టుకున్న వెండి త్రిశూలం ధగధగ మెరుస్తోంది. కిరీటం కాంతితో నేజి మిరుమిట్లు గొలుపుతోంది.

దశావతారానంద స్వామీజీ చెయ్యెత్తి తన భక్తుల్ని దీవించారు. మరుక్షణం జయజయధ్వానాల్ని నిశ్శబ్దం మింగేసింది. స్వామీజీ సింహాసనంమీద ఆసీనులయ్యారు. అందరూ కూచున్నారు. సౌజన్యమూర్తి, పూర్ణకుంభాలు తెచ్చిన వాళ్ళూ వేదికమీంచి దిగేశారు. కాషాయ వస్త్రాలు ధరించిన యిద్దరు శిష్యులు పట్టుకుచ్చుల్లాంటి వింజామరలతో వీస్తూ, స్వామీజీకి యిరువైపులా నించున్నారు.

"ఓం నమశ్శివాయ! ఓం నమో నారాయణాయ!" ఉరుము ఉరిమినట్టు, గంభీరంగా ఉచ్చరించారు స్వామీజీ. తరువాత తమ గంభీరమైన కంఠంతో ఉపన్యాసం ప్రారంభించారు. వేదసూక్తాలూ, ఉపనిషద్వాక్యాలూ ఉదహరిస్తూ ఆయన అనర్గళంగా వేదాంతోపన్యాసం సాగిస్తున్నారు. వేదిక మూలగా వున్న మైకు ముందు చేతులు కట్టుకుని నిలబడ్డ కాషాయవస్త్రాల వ్యక్తి తెలుగులో సాగుతున్న స్వామివారి ఉపన్యాసాన్ని ధారా

ళంగా ఆంగ్లంలోకి తర్జుమా చేస్తున్నాడు....

శ్రోతల ముందువరుసలో స్వామీజీకి చాలా దగ్గరైన శిష్యులూ, అనుయాయులూ కూచున్నారు, ఐ.జి. ఆఫ్ పోలీస్, కలెక్టర్, నలుగురు ఎస్.పీలూ, వగైరా అధికారులు ప్రత్యేకంగా ఆహ్వానించబడ్డారు. కిరీటం తయారు చేసిన ధీరజ్ వల్ థోరా. అతని కుటుంబం, స్థానిక పెద్దలు రఘురామ్ రెడ్డి, జగన్నాథం, స్టేట్ బాంక్ మేనేజర్ సుబ్బారావు, కిలిమాంజిరో వజ్రాలగనుల యజమాని మిస్టర్ ఫాక్స్, అతని పార్టనర్ మిస్టర్ రాక్స్ వగైరాలు ముందు వరుసల్లో వున్నారు. ఒకపక్కగా ప్రెస్ గ్యాలరీలో డజనుమంది పత్రికా విలేఖరు లున్నారు.

మిస్టర్ ఫాక్స్ స్వామీజీ ఉపన్యాసం తర్జుమాని ఏకాగ్రతతో, తన్మయత్వంతో వింటున్నాడు. స్వామీజీ ధరించిన కిరీటానికి చక్కటి వజ్రాలు సప్లై చేసినందుకు అతని కెంతో ఆనందంగా వుంది. స్టేజిమీద స్వామీజీ తనని స్పెషల్ గా బ్లెస్ చేస్తారు....ఆలోచిస్తూ వింటూ, కిరీటాన్నే చూస్తున్న మిస్టర్ ఫాక్స్ కళ్ళెందుకో చెదిరి నట్టయ్యాయి. రెప్పలు టపటప లాడించి మళ్ళీ చూశా డతను. ఆదరాబాదరా కళ్ళద్దాలు తీసి, సిల్కు జేబు రుమాలుతో తుడిచి జాగ్రత్తగా చూశాడు. అతని గుండె వేగంగా కొట్టుకోవడం ప్రారంభించింది. నోరు పూర్తిగా తెరిచి, రెప్పల్ని చీల్చుకుంటూ కిరీటాన్ని ఏకాగ్రతతో చూడసాగేడు.

వోరగా అతన్ని గమనిస్తున్న అతని పార్టనర్ మిస్టర్ రాక్స్ తలని అతనివైపు వాల్చాడు. "ఈజ్ సంథింగ్ రాంగ్?" తగ్గుస్వరంతో ప్రశ్నించాడతను.

ఫాక్స్ అతనివైపు చూడలేదు. అతని పెదాలు అరి

పోతూ కదిలాయి. "యూ! సంథింగ్ ఈజ్ రాంగ్ విత్ ది గ్లిట్టరింగ్ ఆఫ్ ద క్రౌన్. రియల్ డైమండ్స్ నెవర్ గ్లిట్టర్ లైక్ దట్!"

"వాట్?" మిస్టర్ రాక్స్ గుసగుసగా అరిచాడు.

"అయాం అఫ్రైడ్...." మిస్టర్ ఫాక్స్ ఆపేసి, తన పార్ట్నర్ ముంజేతిని వేళ్ళతో పట్టుకున్నాడు. అతని వేళ్ళు చిన్నగా వణుకుతున్నాయి "రాక్స్, ఐ వాంట్ టూ హేవ్ క్లోజర్ లుక్!"

డైమండ్స్ విషయంలో ఆరితేరిన తన పార్ట్నర్ సందేహాన్ని కాదనలేని రాక్స్ మౌనంగా ఉండిపోయాడు. మిస్టర్ ఫాక్స్ వణుకుతున్న తన యెడమ చేతిని పక్కనే కూచున్న సౌజన్యమూర్తి భుజమ్మీద వేశాడు. తలని అతని దగ్గరగా వాల్చాడు.

"ఎమర్జెన్సీ! ఐ వాంట్ టూ టాక్ విత్ యూ. ఇన్ ప్రైవేట్!" అన్నాడతను ఉద్రేకంతో.

స్వామీజీ ఉపన్యాస ప్రవాహంలో మునుగుతూ, తేలుతూ కొట్టుకుపోతున్న సౌజన్యమూర్తి ఫాక్స్‌ని అర్థం కానట్టు చూశాడు. చెమటతో తడుస్తున్న ఫాక్స్ మొహం అతన్ని కంగారుతో నింపుతోంది. ఫాక్స్‌కి హార్ట్ ట్రబుల్ వుందా?

"మిస్టర్ ఫాక్స్. ఈజ్ సంథింగ్...."

"కమాన్! లెట్స్ గో సంవేర్!" ఫాక్స్ అరిచాడు, తగ్గుస్వరంలో.

తీరంలో ఈగలా అవుపిస్తున్న ఫాక్స్‌ని అయోమయంగా చూస్తూ సౌజన్యమూర్తి లేచాడు. అనుచరుడిని అక్కడే కూచోమ్మని సైగ చేస్తూ అతని భుజమ్మీద చేత్తో నొక్కుతూ ఫాక్స్ పైకిలేచాడు. ఇద్దరూ కొద్దిగా

కిందికి వొంగి గబగబా నడిచారు.

వేదిక దాటి, అటువైపుకి చేరుకున్నాక సౌజన్యమూర్తి ఆగి, ఫాక్స్‌వైపు చూశాడు. "మిస్టర్ ఫాక్స్."

"లెట్స్ గో ఇన్ టు ది ఆఫీస్‌రూం!" ఫాక్స్ కంఠంలో ఆగ్రహం ధ్వనించింది.

నిట్టూరుస్తూ సౌజన్యమూర్తి కదిలాడు. ఫాక్స్ అతన్ని వెంబడించాడు. ఇద్దరూ ఆఫీసు గదిలో ప్రవేశించారు. తలుపులు మూసి, ఫాక్స్ వాటికి వీపు ఆనించి నిలబడ్డాడు. జేబులోంచీ రుమాలుతీసి, మొహం తుడుచుకున్నాడు.

"మిస్టర్ ఫాక్స్, వల్ ఐ సమన్ ఎ డాక్టర్?" ఫాక్స్‌ని కంగారుగా చూస్తూ సౌజన్యమూర్తి అన్నాడు.

"మిస్టర్ సావ్‌జన్యామూర్‌తీ, అయాం అఫ్రైడ్ స్వామీజీ ఈజ్ వేరింగ్ ఎ డూప్లికేట్ క్రాస్ ...."

సౌజన్యమూర్తి నమ్మలేనట్టు చూశాడు. అతని కళ్ళు గిన్నెల్లా అయ్యాయి.

"ఏమిటీ? బొంగురుగా మాతృభాషలో అరిచాడతను.

"వాట్?" తెలుగు అర్థంకాని ఫాక్స్ అరిచాడు.

"ఆర్ .... యూ .... ఆర్ .... యూ .... సీరియస్?" సౌజన్యమూర్తి తడబడుతూ అన్నాడు.

"అయాం నాట్ జోకింగ్. అయాం పాజిటివ్!" ఫాక్స్ తీక్షణంగా అన్నాడు.

సౌజన్యమూర్తి తటాలున నేలమీద కూచుండిపోయాడు. అతని వొళ్ళంతా వశంతప్పి వణుకుతోంది. తెల్లగా పాలిపోయిన మొహాన్ని మెల్లిగా పైకెత్తి అయోమయంగా ఫాక్స్‌వైపు చూశాడు. ఫాక్స్ ఆదరాబాదరా అతని దగ్గరగా నడిచాడు. ముందుకు వంగి అతని

మొహంలోకి అదుర్దాతో చూశాడు.

"వెల్ ఐ సమన్ ది డాక్టర్?"

సౌజన్యమూర్తి అప్రయత్నంగా తలని అడ్డంగా ఆడించాడు. టేబుల్ మీదున్న గాజుకూజావైపు వణుకుతున్న చెయ్యి చూపించాడు. ఫాక్స్ గబగబా నడిచి, గ్లాసుని నీళ్ళతోనింపి సౌజన్యమూర్తికి అందించాడు. గడగడా నీళ్ళు తాగేసి, అతను వెర్రివాడిలా చూశాడు.

"ఏం చేద్దాం?"

"వాట్?" ఫాక్స్ విసుగ్గా అడిగాడు.

సౌజన్యమూర్తి తన ప్రశ్నని ఆంగ్లంలోకి తర్జుమా చేశాడు.

"ఫస్టు లెట్స్ బీ స్టెడీ. లెట్ మీ హావ్ ఎ క్లోజర్ లుక్!" ఫాక్స్ ఆవేశంతో అన్నాడు. అతని చెయ్యి జేబులో వున్న లెన్స్‌ని తడివింది.

మెల్లిగా తనని అదుపులో పెట్టుకుంటూ సౌజన్యమూర్తి లేచాడు. "రండి. సింహాసనం వెనకనుంచీ చూద్దురుగానీ...." అన్నాడు ఆంగ్లంలో.

అయిదునిమిషాల తర్వాత ఇద్దరూ గదిలోకి తిరిగొచ్చారు. ఫాక్స్ టేబుల్ ముందున్న కుర్చీలో కూచున్నాడు. కోటు లోపలి జేబులోంచీ జాన్ ప్లేయర్స్ స్పెషల్ సిగరెట్ తీసి, వెలిగించాడు. ఆశ్రమం వున్న జ్ఞానపర్వతంమీద స్మోక్ చేయకూడదన్న నియమాన్ని అతను పూర్తిగా మరిచిపోయాడు. సౌజన్యమూర్తి మనసు ఇప్పుడు నియమాలమీద లేదు.

"వాట్ డూ యూ సే?" మౌనంగా కూచున్న ఫాక్స్‌ని ఆత్రుతతో ప్రశ్నించాడతను.

"డైమండ్స్ ఆర్ ఫేక్! అండ్ ఐ థింగ్ గోల్డు

ఈజ్ నాట్ గోల్డు!" ఫాక్స్ గొణుక్కున్నట్టుగా అన్నాడు.

సౌజన్యమూర్తి బలహీనంగా కుర్చీలో కూలబడ్డాడు. మాటలు మరిచిపోయినవాడిలా వెర్రిగా ఫాక్స్ ముఖం లోకి చూశాడు.

"ఇన్ ది లాండ్ ఆఫ్ వేదాస్....ఐ నెవర్ థాట్!" ఫాక్స్ ఉద్రేకంతో అన్నాడు. విగ్రహంలా కూచున్న సౌజన్యమూర్తిని తదేకంగా చూశాడు. "డోంట్ సిట్ దేర్ మెడిటేటింగ్! డూ సంథింగ్!"

"అయాం థింకింగ్!" సౌజన్యమూర్తి బొంగురు కంఠంతో అన్నాడు.

"డోంట్ థింక్, యాక్టు!" ఫాక్స్ ఆవేశంతో అరిచాడు.

సౌజన్యమూర్తి తటాలున లేచాడు. గదిలోంచీ జోరుగా ఆవతలికి నడిచాడు. అతని వెనకే తలుపు మూసుకుపోయింది.

సిగరెట్ దమ్ములాగుతూ ఫాక్స్ యెదురుగా గోడకి వేళ్ళాడుతున్న దశావతారానంద స్వామీజీ కలర్ ఫోటోని తదేకంగా చూశాడు.

"ఇన్ ది లాండ్ ఆఫ్ వేదాస్!" అప్రయత్నంగా తనలో తానే గొణుక్కున్నాడతను.

  

ఐ.జి. ఆఫ్ పోలీస్ రామలింగం గది మధ్యలో ధ్వజస్తంభంలా నిలబడ్డాడు. ఆయన మొహం గంభీరంగా వుంది. ఆయనకి ఇరువైపులా నలుగురు ఎస్.పి.లు ఆటెన్షన్‌లో నిలబడ్డారు. మిస్టర్ ఫాక్స్, మిస్టర్ రాక్స్ డమ్మీల్లా నిలబడ్డారు. సౌజన్యమూర్తి ఆవేశంతో

అంతా వివరించాడు. ఏదో చేసి, వజ్రకిరీటాన్ని దక్కించ మన్నాడు.

"మిస్టర్ ఐజీ, యూ మస్ట్ అర్రెస్ట్ క్రూక్ అండ్ శాచ్ ది శల్ ప్రిట్!" ఫాక్స్ ఆవేశంతో అరిచాడు.

ఐ.జీ. రామలింగం తలపంకించాడు. తన పక్కనే నించున్న ఎస్.పీలను కలయజూశాడు. "మిస్టర్ దయానిధీ, మిస్టర్ వాసుదేవ్, టోల్ గేట్ దగ్గర బందోబస్తు యేర్పాటు చేయండి. ఈ క్షణంనుంచీ యెవ్వరూ, యెలాంటి వాహనంమీద కానీ, కాలినడకనగానీ వెళ్ళ కూడదు. లాగేజీవున్నా, లేకపోయినా సరే!" ఐ. జీ. కంఠంలో అధికారం ఖంగుమంది.

"యస్సర్!" ఎస్.పీలు ఇద్దరూ ఒకేసారి అన్నారు.

"ఈ విషయాన్ని అతిరహస్యంగా వుంచండి. మన సిబ్బందికి తప్ప, ఎవ్వరికీ చెప్పకండి. కొండదిగడానికి ప్రయత్నించిన వ్యక్తుల్ని, వ్యక్తిని—ఎవరైనా సరే—అదుపులోకి తీసుకొని, టెంపుల్ పక్కనున్న గెస్టు హౌస్ కి తీసుకురావాలి!" ఐ.జీ. మళ్ళా హెచ్చరించాడు.

సెల్యూట్ చేసి, ఇద్దరు ఎస్.పి.లు వెళ్ళిపోయారు.

ఐ.జీ. రామలింగం తతిమ్మా ఇద్దరు ఎస్.పి.ల వేపు తిరిగారు. "ఉపన్యాసం ఇంకో గంటదాకా సాగుతుందనుకుంటాను. ఆతరవాత భజనలూ, ఆ తరవాత భోజనాలూ—అన్నీ ముగిసేసరికి రెండు మూడు గంటలు పట్టొచ్చు. ఎందుకేనా మంచిది, రెండున్నర గంటలు మనకి వ్యవధి వుంది. ఆ వ్యవధిలో పర్వతంమీదికి వచ్చిన ప్రతి వ్యక్తి లగేజీనీ మనం గాలించాలి. సెర్చ్ ఎవ్విరిథింగ్! సెర్చ్ ఎవ్విరీవేర్!"

"యస్సర్!" రెండు కంఠాలు యుగళగీతం

పాడాయి.

"వాటీస్ ది నంబర్ ఆఫ్ అదర్ మెన్?" ఐ.జీ. ప్రశ్నించాడు.

"అరౌండ్ టూ థౌజండ్ సర్!" ఎస్. పి. కార్తికేయ జవాబిచ్చాడు.

"గుడ్. ఆడిటోరియంలోని జనంచుట్టూ వందమందిని ఆటి పెట్టండి. ఆడిటోరియంనుంచీ డైనింగ్ హాల్కి వెళ్ళడానికి ఒకేవొక ఔట్ లెట్ వదలండి. వెళ్ళే వాళ్ళందర్నీ చెక్ చేస్తూ చూడాలి. ఎవర్నీ ప్రశ్నించ కండి. నోళ్ళు ఉపయోగించకండి. కళ్ళు మాత్రం ఉపయో గించండి!"

"యస్సర్!"

"ఒన్ మోర్ థింగ్. ఆశ్రమం ప్రాపర్టీనికూడా చెక్ చేయండి. కిచెన్, స్టోర్ రూం. బియ్యంబస్తాలు, పప్పు బస్తాలు. వాటర్ టాంక్స్ దగ్గరా...."

"ఐజీగారూ....చిన్న మనవి...." సౌజన్యమూర్తి అడుక్కిగిలాడు.

ఐజీ రామలింగం అతన్ని ప్రశ్నార్థకంగా చూశాడు.

"జ్ఞానపర్వతంమీద ఏది జరిగినా స్వామీజీ అను మతితో జరగాలి. ఆయనకి తెలీకుండా ఏమీ చేయలేం."

ఐజీ అతన్ని కళ్ళు చిట్లిస్తూ చూశాడు. "స్వామీజీ ఉపన్యాసంలో ఉన్నారనుకుంటా...."

"ఉన్నా ఫరలేదు. వారి అనుమతి అత్యవసరం. పైగా స్వామీజీ దివ్యదృష్టితో అంతా కనుక్కోగల రని...."

ఐ.జీ. రామలింగం బలవంతాన చిరునవ్వుని ఆపు కున్నాడు. "అలా జరిగితే మరీ మంచిది. అంజనం వేసి

ఆయన అసలు కిరీటాన్ని కనిపెట్టగలిగితే మా అందరికీ యెంతో యాతన తప్పుతుంది! వెళ్ళండి. ఆయన అనుమతి తీసుకోండి. ఎందుకైనా మంచిది; ఉపన్యాసాన్ని మరో గంట పొడిగించమని అడగండి. మనకి వ్యవధి కావాలి."

సౌజన్యమూర్తి కదిలొంచీ గబగబా వెళ్ళిపోయాడు. వెళ్ళడమా వొద్దా అని ఇద్దరు ఎస్.పీలూ సందేహిస్తూ నించున్నాడు.

"అసలు కిరీటం స్థానంలో నకిలీ కిరీటం చేరింది. దాన్నిబట్టి ఇదంతా ప్రీప్లాన్‌డ్‌గా జరిగిందనీ, అసలు కిరీటంలాగే, ముందుగా నకిలీ తయారు చేయబడిందనీ అర్థమవుతోంది...." ఐ.జీ. సాలోచనగా అన్నాడు.

"యెస్సర్...." ఎస్. పి. కార్తికేయ అన్నాడు!

"అసలు కిరీటం కొలతలూ, బరువూ వగైరా వివరాలన్నీ కంఠాపాఠంగా తెలిసిన వ్యక్తి యెవడో ఇది చేసి వుండాలనిపిస్తోంది. ఆలోచిస్తోంటే ఇది 'ఇంటి దొంగ' పనే అనిపిస్తోంది!" ఐ.జీ. మెల్లిగా అన్నాడు.

"యూ హావ్ ఏ పాయింట్ దేర్, సర్!" ఎస్.పి. రంగరాజు అన్నాడు.

ఐ.జీ. తలపంకిస్తూ వెళ్ళి కుర్చీలో కూచున్నాడు. మిష్టర్ ఫాక్స్ అతని దగ్గరగా జరిగాడు. ఫాక్స్ అతని నీడలా కదిలాడు.

"మిష్టర్ ఐ.జీ. మోర్ దెన్ టూ థౌజండ్ పోలీస్ ఆర్ దేర్. యెట్ దిస్ హాపెన్! ఐ కాంట్ బిలీవ్. ఐ సేట్ దట్ యువర్ డిపార్టుమెంట్ షుడ్ బీ మోర్ కాషస్!"

ఐ.జీ. అతన్ని సూటిగా చూశాడు. "హూ సెడ్ ఉయ్ ఆర్ నాట్ కాషస్?"

ఫాక్స్ పెదవులు బిగించి, ఐ.జీ. మొహంలోకి

చూశాడు. "ఫేక్ క్రాస్ సేస్. యూ ఆర్ నాట్ మచ్ కేర్ ఫుల్!"

"మిష్టర్ ఫాక్స్, యూ షుడ్ నో బెటర్! ఉయ్ ఆర్ డూయింగ్ అవర్ బెస్ట్."

"యూ ఆర్ డూయింగ్ రొటీన్ బిజినస్! యూ ఆర్ డూయింగ్ నథింగ్ స్పెషల్!" ఫాక్స్ ఆవేశంతో అరిచాడు. అతని మొహం కందగడ్డలా అయింది.

ఐ.జీ. రామలింగం మెల్లిగా కుర్చీలోంచి లేచాడు. ఫాక్స్ కళ్ళల్లోకి తీక్షణంగా చూశాడు. "మిష్టర్ ఫాక్స్, హోల్డుయువర్ టంగ్! యూ ఆర్ మేకింగ్ మచ్ నాయిస్!"

ఫాక్స్ గుడ్లురుముతూ యేదో చెప్పబోయాడు. తలుపు తెరుచుకొంది. సౌజన్యమూర్తి ఆదరాదరా లోపలకి దూరాడు.

"స్వామివారికి అంతా విన్నవించాను. మన ప్రయత్నాల్లో మనం వుండటానికి ఆయన అనుమతించారు...." అన్నాడతను.

"మిస్టర్ సౌజన్యమూర్తీ! మిస్టర్ ఫాక్స్ని తీసుకెళ్ళి ఆడిటోరియంలో కుర్చీకి అతికించండి. ఆయన మరీ ఆవేశపడుతున్నారు!" ఐ.జి. నవ్వుతూ అన్నాడు.

"ఐహావ్ డొనేటడ్ ఎ ఫార్చ్యూన్ ఇన్ డైమండ్స్! ఇన్ ది లాండ్ ఆఫ్ వేదాస్...."

"మిస్టర్ ఫాక్స్, రిలాక్స్!" అంటూ సౌజన్యమూర్తి ఐ.జి.ని చూశాడు.

"ఫాక్స్గారు కోటిరూపాయలకు పైగా విలువైన వజ్రాలిచ్చారు. ఆయన ఆవేశపడకుండా, కంగారుపడకుండా వుండలేరు...."

"కోటిరూపాయల వజ్రాలు యిద్యకపోయినా మేమూ అతనిలాగే కంగారు పడుతున్నాం, మిస్టర్ మూర్తీ!" ఐ.జి. గంభీరంగా అన్నాడు. తల తిప్పి ఎస్.పి. రంగ రాజువైపు చూశాడు.

"ఇందాకా నేను చెప్పిందంతా చేయండి. గార్డెన్‌లో చెట్ల కిందా మీదా, పొదలకిందా, రాళ్ళకిందా, కొత్తగా తవ్విన మట్టికిందా—అన్నిచోట్లా వెతకండి! ప్రెస్ గ్యాలరీలో ప్రభంజనం వున్నాడు. అతన్ని యిక్కడికి పంపండి. అర గంటలో నేను గెస్టుహౌస్ చేరుకుంటాను. ప్రతీ అయిదునిమిషాలకీ నాకు రిపోర్టు చేస్తూవుండండి!"

"యస్సర్!" అంటూ రంగరాజూ, కార్తికేయ వెళ్ళిపోయారు.

• • •

"కమిన్ ప్రభంజనం...." గదిలోకి వస్తున్న ప్రభంజనంని ఐజి ఆహ్వానించాడు.

అతని దగ్గరగా ఆగి ప్రభంజనం ప్రశ్నార్థంగా చూశాడు. ఐజి అతన్ని కూచోమన్నాడు.

ఐజి రామలింగం చెప్పినదంతా ప్రభంజనం ఆశ్చర్యంతో విన్నాడు.

"పొద్దుట చూసిన కిరీటం, ప్రస్తుతం స్వామీజీ ధరించిన కిరీటం రెండూ ఒక్కలాగే వున్నాయి! ఉన్నట్టుండి మధ్యలో స్వామీజీ ఉపన్యాసం సబ్జెక్టు మార్చేశారు. ఆయనిప్పుడు దొంగతనం ఎంత పాపమో అన్న అంశం గురించి మాట్లాడుతున్నారు! ఎందుకో అనుకున్నాను. ఇందుకే అని ఇప్పుడు అర్థమవుతోంది!" ప్రభంజనం నవ్వుతూ అన్నాడు.

ఐజి చిన్నగా నవ్వాడు. సౌజన్యమూర్తి వాళ్ళ దగ్గ

రగా కదిలాడు.

"స్వామివారు శాంతికాములు. సత్యసంధులు. చౌర్యం గురించి ఉపన్యసించి, కిరీటాన్ని తస్కరించిన వ్యక్తి మనసు మార్చే ప్రయత్నం తాము చేయబోతున్నట్టు ఆయన నాతో అన్నారు. ఉపన్యాసం పూర్తయ్యేలోగా కిరీటం మన ముందు ప్రత్యక్షమైనా మనం ఆశ్చర్యపోనక్కర్లేదు!" అతని కంఠం ఆవేశంతో వణికింది.

ఐజి రామలింగం, ప్రభంజనం మౌనంగా ఒకరొకర్నొకరు చూసుకున్నారు.

"ప్రభంజనం, యేం చేద్దాం....?" ఐజి ప్రశ్నించాడు.

"మిస్టర్ పర్‌బంజనమ్...." ఫాక్స్ ప్రారంభించాడు. సౌజన్యమూర్తి అతని భుజమ్మీద చెయ్యివేసి, వారించాడు. ఐజి ఫాక్స్‌వైపు ఒకసారి విసుగ్గా చూసి, చూపుల్ని ప్రభంజనం వేపు ప్రశ్నార్థకంగా తిప్పాడు.

ప్రభంజనం మాట్లాడకుండా బల్లమీదున్న టెలిఫోన్ని దగ్గరగా లాగాడు. సాలోచనగా కాసేపు డయల్ టోన్ విని, ఒక నెంబర్ని డయల్ చేశాడు.

"డిటెక్టివ్ టెంపో" అటువైపు కంఠం పలికింది.

"నమస్తే. గురూజీ, ప్రభంజనం...."

"ఆర్ యూ గోయింగ్ టూ రిపోర్ట్ ఎనీ క్రైమ్, క్రైమ్ రిపోర్టర్?" టెంపో నవ్వుతూ ప్రశ్నించాడు,

ప్రభంజనం చిన్నగా నవ్వాడు. "దాదాపుగా! మీరు వెంటనే యిక్కడికి — జ్ఞానపర్వతంమీదికి దూసుకు రావాలి!"

"ఏమిటి కథ? హత్యా?" టెంపో నవ్వుతూ అడిగాడు.

"కాదు...."

"మరేమిటి? స్వామీజీ గదిలో గిట్టనివాళ్ళెవళ్ళేనా ఏ బాంబో పెట్టారా?"

"అలాంటిదేం కాదు. ఘోరం జరిగిపోయింది. మీరు త్వరగా రావాలి...."

"ప్రభంజనం. స్వామీజీ వజ్రకిరీటాన్ని యెవరేనా కాజేశారా?...." టెంపో నవ్వుతూ అడిగాడు.

"గుడ్ గాడ్! మీకెలా తెలుసు?" ప్రభంజనం ఆశ్చర్యంగా అరిచాడు.

"పైవి రెండూ కానప్పుడు, ఇక మిగిలింది ఒక్కటే: దొంగతనం! జ్ఞానపర్వతంమీద ఇవాళా రేపూ దొంగిలించబడటానికి కిరీటాన్ని మించిన వస్తువు మరొకటి లేదు! కరెక్టా?"

"అవులించకముందే పేగులు లెక్కెట్టేశారు!.... వెంటనే రండి!....ఐ. జి. గారు కూడా యిక్కడే వున్నారు."

"అరగంటలో అక్కడుంటాను; యే యాక్సిడెంటూ అడ్డు తగలకపోతే!" టెంపో నవ్వుతూ అన్నాడు.

ఫోన్ పెట్టేసి ప్రభంజనం ఐ.జి. వైపు చిరునవ్వుతో చూశాడు. "డిటెక్టివ్ టెంపో అరగంటలో ఇక్కడుంటారు...." అన్నాడు క్లుప్తంగా.

"గుడ్!" ఐ.జీ. తృప్తిగా అన్నాడు. "నేరదృక్పథం గురించి ఆ రోజా సౌజన్యమూర్తిని వేపుకుతిన్నావ్! ఇప్పుడు నీక్కావాల్సిన మేత దొరికిందా?"

ప్రభంజనం చిరునవ్వు నవ్వాడు. "అందరికీ కావాల్సిన వజ్రకిరీటం దొరకాలి!"

"యస్! రైమండ్ క్రాస్!" ఫాక్స్ ఉద్రేకంతో అన్నాడు.

ఐ.జి. రామలింగం అతన్ని వోరగా చూస్తూ, జేబు లోంచి సిగరెట్ తీశాడు....

"మిస్టర్ మూర్తి! గెస్టుహౌస్‌కి వెళ్దాం...." అంటూ లేచాడతను.

# 10

డిటెక్టివ్ టెంపో కాఫీకప్పు కిందపెట్టి, సిగరెట్ వెలిగించాడు. ఐ జి. రామలింగం, ప్రభంజనం, సౌజన్య మూర్తి, ఫాక్స్, రాక్స్. స్వామీజీ పి.ఏ. మంగళం పచార్లు చేస్తున్న డిటెక్టివ్ టెంపోని ఆశగా చూస్తున్నారు. టెంపో తటాలున, ఆగి సౌజన్యమూర్తివైపు చూశాడు.

"సౌజన్యమూర్తిగారూ, కిరీటాన్ని యెప్పట్నుంచి యెప్పటి దాకా అందరూ చూడ్డానికి హాల్లో వుంచారు?...."

పొద్దుట ఆరుగంటల నుండీ సాయంత్రం ఆరింటిదాకా. మధ్యాహ్నం భోజనాలప్పుడు, పన్నెండు నుండీ మూడు దాకా ఆ హాలుని మూసేశాం...." సౌజన్యమూర్తి జవాబిచ్చాడు.

"కిరీటం యిక్కడికి యెప్పుడు తీసుకురాబడింది?"

"నిన్న సాయంత్రం. బ్యాంకునుంచీ ఫుల్ సెక్యూరిటితో కిరీటం ఇక్కడికి చేరింది. రాత్రి ఆశ్రమం స్ట్రాంగ్ రూమ్‌లో వుంది...."

"డిస్‌ప్లే చేసింది అసలు కిరీటమే అని మనం అనుకోవచ్చు. నకిలీదై వుంటే మిస్టర్ ఫాక్స్ అప్పుడే పోల్చేవారు!" టెంపో నవ్వుతూ అన్నాడు.

తన పేరు వినబడేసరికి ఫాక్స్ తలని పాము పడగలా యెత్తాడు. సౌజన్యమూర్తిని ప్రశ్నార్థకంగా చూశాడు. అతను టెంపో మాటని తర్జుమా చేశాడు. ఫాక్స్ తల ఆవేశంతో వూగింది.

"యస్! యూ ఆర్ రైట్!" టెంపోవైపు చూస్తూ సగర్వంగా అన్నాడతను.

"మిస్టర్ ఫాక్స్, సాయంత్రం హాల్లో కిరీటాన్ని మీరు చూశారా?" టెంపో ఇంగ్లీషులో అడిగాడు.

"అన్ ఫార్చ్యునేట్లీ, నో! ఇఫ్ ...." ఫాక్స్ ప్రారంభించాడు.

"సాయంత్రం మిస్టర్ ఫాక్స్ చూసివుంటే, కిరీటం నకిలీదని ఆయన అప్పుడే పోల్చేసుకు నేవారు! అంటే, నా అంచనా ప్రకారం లంచ్ బ్రేకులో కిరీటం మార్చబడి వుండాలి ..." టెంపో సాలోచనగా అన్నాడు.

"ఔను. ఆ విషయం నేనూ, ప్రభంజనం ఇందాకా ఆలోచించాం. జనం చూస్తూన్నప్పుడు ఎవరూ కిరీటాన్ని మార్చలేరు!" ఐ. జి. కల్పించుకుంటూ అన్నాడు.

డిటెక్టివ్ టెంపో తలపంకిస్తూ సౌజన్యమూర్తిని చూశాడు. "మూర్తిగారూ, లంచ్ బ్రేకులో కిరీటందగ్గర గట్టి కాపలా ఏర్పాటు చేశారా?"

"హాలు తలుపుల్ని లోపల్నుంచి బిగించి, మంగళం గారు కాపలా వుండిపోయారు. బైట, తలుపు ముందు వేదానందా, శాంతానందా కదలకుండా కాపలా వున్నారు...."

"వాళ్ళిద్దర్నీ పిలిపించండి" టెంపో సాలోచనగా అన్నాడు. సౌజన్యమూర్తి యివతలికి వెళ్ళాడు.

"మిస్టర్ మంగళం! మధ్యాహ్నం ఎవరైనా హాల్లోకి వచ్చారా?" టెంపో ప్రశ్నించాడు.

"ఎవ్వరూ రాలేదు" మంగళం జవాబిచ్చాడు.

"బ్రేక్ అవర్స్‌లో అనుక్షణం మీరు అక్కడే వున్నారా?" టెంపో ప్రశ్నించాడు.

"కుర్చీలోంచి కదల్లేదు. కిరీటంమీంచి చూపుల్ని తిప్పుకోలేదు!" మంగళం నవ్వుతూ జవాబిచ్చాడు.

"స్వామీజీ ధరించే ముందు కిరీటాన్ని ఎవరు తీసుకెళ్ళారు?" టెంపో ప్రశ్నించాడు.

"సౌజన్యమూర్తిగారూ, నేనూ, అరడజనుమంది ప్రథమశిష్యులూ, ఫాక్స్‌గారూ, రాక్స్‌గారూ, ఐ.జి. గారూ, సుబ్బారావు—బాంక్ మేనేజరు—గారూ వున్నారు."

"మిస్టర్ ఫాక్స్, హౌ యూ అబ్జర్వ్‌డ్ ది క్రౌన్ డన్?" టెంపో ఫాక్స్‌ని ప్రశ్నించాడు.

"అయామ్ సారీ.... స్వామీజీ వాజ్ లుకింగ్ ఇన్‌టూ మై ఐస్. ఐ వాజ్ ఎన్‌థ్రాల్డ్.... ఐ...."

"ఓ.కే. నెవర్ మైండ్!" అంటూ ఐ.జి. వైపు చూశాడు.

"ఐజీగారూ, లంచ్ బ్రేకులోనో, స్వామీజీ ధరించే ముందో కిరీటం మార్చబడి వుండాలి...." అంటూ మంగళంవైపు తిరిగాడు. "మిస్టర్ మంగళం, బాగా గుర్తు చేసుకోండి: మీరు కాపలా కాస్తున్నప్పుడు హాల్లోకి ఎవ్వరూ రాలేదా?"

"నో! ఎవ్వరూ, ఎవ్వరూ రాలేదు!" మంగళం ఉద్రేకంతో అన్నాడు.

టెంపో అతని దగ్గరగా నడిచాడు. అతని ముఖం

లోకి తదేకంగా చూశాడు. "మిస్టర్ మంగళం, అయితే కిరీటాన్ని మీరే మార్చివుండాలి!"

మంగళం దెబ్బతిన్నట్టు చూశాడు. "టెంపోగారూ! పదిహేనేళ్ళుగా స్వామివారి సేవలో వున్న నన్ను మీరు అవమానిస్తున్నారు! నేను ఆ పాడు పని చేయలేదు; చేయలేను!"

"అయితే మరెవరు చేశారు? వాళ్ళెవరో, వాళ్ళని, లేదా ఆ వ్యక్తిని మీరు చూసివుండాలి! ఎవరు చెప్పండి! భయపడకండి!" టెంపో గంభీరంగా అన్నాడు.

మంగళం దిక్కుతోచనివాడిలా చూశాడు. అందరూ టెంపోనీ, అతన్నీ ఆశ్చర్యంగా చూస్తోన్నారు. తలుపు తోసుకొని సౌజన్యమూర్తి ప్రవేశించాడు. అతని వెనుకే యిద్దరు వ్యక్తులు కాషాయవస్త్రాల్లో వచ్చారు.

"వీళ్ళే!" అన్నాడతను టెంపోవైపు చూస్తూ. టెంపో వాళ్ళని ప్రశ్నించాడు.

"రెండు గంటల ప్రాంతంలో యిద్దరు వ్యక్తులు పళ్ళెం నిండా మైసూరుమల్లెలు తీసుకువచ్చారు. బెంగుళూరు నుండి స్వామివారి శిష్యులు నంజుండప్పగారు విమానంలో ఆ పూలని పంపారనీ, వాటిని కిరీటంకింద వుంచమని స్వామివారు ఆదేశించారనీ అన్నారు. నేను తలుపు తట్టాను. మంగళంగారు తలుపు తెరిచారు. విషయం ఆయనకి చెప్పాను. ఆయన వాళ్ళని లోపలికి తీసుకెళ్ళారు...."

"నో! ఇది అన్యాయం!" మంగళం కంగారుగా అరిచాడు.

డిటెక్టివ్ టెంపో తటాలున అతనివైపు తిరిగాడు. ఐ.జి. రామలింగం వాళ్ళదగ్గరగా నడిచాడు. మంగళం

మొహం తెల్లగా పాలిపోయింది. కళ్ళు ఎరుపెక్కాయి. అతని పెదవులు వణుకుతున్నాయి. టెంపో శిష్యులవైపు తిరిగాడు.

"తరువాత ఏం జరిగింది?"

"అయిదు నిమిషాలలోగా వాళ్ళిద్దరూ ఇవతలికి వచ్చారు. వాడిపోయిన పూలతో నిండిన పళ్ళేన్ని మోసుకుంటూ వెళ్ళిపోయారు వాళ్ళల్లో ఒక వ్యక్తి తలుపుని ముందుకి లాగాడు. మంగళంగారు గొళ్ళెం పెట్టుకుంటారని కాసేపు చూశాం. గొళ్ళెం చప్పుడు కాలేదు. నేను తలుపు కొద్దిగా తోసి, ఆయన్ని పిలిచాను. వెంటనే ఆయన వచ్చారు. తలుపుని గొళ్ళెం పెట్టేసుకున్నారు. అంతే!" అన్నాడు సన్నగా వున్న వేదానంద.

"ఇది కూడా అబద్ధమే!" మంగళం అరిచాడు.

టెంపో అతనివైపు తిరగలేదు. "వాళ్ళిద్దరూ మీకు పరిచయమున్న వ్యక్తులేనా?"

"పరిచయంలేదు. రెండ్రోజులుగా ఎన్నో వేలమంది వాలంటీర్స్నీ. స్వామివారి భక్తుల్నీ చూస్తున్నాం. వాళ్ళల్లో వీళ్ళెవరో! పూలు తీసుకుని బెంగుళూర్నించీ వచ్చారేమోనని అనుకున్నాం .... ...." వేదానంద అన్నాడు.

"వాళ్ళెలా వున్నారు?" టెంపో ప్రశ్నించాడు.

"ఒకతను లావుగా పొడుగ్గా, బలంగా వున్నాడు. రెండోతను సన్నగా పొడుగ్గా, నాలా వున్నాడు. యిద్దరికీ గడ్డాలు కొద్దిగా పెరిగి వున్నాయి" వేదానంద వివరించాడు.

"మిస్టర్ సౌజన్యమూర్తి, మీ మంగళం అబద్ధాలాడుతున్నాడు! మా పద్ధతుల్లో అతన్ని ప్రశ్నిస్తాం" ఐ.జి.

గంభీరంగా అన్నాడు.

"ఐసీమో మెంట్ సార్!" టెంపో ఐ.జి.ని వారించాడు. "మంగళంగారు నిజమే చెప్తున్నారని అనలేక పోయినా, ఆయన "అర్ధాలాడ్డం లేదలి నేను అనుకుంటున్నాను....

ఐ.జి. అర్ధంకానట్టు చూశాడు. టెంపో చిరునవ్వు నవ్వాడు.

"మంగళంగారు తప్పు చేసేవుంటే, ఎవరో వచ్చివెళ్ళారని అబద్ధం — ఆయన దృష్టిలో — ఆడివుండేవారు. అనుమానాన్ని తనమీదికే మళ్ళించుకునేవారు కారు. ఏది జరిగినా, ఆయనకి తెలీకుండా జరిగింది!"

"వాట్? హౌ?" ఐ.జి. ఆశ్చర్యాన్ని దాచుకోకుండా అన్నాడు.

"చూసిందీ, చేసిందీ ఆయన మరిచిపోయారు...."

"ఎందుకు?" ఐ.జి. అడ్డు తగిలాడు.

"ఆయనమీద ప్రత్యేకమైన మత్తుమందు మెలు జోన్‌లో ప్రయోగించబడిందని నా అనుమానం. అలాంటి మత్తుమందు ప్రయోగం జరిగితే, ఆ క్షణం ముందు చూసిందాన్నీ చేసిందాన్నీ మీరు మరిచిపోతారు. మత్తు విడిపోయాక, మామూలుగా వుండిపోతారు. మత్తు సృష్టించిన టైమ్ గాప్ మీకు తెలీదు...."

"ఐసీ...." ఐ.జి. సాలోచనగా అన్నాడు.

" 'స్వామీజీ ఈ పుష్పాన్ని తమకి ఆశీర్వాదపూర్వకంగా అనుగ్రహించారు!' అని ఆ వ్యక్తి మంగళంగారితో అంటున్న మాటలు గుమ్మం ముందు నిలబడ్డ మాకు స్పష్టంగా వినిపించాయి!" అంతసేపూ మౌనంగా వున్న శాంతానంద మెరిసే కళ్ళతో అన్నాడు.

డిటెక్టివ్ టెంపో ఐ.జి.వైపు నవ్వుతూ చూశాడు. "నో, మైసూరుమల్లె ద్వారా మంగళంగారికి మత్తుమందు ప్రయోగించబడింది! మన ప్రాంతంలో దొరకని మైసూరు మల్లె వాసనలో తేడాని ఆయన గుర్తించలేక పోయారు!"

"టెంపోగారూ! మీ వాదన తార్కికంగా వుంది. ప్రొసీడ్!" అన్నాడు ప్రభంజనం.

"కుర్చీ కాళ్ళదగ్గర పడున్న ఈ పుష్పాన్ని నేను జేబులో పడేసుకున్నాను...." అంటూ మంగళం జుబ్బా జేబులోంచి మైసూరుమల్లెను తీసి టెంపోకి అందించాడు.

టెంపో దాన్ని తేలిగ్గా ఆఘ్రాణించాడు. "ఇది మామూలు పువ్వులాగే వుంది...." అంటూ వేదానంద వేపు చూశాడు. "వాడిపోయిన పువ్వుల్ని తీసుకుని వాళ్ళెక్కడి కెళ్ళారు?"

"వంటశాల, గోడవైపు కురిశారనుకుంటాను. నేను అంతగా పట్టించుకోలేదు...." వేదానంద మెల్లిగా అన్నాడు.

"సౌజన్యమూర్తిగారూ! టార్చి తీసుకోండి. కిచెన్ వెనుకభాగానికి వెళ్దాం" అన్నాడు టెంపో. ప్రభంజనం అతన్ని వెంబడించాడు.

అయిదునిమిషాల తర్వాత ముగ్గురూ తిరిగొచ్చారు. టెంపో చేతిలో నలిగిపోయిన మైసూరుమల్లె వుంది. అందరూ అతన్ని ప్రశ్నార్థకంగా చూస్తున్నారు.

"డస్టుబిన్‌లో వాడిపోయిన పూలకింద ఈ పువ్వు దాక్కుంది నాలుగైదు రకాల పువ్వుల్లో కొత్తరకం పువ్వు యిదొక్కటే! మత్తుమందు ప్రయోగించడానికి

వాడిన ఈ పువ్వును అతను జాగ్రత్తగా తనతో తీసికెళ్ళి, వాడిన పూలతోబాటు అజాగ్రత్తగా డస్టుబిన్‌లో గిరాటేశాడనిపిస్తోంది!" టెంపో నవ్వుతూ అన్నాడు.

"ఐజీగారూ, మూడుగంటల ప్రాంతం నుండీ ఏ ఏ వాహనాలూ, ఎవరెవరూ కొండదిగి వెళ్ళిందీ మనకి కావాలి!" టెంపో అన్నాడు.

"కిందికి వెళ్ళిపోయి వుంటారంటారా?" సౌజన్యమూర్తి ఆందోళనతో ప్రశ్నించాడు.

టెంపో అతన్ని చిరునవ్వుతో చూశాడు. "మీరే వజ్రకిరీటం కాజేశారనుకోండి. ఇక్కడే వాళ్ళో దాచి పెట్టుకొని కూచుంటారా?"

సౌజన్యమూర్తి జవాబుగా నిట్టూర్చాడు.

"మా వాళ్ళ అన్వేషణ సాగుతోంది. ఇంతవరకూ ఫలితం కనిపించలేదు...." ఐ.జి. నిరుత్సాహంగా అన్నాడు.

"కిరీటం గల్లంతైన సంగతి తెలిసేలోగా, దొంగిలించిన వ్యక్తి మాయమైపోతాడు. వేట ప్రారంభమయ్యేదాకా వేచి, కూచోడు!" టెంపో నవ్వుతూ అన్నాడు.

"నేరస్తుడి మన స్తత్వాన్ని టెంపోగారు చక్కగా వివరించారు" ప్రభంజనం నవ్వుతూ అన్నాడు.

"ఆల్ రైట్ ....ఏం చేద్దాం?" ఐ.జి. ప్రశ్నించాడు సిగరెట్ ముట్టిస్తూ.

"టోల్ గేట్‌లో వాకబు చేసి...." టెంపో ప్రారంభించాడు.

"మిస్టర్ టెంపో, మీరు వచ్చేలోగా అదంతా చేశాం. బ్యాంక్ వ్యాన్ తప్ప మరే వాహనమూ, మనుషులూ వెళ్ళలేదన్నాడు గేటుదగ్గర మనిషి...."

ప్రభంజనం అన్నాడు.

టెంపో అతనివైపు నవ్వుతూ చూశాడు. "టోల్ గేట్ దగ్గరున్న వ్యక్తి కళ్ళు మూసుకున్నాడనిపిస్తోంది!"

"వాట్?...." ప్రభంజనం, ఐ.జి. ఒకేసారి అడిగారు.

"ఒంటెద్దు బండి వెళ్ళింది!..." టెంపో నవ్వుతూ అన్నాడు.

"మీ కెలా తెలుసు....?" ప్రభంజనం ప్రశ్నించాడు.

"రెండు కిలోమీటర్ల దూరములో రోడ్డు మలుపు దగ్గరగా అచ్చువిరిగిన బండీ. చచ్చిపోయిన ఎద్దూ పడున్నాయి. బండి కిందికి వెళ్తున్నప్పుడే విరిగిపడిందని నా అంచనా. నొగలు అటువైపునే వున్నాయి...."

"మిస్టర్ టెంపో, ఇక్కడికొస్తూ మీరు చూశారా?" ఐ,జి. ప్రశ్నించాడు.

"చూశాను. కారాపి, దిగాను. బండీ, ఎద్దుతో బాటు రోడ్డుపక్కగా రాళ్ళ చాటున స్పృహలేకుండా పడున్న వ్యక్తిని చూశాను. అతను చనిపోలేదని గ్రహించాను. అతన్ని ఎత్తి కారులో పడేసుకుని యిక్కడికి తీసుకు వచ్చాను. ఇక్కడ డాక్టర్ కుంచితపాదంకి అప్పజెప్పాను...."

"మిస్టర్ టెంపో, మతి పోగొట్టేసున్నారు! టోల్ గేటత నెందుకు అబద్ధం చెప్పాడు?" ఐ.జీ. ఆశ్చర్యంతో అన్నాడు.

"అది మనం కనిపెట్టాలి...." అంటూ టెంపో సౌజన్యమూర్తి వేపు చూశాడు.

"కెంపోగారూ, ఆ వ్యక్తి ఎలా వున్నాడు?" ప్రశ్నించాడతను.

"పొట్టిగా, లావుగా వున్నాడు. క్వింటాల్ పైనే వుంటాడు. కార్లో యెక్కించడానికి చాలా కష్టపడ్డాను. బుర్రమీసాలు. మోకాళ్ళదాకా గోచీ. బనీను. తలపాగా" కెంపో వివరించాడు.

"అతను గురవయ్య! రోజూ ఉచితంగా ఆశ్రమానికి పాలు సప్లై చేస్తున్నాడు; ఉత్సవాల సందర్భంగా! చాలా మంచివాడు. మిస్టర్ కెంపో, అతనికేం ఫర్వా లేదుగా?" సౌజన్యమూర్తి ఆదుర్దాతో ప్రశ్నించాడు.

"ఆ ప్రశ్న మీరు డాక్టర్ని అడగాలి! అన్నట్టు ఇవాళ అతని దగ్గర పాలు రిసీవ్ చేసుకున్న వ్యక్తినీ, కిచన్లో, స్టోరు రూమ్లో వున్న వ్యక్తుల్నీ తక్షణం ఇక్కడికి పిలిపించండి!" కెంపో సిగరెట్ ముట్టిస్తూ అన్నాడు.

సౌజన్యమూర్తి వెళ్ళిపోయాడు. కెంపో ఐజీనీ, ప్రభంజనాన్నీ చూశాడు.

"అతను పాలు సప్లై చేసే వ్యక్తి అని తేలింది. రోడ్డు మీద బండీ, ఎద్దూ, అతనూ తప్ప మరేంలేవు. పాలని అతను ఎందులో తీసుకొచ్చాడు? ఆ పాత్రలు ఏవి?" కెంపో ప్రశ్నించాడు.

"సాధారణంగా, పాలు వొలికిపోకుండా వుంటానికి, క్యాన్స్‌లో తీసుకొస్తారు...." ప్రభంజనం నవ్వుతూ అన్నాడు.

"అవును సార్. అతను నాలుగు క్యాన్స్‌లో పాలు తీసుకురావడం రెండు మూడుసార్లు నేను చూశాను!" శాంతానంద కల్పించుకుని అన్నాడు.

టెంపో అతన్ని చూస్తూ యేదో అడగబోయాడు. ఇద్దర్ని వెంటబెట్టుకుని సౌజన్యమూర్తి లోపలికి నూరాడు.

"టెంపోగారూ, ఇతను రామానంద. పాలు డెలివరీ ఇతనే తీసుకున్నాడు" అన్నాడతను పొట్టిగా వున్న గడ్డం వ్యక్తిని చూపిస్తూ.

"మిస్టర్ రామానంద్, ఇవాళ అతను పాలు యెందులో తీసుకొచ్చాడు?" టెంపో ప్రశ్నించాడు.

"క్యాన్స్‌లో నే తెచ్చాడండి."

"క్యాన్స్ మీకే ఇచ్చేశాడా?"

రామానంద తల అడ్డంగా ఆడించాడు. "మళ్ళీ రేపు పాలు తేడానికి కావాలిగా? పాలు వొంపేసి పట్టుకెళ్ళాడండీ!"

"ఎన్ని క్యాన్స్‌లో పాలు తెచ్చాడు?"

"నాలుగండి .... అన్నట్టు మూడింటిలోని పాలే పోయించుకున్నాను. నాలుగో క్యాన్‌లో పాలు విరిగిపోయాయండి అలాగే వాపసు చేశాను...." రామానంద గుర్తు చేసుకుంటూ అన్నాడు.

టెంపో తలపైకెత్తి సీలింగ్ వైపు సిగరెట్ పొగ వూదాడు. రెండు క్షణాల తర్వాత తటాలున తలవాల్చి, రామానందని తదేకంగా చూశాడు. "మీరు పాలు తీసుకుంటున్నప్పుడు అక్కడ యెవరేనా వున్నారా?"

"అది స్టోరు రూమ్ అండి. చాలామంది...."

"మీ దగ్గరగా!" టెంపో అతనికి అడ్డుతగిలాడు.

"మీరడుగుతూంటే గుర్తొస్తోంది.... ఒక వ్యక్తి.... లావుగా, పొడుగ్గా వున్నాడండి.... అతను.... మా దగ్గరే వున్నాడండి. పాలని పాత్రల్లోకి వొంపడంలో సాయం చేశాడు. పెద్ద క్యాన్‌లో విరిగిపోయిన పాలని కని

పెట్టింది అతనే!" రామానంద వివరించాడు.

టెంపో ఆవేశంతో ఐ.జీ. వైపు చూశాడు. ప్రభంజనం చిన్నగా ఈల వేశాడు.

"అప్పుడు అతను యేదేనా అన్నాడా?" టెంపో ప్రశ్నించాడు.

"విరిగిపోయిన పాలు అపవిత్రం అన్నాడండి. ఆ పాలని జ్ఞానపర్వతంమీద వొలకబోయవద్దనీ, అది అపరాధం అవుతుందనీ రైతుకి సలహా ఇచ్చాడండి. జ్ఞానపర్వతంపట్ల అతనికి భక్తి అధికం అనిపించి, సంతోషించానండి...." రామానంద అన్నాడు.

"అతన్ని తరవాత ఎప్పుడేనా చూశారా?"

"ఆ వ్యక్తిని నేను రెండు మూడుసార్లు చూసినట్టు గుర్తుంది...." రెండో వ్యక్తి అన్నాడు.

"ఆల్ రైట్....మీరు వెళ్ళండి!" అంటూ టెంపో సౌజన్యమూర్తి వైపు తిరిగాడు. "మూర్తిగారూ, అందరికీ వేడి వేడి కాఫీ తెప్పించండి!" అన్నాడు నవ్వుతూ.

సౌజన్యమూర్తి వెళ్ళిపోయాడు. అక్కడే అయోమయంగా నించున్న మంగళంనీ, తతిమ్మా ఇద్దర్నీ టెంపో వెళ్ళమన్నాడు. ఎవరితోనూ ఏదీ చర్చించవద్దని ఐ.జీ. వాళ్ళని హెచ్చరించాడు. టెంపో ప్రభంజనవైపు నవ్వుతూ చూశాడు.

"ప్రభంజనం, ఏమంటావ్?"

"రెండూ రెండూ నాలుగు!" ప్రభంజనం నవ్వుతూ అన్నాడు.

"ఎక్స్క్యూజ్ మీ...." మిస్టర్ ఫాక్స్ ప్రారంభించాడు.

"డోంట్ డిస్టర్బ్!" ఐ.జీ. హుంకరించాడు. ఫాక్స్

విసుగ్గా రాఘ్వని చూస్తూ మరో సిగరెట్ వెలిగించాడు.

"మిస్టర్ టెంపో...." ఐజీ యేదో అడగబోయాడు.

"ఒక్క-క్షణం!" అంటూ టెంపో ప్రభంజనం భుజమీద చెయ్యివేసి గదిమూలకి తీసికెళ్లాడు. తలవాల్చి, తగ్గుస్వరంలో అతనికి యేదో చెప్పాడు. ప్రభంజనం తల పంకిస్తూ, గదిలోంచీ వేగంగా వెళ్ళిపోయాడు.

టెంపో ఐజీ ముందు ఠీవిగా నిలబడి నవ్వుతూ చూశాడు. ఐజీ మొహం జయింట్ సైజు ప్రశ్నార్థకంగా వుంది.

"పాలతను వాపసు తీసుకెళ్ళిన క్యాన్స్ ఏమయ్యాయి?" టెంపో ప్రశ్నించాడు.

"యూ మీన్...." ఐజీ అంటూ మౌనం ధరించాడు.

"ఒక క్యాన్‌లోని పాలు విరిగేలా చేశాడతను. కాజేసిన కిరీటాన్ని విరిగిన పాలలోకి దిగేశాడు...."

"పాలు ఎట్లా విరిగాయి?" ఐజీ ప్రశ్నించాడు.

"టేబుల్ సాల్టు ఒక పాకెట్ దిమ్మరిస్తే పాలెందుకు విరగవు?" టెంపో యెదురు ప్రశ్న వేశాడు. ఐజి అర్థంకానట్టు చూశాడు.

"తుక్కు డబ్బాలో, వాడిపోయిన పూలకింద ఖాళీ సాల్టుకవర్ పడుంది!" టెంపో వివరించాడు.

ఐజి ఉషారుగా సిగరెట్ వెలిగించాడు.

"మిస్టర్ టెంపో, నాలుగు పాలక్యాన్స్‌నీ అతను - వాళ్ళు—కిందికి మోసుకెళ్ళారంటారా?" ఐజి ప్రశ్నిం శ్నించాడు.

"మీ ప్రశ్నకి కాసేపట్లో సమాధానం చెప్తాను.." అంటూ టెంపో కాఫీతో లోపలికి వస్తున్న సౌజన్యమూర్తిని చిరునవ్వుతో చూశాడు.

"ఎక్స్‌క్యూజ్ మీ...." మిస్టర్ ఫాక్స్ టెంపో చేతిని తాకుతూ అన్నాడు.

"యస్?" టెంపో అతన్ని నవ్వుతూ చూశాడు.

"ఐ హడ్ వాట్ హ్యాపెండ్ యూ.... వాట్ డూ యూ నో? ప్లీస్.... ప్లీస్ టెల్ మీ!" మిస్టర్ ఫాక్స్ ఆత్రుతలో దీనంగా అడిగాడు.

టెంపో టూకీగా అతనికి అంతా వివరించాడు. మిస్టర్ ఫాక్స్ ముఖం చేటంత సైజుకి సాగింది. ఆవేశంతో అతను టెంపో చెయ్యి పట్టుకున్నాడు.

"మార్వెలస్! సుపర్బ్! ట్రెమండస్ బ్రెయిన్ వర్క్! మైడియర్ షెర్లాక్, ప్రొసీడ్!" అరిచాడు మిస్టర్ ఫాక్స్.

అతన్ని గుర్రుమిచూస్తూ విజి కాఫీ కప్పు అందుకున్నాడు. టెంపో ఫాక్స్ పట్టులోంచీ చేతిని విడిపించుకుని సౌజన్యమూర్తి వైపు చూశాడు.

"మూర్తిగారూ, డా. కుంచితపాదంగార్ని కలుసుకోండి. పాలతినికి ఏం జరిగిందో, ఎలా వున్నాడో కనుక్కోండి."

సౌజన్యమూర్తి టెంపో దగ్గరగా జరిగాడు. "చెప్పడం మరిచాను. డాక్టరుగారు ఉపన్యాసం వినడానికి వచ్చారు. పాలతిన్ని గురించి అడిగాను. అతనికి ఒక్కరకపు వోవర్ డోస్‌లో మత్తుమందు ఇంజెక్టు చేయబడింది. మరో గంటదాకా అతను మత్తులోనే వుంటాడు. స్పృహ వచ్చాక, స్పృహ తప్పేముందు జరిగిందేదీ అతనికి గుర్తుండదన్నారు డాక్టరు. ఆదేదో మందు పేరు చెప్పారు. దాని ప్రభావం అలాంటిదట...."

టెంపో విజీవైపు తిరిగాడు. "మంగళంగారికీ అదే

మందు చాలా హెవీ డోస్‌లో వాసన చూపించబడింది! అందుకే ఆయనకి ఏదీ గుర్తులేకుండా పోయింది...."

"ఐసీ.... మిస్టర్ టెంపో, ఇంతకీ వాళ్ళు ఎలా ఎక్కడికి మాయమయ్యుంటారు?" ఐజి ప్రశ్నించాడు.

"ఎక్కడికి మాయమయ్యుంటారో నేను చెప్పలేను. ఎలా మాయమయ్యారో ఊహించగలను...." అంటూ డిటెక్టివ్ టెంపో ఆగి, ఘాటుగా సిగరెట్ పొగ లాగాడు.

"కొండ కిందికి చేరాక, పదికిలోమీటర్లు వెళ్తేగానీ వాళ్ళు మెయిన్ గేటు చేరుకోలేరు. కిరీటం వున్న క్యాన్‌ని మోసుకుంటూ, నింపాదిగా కొండ దిగి పది కిలోమీటర్లు నడిచివుంటారని నేను అనుకోను. జెట్ స్పీడులో మాయమైపోడానికి సహజంగా వాళ్ళు ప్రయత్నిస్తారు...కొండ దిగేదాకా పాలవాడినీ, అతని బండినీ, వాళ్ళు ఉపయోగించి వుండొచ్చు. కానీ ఉపయోగించుకోలేదు. ఎందుకు?" టెంపో తీక్షణంగా చూస్తూ ప్రశ్నించాడు.

"ఎందుకు?" ఐజి రామలింగం ప్రశ్నించాడు.

"పాలవాడి వొంటెద్దుబండికన్నా వేగంగా వెళ్ళే వాహనం వాళ్ళకి దొరికివుండాలి!"

"ఏది?" ఐజీ కళ్ళు చిట్లించాడు. "ఏ వాహనమూ ఇవాళ కిందికి దిగలేదు...."

"పాలపాడినీ, బండినీ, ఎద్దునీ దారి మధ్యలో వొదిలేసిన ఆ వ్యక్తులు పాలక్యాన్‌లని ఎందుకు గిరాటేయలేదు?" టెంపో మళ్ళీ ప్రశ్నించాడు.

ఐజీ యెందుకో చెప్పమన్నట్టు చూశాడు.

"మూడొంతులు, పాలు సప్లై చేసే వ్యక్తుల్లా నటించ

దానికి పాలవ్యాన్‌లు వాళ్ళకి బాగా ఉపయోగించి వుంటాయి. అవసరం తీరాక వ్యాన్ అని గిరాటేసి, వజ్ర కిరీటంతో మాయమై వుంటారు!" టెంపో ఉద్రేకంతో అన్నాడు.

"మీ రీజనింగ్ అద్భుతంగా వుంది.... కానీ, ఎవరి ముందు వాళ్ళు అలా నటించి వుంటారు? యే కారూ కిందికి...."

"ఐజీ గారూ, బ్యాంక్ వ్యాన్ కిందికి దిగిన విషయం మీరు మరిచిపోతున్నారు!" టెంపో నవ్వుతూ అన్నాడు.

ఐజీ అదిరిపడి లేచి నించున్నాడు. "మై గాడ్ ... వాళ్ళకి అంత ధైర్యమా? పోలీసు బందోబస్తుతో వెళ్ళే బ్యాంక్ వ్యాన్‌లో... ఐ కాంట్ బిలీవ్!"

"నేనైతే కిరీటాన్ని కొట్టేస్తే అలాగే చేస్తాను. లక్షలాది రూపాయల్తో, ఫుల్ సెక్యూరిటీతో వెళ్ళే వాహనాన్ని వుపయోగించుకోడం అన్ని విధాలా మంచిది. పోయిన ఎవరిదో వస్తుకోసం మీరు ఎక్కడెక్కడో వెతుకుతారు. మీ జేబుల్లో తప్ప దొంగాడికి. అది సేఫెస్టు ప్లేస్!" టెంపో నవ్వుతూ అన్నాడు.

ఐజీ తల గంభీరంగా ఊగింది. "యూ మే బి రైట్ ....బట్.."

"అది కనుక్కుందాం. సౌజన్యమూర్తిగారూ, బ్యాంకు మేనేజరు సుబ్బారావుగారు ఉపన్యాసం వింటూంటారనుకుంటా. ఆయన్ని పిలిపించండి!" టెంపో కుర్చీలో కూచుంటూ అన్నాడు.

అయిదు నిమిషాల్లో సుబ్బారావు ప్రత్యక్షమయ్యాడు.

"సుబ్బారావుగారూ, సాయంత్రం క్యాష్‌తో బాటు వ్యాన్‌లో ఎవరు వెళ్ళారు?"

"మా అకౌంటెంట్ శివతాండవం...." సుబ్బారావు జవాబిచ్చాడు.

"అతనితో అర్జెంటుగా మాట్లాడాలి. అతనెక్కడున్నాసరే! కొండమీంచి వ్యాన్‌లో అతను యెవరికేనా లిఫ్ట్ యిచ్చాడేమో కనుక్కోండి...." టెంపో ఇంకా ఏదో చెప్పబోయాడు.

"ఇంపాసిబుల్! హైయ్యెస్టు సెక్యూరిటీతో ఇవాళ్టి కలెక్షన్ అని అతను తీసికెళ్ళాడు. పరబ్రహ్మను కూడా అతను యెక్కించుకోడు!" సుబ్బారావు ఆవేశంతో అన్నాడు.

"అతనూ అలాగే అంటాడేమో విందాం! ఫోన్ చెయ్యండి!" టెంపో నవ్వుతూ అన్నాడు.

"ఎందుకు? ఉయ్యార్ వేస్టింగ్ టైమ్...." సుబ్బారావు అన్నాడు.

"మిస్టర్ సుబ్బారావ్, యూ ఆర్ వేస్టింగ్ అవర్ టైమ్! నోరు ఉపయోగించకండి; ఫోన్ ఉపయోగించండి" వి.జి. విసుగ్గా అన్నాడు.

సుబ్బారావు కిక్కురుమనకుండా రిసీవరు అందుకున్నాడు. ఒక నెంబరు డయల్ చేశాడు. నిమిషం తరువాత అతనికి శివతాండవం కంఠం వినిపించింది.

సుబ్బారావు అతన్ని ప్రశ్నించాడు. రెండు నిమిషాల పాటు నోరు వెళ్ళబెట్టి వింటూ వుండిపోయాడు. మౌత్ పీస్‌ని అరచేత్తో మూసి మెల్లిగా టెంపో వైపు చూశాడు.

"ఇద్దరు పాల వ్యక్తుల్ని అతను వ్యాన్‌లో ఎక్కించుకున్నాడు. కొండ రోడ్డు మలుపుదగ్గర బండి అచ్చు విరిగి పడిపోయింది. ఎద్దు చచ్చిపోయింది. బండీ, ఎద్దూ రోడ్డుకి

అడ్డంగా పడున్నాయట. వ్యాన్ని ఆపాల్సి వచ్చింది. ఇద్దరు పల్లెటూరి వ్యక్తులు నాలుగు పాల కేన్లు పెట్టు కుని అక్కడ ఏడుపుమొహాల్తో చూచున్నారు. కొన్ని పాలు విరిగిపోతాయనీ, రాత్రిలోగా మళ్ళీ పాలు అంద జేయాలనీ మెయిన్ రోడ్‌లో తమ రోడ్డుదగ్గర దిగి పోతామనీ ప్రాధేయపడ్డారుట. శివతాండవం జాలేసి, వాళ్ళని ఎక్కించుకున్నాడు...."

"వాళ్ళని వర్ణించమనండి!" టెంపో హెచ్చరిం చాడు.

సుబ్బారావు కాసేపు వింటూ వుండిపోయాడు. "ఒకతను లావుగా, పొడుగ్గా వున్నాడు. అతనే అంతా వివరించి, వ్యాన్‌లో యెక్కించుకొమ్మని ప్రాధేయ పడ్డాడట. రెండో అతను సన్నగా పొడుగ్గా వున్నాట్ట. అతను పెదవి కదపలేదుట...."

"ఆల్ రైట్. వాళ్ళెక్కడ దిగిపోయారో కను క్కోండి" టెంపో డిక్టేట్ చేశాడు.

"సిటీకి అయిదు కిలోమీటర్ల యివతల దిగిపోయా రట...." కనుక్కున్న సుబ్బారావు రిలేచేశాడు. ఫోన్ పెట్టేయమన్నట్టు టెంపో అతనికి సైగ చేశాడు. రిసీ వర్ని పెట్టేసి, సుబ్బారావు అదోలా చూశాడు.

"ఇంతకీ....ఎందుకిదంతా అడగమన్నారు?"

"సింపుల్ థింగ్, ఇద్దరు పాత దొంగల్ని యిక్కడ పోలీసులు పోల్చారు. ఒక కేసు సందర్భంలో వాళ్ళు పరారీలో వున్నారు. పట్టుకునేలోగా, పాలవాళ్ళలా నటిస్తూ పరారయ్యారు! ఓ.కే., మిస్టర్ సుబ్బారావ్! థాంక్స్. మీరు వెళ్ళండి. ఉపన్యాసం ముగిసేలా

వుంది...." టెంపో నవ్వుతూ అన్నాడు.

సుబ్బారావు తలాడిస్తూ వెళ్ళిపోయాడు.

"సో.... దాదాపు అరవై అయిదు కిలోమీటర్ల దూరం నుంచీ పాలవాడు ఒంటెద్దు బండిమీద కొండకి పాలు తెస్తున్నాడు!" టెంపో నవ్వుతూ అన్నాడు.

ఐ. జి. రామలింగం అర్థంకానట్టు చూశాడు. "వాట్ డూ యూ మీన్?"

"కొండ కిందున్న యేదో పల్లెటూరునుంచి అతను పాలు తెస్తున్నాడు. అరవై కిలోమీటర్ల దూరంలోని పల్లెటూరనగానే వ్యాన్‌లోని వ్యక్తులు అనుమానించి వుండాల్సింది!" టెంపో నవ్వుతూ సిగరెట్ వెలిగించాడు.

"యూ ఆర్ రైట్....అయితే...."

"ఎంత తెలివైనవాడైనా పప్పులో కాలేస్తాడు. అలాగే మన ఆసామీ కూడా పొరపాటు చేశాడు. ఇంకా చేస్తాడు........" టెంపో సాలోచనగా అన్నాడు.

"మిస్టర్ టెంపో! కర్తవ్యం?" ఐ. జి. ప్రశ్నించాడు.

"జ్ఞానపర్వతాన్ని అన్వేషించడం ఆపేయమని మీ వాళ్ళకి చెప్పండి. పిట్టలు ఎగిరిపోయాక పొదల్ని కదిలించి లాభంలేదు!" టెంపో నవ్వాడు.

ఐ.జి. టెలిఫోన్ రిసీవరుని అందుకున్నాడు.

"ఐజీగారూ! మనం వెంటనే కిందికి, సిటీకి దూసుకెళ్ళాలి!" టెంపో చటాలున కుర్చీ లోంచి లేచాడు.

ఐ. జి. అప్రయత్నంగా రిసీవర్ని వదిలేశాడు.

"కమాన్! వెళ్తూ మా వాళ్ళకి సూచనలిస్తాను!" అంటూ

లేచాడు.

"మిస్టర్ టెంపో, వాటార్ యూ గోయింగ్ టూ...."

మిస్టర్ ఫాక్స్ ఆదరా బాదరా వాళ్ళ దగ్గరగా వచ్చాడు.

టెంపో అతన్ని చిరునవ్వుతో చూశాడు. "నెవర్ మైండ్ మిస్టర్ ఫాక్స్. నౌ యూ ఆర్ గోయింగ్ టూ సిట్ విత్ ది స్వామీజీ అండ్ మెడిటేట్!" అంటూ, కదిలించి వెళ్ళిపోయాడు. ఐ. జి. అతన్ని వెంబడించాడు.

"మిస్టర్ ఫాక్స్ వెర్రివాడిలా పార్ట్నర్ రాక్స్ని చూశాడు.

డిటెక్టివ్ టెంపో స్టీరింగ్ వీల్ ముందు కూచున్నాడు. ఐ. జి. రామలింగం అతని పక్కనే బరువుగా కూచున్నాడు. టెంపో ఆలోచిస్తూ పెదాల మధ్య సిగరెట్ ఇరికించాడు.

"మిస్టర్ టెంపో, ప్రభంజనం...." ఐ.జి. మెల్లగా అన్నాడు.

"త్యాగలో మనల్ని కల్సుకుంటాడు...." టెంపో అడ్డుతగులుతూ అన్నాడు.

సిగరెట్ వెలిగించి, అగ్గిపుల్ల వెలుతుర్లో టెంపో రిస్టువాచీ చూసుకున్నాడు. మెగాఫోన్ల నుంచీ స్వామీజీ కంఠం స్పష్టంగా వినిపిస్తోంది. ఏవేవో ఉపనిషద్వాక్యాలతో లింకప్ చేసి, దొంగతనం పాపం అని నిరూపించే ప్రయత్నం చేస్తున్న స్వామీజీ యోగాంగాల్ని తీసుకున్నాడు. అష్టాంగాలలో మొదటిదయిన 'యమం' లోని అహింస అస్తేయం, సత్యం, వగైరాల్లోని అస్తేయాన్ని ఆయన ప్రత్యేకంగా పేర్కొంటు

న్నారు.

"ఆ నేరము అనగా యితరుల సొత్తుని అపహరించ కుండా వుండటం. దొంగతనం...." దశావతారానంద కంఠాన్ని మెగాఫోన్‌లు జ్ఞానపర్వతంమీద మారుమోగి స్తున్నాయి.

"తన కిరీటాన్ని కాజేసిన వ్యక్తులు యింకా కొండ మీదే కూచున్నారని స్వామీజీ అనుకుంటున్నాడు!" టెంపో నవ్వుతూ, కారును స్టార్టు చేశాడు. చిన్నగా నవ్వుతూ ఐ.జి. సర్దుకూర్చున్నాడు. రెండు నిమిషాల్లో టోల్ గేటు ముందు కారాగింది. అక్కడున్న ఎస్.పి. ఐ.జి. దగ్గరగా నిలబడ్డాడు. కారు కిటికీలోంచి తల కొద్దిగా బైటికి పెట్టి ఐ.జి. తగ్గుస్వరంలో ఏదో చెప్ప సాగాడు.

టెంపో తటాలున కారులోంచి దిగాడు. పెద్ద పెద్ద అంగల్తో అటుపక్కన వున్న టెలిఫోన్ ఎక్స్చేంజ్ వైపు నడిచాడు. అయిదు నిమిషాల్లో తిరిగొచ్చి, కారుని పోనిచ్చాడు....

## 11

సడన్ బ్రేకుతో కారాపి, కుంకుమ కిందికి దూకింది. డోర్ని అలాగే వదిలేసి, చకచకా కదిలింది. పేవ్‌మెంట్ మీద నడుస్తున్న వాళ్ళ కళ్ళు ఆమెని ఫాలో అయ్యాయి. ఖాళీగా వున్న పబ్లిక్ టెలిఫోన్ బూత్ లోకి దూరి ఆమె తలుపు మూసింది.

అద్దంగుండా రోడ్డుని వొకసారి చూసి, ఒక నంబరు డయల్ చేసింది. అటువైపునుంచీ ధ్వనిస్తున్న కంఠాన్ని వింటూ, స్లాట్‌లోకి నాణేలు పడేసింది.

"నేను" అంది కుంకుమ క్లుప్తంగా.

"ఇక్కడ నేనే! ఏమిటి కథ?" బొంగురు కంఠం ఉషారుగా అంది.

"కథ కంచికి వెళ్ళింది. నేను ఇంటికి వస్తున్నా. నేనొచ్చేసరికి అంతా రెడీగా వుండాలి!"

"నువ్వు రాకముందునుంచీకూడా రెడీగా నే వున్నా!" అవతలి కంఠం నవ్వుతూ అంది. "కుంకుమా....నిన్ను చూసి యెంతో కాలం అయినట్టుంది...."

"యూ టాక్ టూ మచ్!" అంటూ కుంకుమ రిసీవర్ని కుక్కి మళ్ళా ఎత్తి చెవికి ఆనించింది. ఆలోచిస్తూ తన రేడియం డయల్ వాచీ చూసుకుంది. ఎర్రటి కింది పెదవిని తెల్లటి పళ్ళతో కాసేపు సాలోచనగా నొక్కుకుంది ఆమె చూపుడు వేలు మరో నంబర్ని తిప్పింది.

"హాలోవ్...."

"నేను" చిటికెనవేలి కొసతో అరచేతికి నొక్కిపెట్టిన నాణేల్ని పడేస్తూ అంది కుంకుమ.

"నేనే!" అటువైపు కంఠంలో ఉత్సాహం గంటలా ధ్వనించింది.

"ఇప్పుడే వచ్చాను. అంతా అనుకున్నట్టే జరిగింది..."

"నీనుంచీ తప్ప, అసలు వ్యక్తినుండీ రిపోర్టు రాలేదు! ఆయామ్ వర్రీడ్...."

"అనవసరంగా బ్లడ్ ప్రెషర్ పెంచుకోవద్దు! వార్త వస్తుంది; వాళ్ళూ వస్తారు!"

"కుంకుమా, పావురాన్ని తన్నుకుని డేగ ఎగిరి పోదుగా?"

"మీ అమ్మ అనుమానిస్తూ నిన్ను కన్నట్టుంది! చట్టబద్ధంగా చేసే వ్యాపారంలో ఒక పార్టనర్ మరో పార్టనర్ని మోసం చేయొచ్చు. ఇలాంటి బిజినెస్‌లో

పార్టనర్స్ ఒకర్నొకరు మోసంచేసి, అసలుకే ఎసరు పెట్టుకోరు!" కుంకుమ కంఠం గంభీరంగా ధ్వనించింది. ఆమె నవ్వలేదు. అవతలినుంచీ బరువుగా నిట్టూర్పు ఆమె చెవిలో బుసకొట్టింది.

"అర్థమైందనుకుంటాను.." కుంకుమ మళ్ళీ తనే అంది. ఈసారి ఆమె నవ్వింది.

"ఒకటో ఎక్కంలా అర్థమవుతోంది. నీకు మోసం జరగదు!" అవతలి వ్యక్తి నవ్వుతూ అన్నాడు.

"నన్ను యెవరూ మోసంచేయలేరు!" కుంకుమ సగర్వంగా అంది. "కాసేపట్లో అక్కడుంటాను.."

"కుంకుమా.."

నిర్లక్ష్యంగా రిసీవర్ని పెట్టేసి కుంకుమ బూత్ లోంచీ ఇవతలికి నడిచింది. వానిటీ బాగ్ లోంచీ రుమాలుతీసి మొహానికి అంటుకున్న చెమట బిందువుల్ని సుతారంగా ఒత్తుకుంది. రుమాలుకి పులిమిన సెంటు ఆమెకి ఎందుకో గిలిగింతలు పెట్టింది. పని పూర్తయ్యాక వేడివేడి నీళ్ళలో ఆ సెంటు కలిపి టబ్ లో అరగంట విశ్రాంతిగా పడుకోవాలి. ఆ తరవాత తనకి విశ్రాంతి దొరకదు! ఆ సెంటు గుమాయింపు అతనికెంతో ఇష్టం. పిచ్చెక్కిపోతాడు.

ఆలోచిస్తూ కుంకుమ రుమాలుని బాగ్ లో పడేసింది. తనకి కొంచెం దూరంగా, బూత్ కి దగ్గరగా అతను నిలబడ్డాడు. అతని చూపులు తనమీదే తాపడం అయిపోయాయని కుంకుమ పసిగట్టింది. తల తిప్పి ఓరగా చిరాకుగా అతనివైపు చూసింది. సన్నగా పొడుగ్గా వున్నాడతను. వయిట్ పాంటులోకి వయిట్ షర్ట్ నిర్ల

ష్యంగా దోపబడింది. చొక్కా చేతులు మోచేతుల్దాకా యెగదోయబడ్డాయి. పెదాల మధ్యవున్న సిగరెట్ ని వేళ్ళమధ్య యిరికించి ఆమెవైపు చిరునవ్వుతో చూశాడతను.

కుంకుమలో కోపం, అసహ్యం, బుసకొట్టాయి. మగాళ్ళంతా ఇంతే. కొండమీద గడ్డాలు పెంచుకొన్న సన్యాసులంతా గుడ్లు పెకలించుకుని తనవేపు చూస్తూ వుండిపోయారు. విశ్వామిత్రుడు మేనకని అలాగే చూసి వుంటాడు! కుంకుమ చకచకా నడిచి, స్టీరింగ్ వెనక్కి సర్దుకుంది. డోర్ మూయబోతూ బూత్ వేపు చూసింది. ఆ వ్యక్తి తనని అలాగే చూస్తున్నాడు. మగజాతిని తిట్టుకుంటూ ఆమె కారును రివ్వున పోనిచ్చింది.

కుందగజాల మార్గములో కారు మలుపుతిరిగేదాకా అలాగే చూస్తూ నిలబడి అతను నిట్టూరుస్తూ బూత్ లోకి దూరాడు.

(ముగింపు వచ్చే సంచికలో)

సీరియల్

వి.యస్.రావ్



(గత సంచిక తరువాయి)

అతని మొహం భయంకరంగా వుంది. ముక్కు మీద ఎర్రటి పుండు చుట్టతో కాల్చిన గాయం. రెండు చెంపల మీదా కత్తిగాట్లలా, గడ్డకట్టిన రక్తం, వెంట్రుకల్లోంచి స్పష్టంగా అవుపిస్తోంది. గోడకి వీపు ఆనించి నిలబడ్డ ధర్మరాజు చేతులు రెండూ పైన, గోడకి వున్న రింగులో బంధించబడ్డాయి. ఛాతీమీద చొక్కా రక్తంచారలతో భయానకంగా వుంది. మనోజ్ చూపులు ధర్మరాజు పాదాలవైపు దిగాయి. పదివేళ్ళ కొసలూ రక్తంతో ఎర్రగా మెరుస్తున్నాయి. పాదాల చుట్టూ రక్తం, చల్లిన కుంకుమలా వుంది. ధర్మరాజు చిత్రవధ అనుభవించాడు....

మనోజ్ రివాల్వర్ని ముందుకి చాపి, అతనివైపు నడిచాడు.

క్షణంలో ధర్మరాజు కళ్ళల్లో ప్రేతకళ ప్రత్యక్షమయ్యింది. మనోజ్ అతన్ని చిరునవ్వుతో చూశాడు. ధర్మరాజు కళ్ళల్లో భయం మంటలా అవుపిస్తోంది. వాచిపోయి, రక్తసిక్తంగా వున్న అతని పెదవుల సందులోంచి నాలుక ఇవతలికి సాగింది.

“భయపడకు! మాట్లాడకు!” మనోజ్ మెల్లిగా అన్నాడు. “దాని తాళంచెవి ఎక్కడుందో తెలుసా?” అతని చేతులను బంధించిన బేడీని చూపిస్తూ అడిగాడు మనోజ్.

“వాడి దగ్గరుంటుంది....” ధర్మరాజు మెట్లవేపు తల కదిలిస్తూ అన్నాడు. అతని కంఠం అరగంట ఆపకుండా ఏడ్చిన పసివాడి కంఠంలా బొంగురుగా వుంది.

మనోజ్ వెనుదిరిగాడు. మెట్లెక్కి గార్డు చేతుల కింద చేతులు దూర్చి, నిమిషంలో లోపలికి లాక్కొచ్చాడు. తన కాళ్ళదగ్గర వెల్లకిలా పడున్న గార్డుని ధర్మరాజు హీనంగా చూస్తున్నాడు. అతని బెల్టు పాకెట్ లోంచి చిన్న తాళాన్ని తీసుకుని మనోజ్ పైకి లేచాడు. ధర్మరాజు కళ్ళు అతని కదలికల్ని ఆశగా కనిపెడుతున్నాయి. మనోజ్ గోడవారగా నిలబడి, మునివేళ్ళమీద పైకి లేచాడు. క్షణంలో తాళం క్లిక్కుమంది.

విడుదల పొందిన తన చేతుల్ని ప్రేమగా ఒకసారి చూసి, ధర్మరాజు మనోజ్ వైపు కృతజ్ఞతతో చూశాడు. అతని పెదవులు కదిలాయి. మనోజ్ మాట్లాడవద్దన్నట్టు అతనికి సైగ చేశాడు. కొద్దిగా తూలి, ధర్మరాజు నిలదొక్కున్నాడు. మనోజ్ కింద పడున్న గార్డువైపు చూసి, కదలబోయాడు. ధర్మరాజు కిందికి వంగాడు. అమాంతం గార్డుని రెండు చేతుల్తో పైకెత్తి, గోడకి

అన్ని నిలబెట్టాడు.

"వీడి చేతులకి బేడీలు తగిలించాలి!" బొంగురు కంఠంతో అన్నాడతను.

మనోజ్ అతన్ని ఆశ్చర్యంతో చూశాడు. ఎన్నాళ్ళు గానో బందీగా, చిత్రవధ అనుభవించిన ధర్మరాజా శక్తిని అతను లోలోపలే మెచ్చుకున్నాడు. ధర్మరాజా పైకెత్తి పట్టుకున్న గార్డు చేతులచుట్టూ బేడీలు బిగించాడు. ఆ తాళాన్ని గార్డు బెల్టు పాకెట్ లోకి తోశాడు.

"కమాన్ .... వెళ్ళాలి ....!" మనోజ్ కదల బోయాడు.

"బ్రదర్! నువ్వెవరు?" ధర్మరాజా కదలకుండా ప్రశ్నించాడు.

"తరవాత ....కమాన్!" మనోజ్ ముందుకి నడిచాడు. ఫట్ మన్న శబ్దం అతన్ని ఆపింది. మనోజ్ ఆశ్చర్యంతో తిరిగి చూశాడు. గార్డు మొహం రక్తసిక్తంగా వుంది. ముక్కులోంచీ, నోట్లోంచీ రక్తం కాలువలు కట్టింది. ధర్మరాజా తన పిడికిలి పనితనాన్ని సంతృప్తికరంగా చూస్తున్నాడు.

"యూ బ్రూట్, కమాన్!" మనోజ్ చిన్నగా అరిచాడు. ధర్మరాజు అతన్ని చిరునవ్వుతో చూశాడు. జోరుగా నడుస్తున్న మనోజ్ ని అనుసరించాడు. మనోజ్ చెయ్యి స్విచ్చిని తాకింది. చీకటి నేలమాళిగని గొంగళిలా కప్పింది.

నడవ ముందు యింకా నిద్రలో వున్న గార్డువద్ద ఆగబోయిన ధర్మరాజుని ముందుకు లాగుతూ మనోజ్ మెట్లవైపు దారితీశాడు. ధర్మరాజు తడబడే అడుగుల్ని నిర్లక్ష్యం చేస్తూ నడవసాగేడు.

"సెపమ్మట కిందికి పోవాలి. ఆ పని చేయగలవా?" మనోజ్ ప్రశ్నించాడు.

"పంజరంలోంచి విడిపించావు. ఇప్పుడు వెయ్యి ఏనుగుల బలం వచ్చింది. పోవడం కాదు; కావలిస్తే దూకుతాను!" ధర్మరాజు సగర్వంగా అన్నాడు. పిట్టగోడ దగ్గర ఆగి, మనోజ్ ధర్మరాజువైపు సైగ చేస్తూ అటువైపు దిగాడు. క్షణంలో గబగబా కిందికి జారసాగాడు.

* * *

కారు ఎనభై కిలోమీటర్ల వేగంతో దూసుకెళ్తోంది. మనోజ్ పదకొండోసారి వెనుదిరిగి చూశాడు. రోడ్డు ఖాళీగా వుంది. తమని యెవరూ వెంటాడ్డంలేదు.

"ధర్మరాజా! పైకి లేచి, సీటుమీద కూచో!" మనోజ్ హెచ్చరించాడు.

ధర్మరాజు సీటుమూలకి చేరగిలబడి, పొడుగ్గా నిట్టూర్చాడు.

"ఇక వెలుతురు చూడలేననుకున్నాను. దేవుడిలా వచ్చి, తప్పించావ్ బ్రదర్! ఎవరు నువ్వు?"

"నువ్వు పిలుస్తానే వున్నావుగా?" మనోజ్ నవ్వుతూ అన్నాడు. "ధర్మరాజా! వాళ్ళకి యేదేనా చెప్పావా?"

ధర్మరాజు బొంగురుగా నవ్వాడు. "చెప్తే బతికేవాణ్ణనుకున్నావా? మననుంచి తనకి అవసరమైంది తెలుసుకున్నాక శత్రువుకి మన అవసరం తీరిపోతుంది. మరుక్షణం మన ఆయుష్షూ తీరిపోతుంది! గోళ్ళు పీకినప్పుడూ వొంటిమీద కత్తితో నెత్తురు కాలువలు పుట్టించినప్పుడూ, గుండు సూదులు గుచ్చినప్పుడూ అరవడానికి

తప్ప మనం నోరు తెరవలేదు!" అన్నాడతను సగర్వంగా.

మనోజ్ వొళ్ళు వొకసారి జలదరించింది. "ధర్మరాజూ, నీ మిత్రులిద్దర్నీ యెక్కడ బంధించారో నీకు తెలుసా?"

"తెలుసు...."

అసంకల్పితంగా మనోజ్ కారుని స్లో చేశాడు. "ఎలా తెలుసు?"

"ఆ దొంగ వెధవలు, పిరికిపందలు నన్ను గోడకి తాపడం చేసినన్నాళ్ళూ, నోరు మూసుకున్నా గానీ, చెవులు మూసుకోలేదు. టార్చర్‌తో అలసిపోయాక, నాలుగయిదుసార్లు స్పృహ తప్పినట్టు నటించాను. నన్ను నజ్జు నజ్జు చేసిన యిద్దరు 'టార్చర్ ఎక్స్‌పర్ట్స్' మాట్లాడుకుంటూంటే విన్నాను. "ఇక అక్కడికి వెళ్ళాలి. ఆ సన్యాసులూ వీడిలాగే మొండిపిండాలవుతే టార్చర్‌తో మనం అలసిపోవాల్సిందే!" అన్నాడొకడు, ఒకసారి. వాడి అసిస్టెంట్ యెక్కడికని అడిగాడు. అప్పుడు వాడు చెప్పాడు."

"ఎక్కడ?" మనోజ్ ప్రశ్నించాడు.

"ఎందుకు? తప్పించడానికా? నా వొళ్ళంతా కాలిన రబ్బరులా వుంది. నేను రాలేను...." ధర్మరాజు బొంగురుగా అన్నాడు.

"వస్తానన్నా నిన్ను రానివ్వను! ఎక్కడ చెప్పు!" మనోజ్ ఆత్రంగా అంటూ కారుని ఆపేశాడు

"ఆపకు! పోనీ....ఇంకా మనం మన ఎల్లలు చేరుకోలేదు. చెప్తాను!" కంగారుగా అంటూ ధర్మరాజు

చెప్పడం ప్రారంభించాడు. చెవులు రిక్కించి వింటూ మనోజ్ కారుని పోనిచ్చాడు.

* * *

రోడ్డువారగా వున్న చెట్టుకింద దట్టంగా పరుచుకున్న చీకట్లో మనోజ్ కార్ని ఆపాడు.

రేడియం డయల్ వాచీ చూసుకున్నాడు. పన్నెండూ ఇరవై. తన నిర్ణయం ప్రకారం మరో పదినిమిషాలు ఆగి బయల్దేరాలి. సిగరెట్ వెలిగించి, అతను విశ్రాంతిగా వెనక్కివాలాడు.

ఈసారి తను ఎంతమందిని ఎదుర్కోవాలో అతనికి తెలీదు. మనుషులకి తోడు ఇక్కడ అల్సేషియన్లు, బుల్ డాగ్ లూ వున్నాయి! మనుషుల్ని, కుక్కల్ని లొంగదీయడానికి అవసరమైన సరంజామాని అతను చాలా జాగ్రత్తగా సమకూర్చుకున్నాడు. తను విడిపించడానికి వెళ్లే వ్యక్తి, స్పృహలో వుంటాడో లేడో, తెలీదు. అందుచేత అతని జేబులో స్మెల్లింగ్ సాల్ట్సు కూడా వుంది.

సిగరెట్ ని కిందికి గిరాటేసి, మనోజ్ కార్లోంచి దిగాడు. డోర్ని తోసి, జోరుగా నడకసాగేడు.

గతరాత్రి ధర్మరాజు తప్పించబడటం జంబూకేశ్వరంలో కలవరం పుట్టించి వుంటుంది. తను బంధించిన వ్యక్తుల్ని, భవిష్యత్తులో విరూపాక్షరావు పరువుతీసే పాత్రుల్ని తప్పించే ప్రయత్నం ప్రారంభమైందని గ్రహించాక, అతను కాపలాను కట్టుదిట్టం చేస్తాడు. తతిమ్మా ఇద్దర్నీ తప్పించడం అంత సులభంకాదు! అయినా తప్పదు. వాళ్ళని విడిపిస్తేగానీ, తను తన శత్రువును త్వరగా పట్టుకోలేడు!

కోటగోడలా వున్న కాంపౌండ్ వాల్ వెనక ఇరుకు

సందులో చీకట్లో అతను నిలబడ్డాడు. గోడవతల ఎత్తుగా పెరిగిన అశోకవృక్షం సరిహద్దుకి జరిగాడు. లైట్ స్వెట్టర్ని రెండు చేతుల్తో పైకిలాగాడు. నడుంచుట్టూ, బ్యాండేజ్‌లా చుట్టిన నైలాన్ రోప్‌ని గబగబా విప్పదీశాడు. సన్నటి నైలాన్ తాడు చాలా బరువు మోస్తుందని అతనికి తెలుసు.

తాడు పొడుగునా, అడుగుమూరంలో మధ్యలో వుండేలా ముళ్ళు వేశాడు. ముడి లేకపోతే చేతికి పట్టు దొరకదు. బెల్టు మధ్యలో ఇరుక్కుని వేళ్ళాడుతున్న కొక్కాన్ని తాడుకొసకి గట్టిగా, జాగ్రత్తగా ముడేశాడు.

చీకటికి అలవాటుపడ్డ కళ్ళతో పైకి చూశాడు. కాంపౌండ్ వాల్ మీద, ఇతరులవైపుకి వాల్చి బిగించబడిన రెయిలింగ్ గీతలా అవుపిస్తోంది. రెయిలింగ్‌నీ, గోడ పైభాగాన్నీ కలుపుతూ ముళ్ళతీగ మెష్. మెష్‌లో కరెంట్ వుండదు! ట్రాన్స్‌ఫార్మర్‌ని తనే ఆఫ్ చేశాడు.

తాడుని రింగులా చుట్టి, చేత్తో పట్టుకుని మనోజ్ గురిచూశాడు. వెనక్కి జరిగిన అతని చెయ్యి లాఘవంగా పైకిమూసుకెళ్ళింది. కొక్కెం తగిలించిన భాగం కాంపౌండు వాల్ లోపలికి పడింది. కొక్కెం గోడకి కొట్టుకుని చిన్నగా చప్పుడు చేసింది.

లోపలి వాళ్ళకి చప్పుడు వినిపించి వుంటుందా? ఆలోచిస్తూ మనోజ్ నైలాన్ రోప్‌ని మెల్లిగా లాగసాగేడు. కాసేపు తరువాత తాడు కదలడం మానేసింది. కొక్కెం రెయిలింగ్‌కి తగుల్తూ చిన్న చప్పుడు చేసింది. ఒకేసారికి తన ప్రయత్నం ఫలించింది.

మనోజ్ ఇటూ అటూ చూశాడు. తనలాంటి నిశా

చరులు ఎవ్వరూ లేరు!

మనోజ్ రెండు చేతుల్తో తాడు పట్టుకుని బూట్లని గోడకి ఆనించి గబగబా పైకి ఎక్కసాగేడు. మూడు నిమిషాల్లో, రెయిలింగ్ అతని చేతికి తగిలింది, గోడమీద కత్తుల్లా వున్న గాజు పెంకులు తగలకుండా జాగ్రత్తపడుతూ తల గోడపైకి చాపి, లోపలికి చూశాడతను. కాంపౌండంతా చీకటితో నిండింది. చీకట్లో కాపలా కాయడం మానుషులకి కష్టం కావొచ్చు. కానీ కుక్కలకి, బాగా ట్రెయినవ్ చేయబడిన కుక్కలకి చీకటి అడ్డురాదు!

మనోజ్ రెయిలింగ్ గోడమీద పిల్లిలా, నల్లపిల్లిలా కూచున్నాడు. నైలాన్ తాడుని తోటలోకి లాగి, వదిలాడు. కాళ్ళన్ని తిరగేసి రెయిలింగ్ కి తగిలించాడు. శరీరాన్ని కిందికి సరఫరా చేసి, చకచకా కిందికి దిగసాగేడు.

కిందికి జారుతున్న మనోజ్ తటాలున ఆగాడు. కిందికి, తను పాదాలు మోపబోయే జాగాలోకి కళ్ళు చించుకుంటూ చూశాడు. చీకటి కాటుక తప్ప కళ్ళకి ఏమీ కనిపించడంలేదు. మెడనుంచీ వీపుగుండా కారసాగిన చెమట చల్లగా తగిలిందతనికి. పట్టుకుంటే ప్రాణాలు తీసేదాకా వదలని కుక్కల గురించి ఆలోచన ఆందోళనని పుట్టిస్తోంది.

తెగించి, ధైర్యంగా మనోజ్ కిందికి దిగేశాడు. తటాలున గోడకి ఆనుకుని, తోటలో చెట్టులా నిలబడిపోయాడు. ఊపిరి వొగుర్పు రూపంతో అతనిలోంచీ బైటపడుతోంది. నడుముకి చుట్టిన దళసరి మఫ్లర్ లాంటి గుడ్డని ఎడంచేతికి బంతిలా చుట్టాడు. కుడిచేతిని తయారుగా జేబులో వుంచుకున్నాడు. అటూ, ఇటూ

చూశాడు. ఏ ఆకారాలూ కనిపించడంలేదు. ఏ శబ్దాలూ వినపడ్డంలేదు. అదృష్టం తనవైపే వుంది! కుక్కలు యెక్కడో విశ్రాంతిగా పడుకున్నట్టున్నాయి...

ధర్మరాజు వివరించిన బంగళా ప్లానుని గుర్తుచేసుకుంటూ ఎడమవైపు తిరిగి నిశ్శబ్దంగా నడవసాగేడు. పచ్చగడ్డి అడుగుల శబ్దాన్ని మింగేస్తోంది. తోటలోంచీ బంగళావైపే సాగుతున్న మెట్లు లీలగా దూరంలో అవుపిస్తున్నాయి. కిటికీల్లోంచీ వెలుతురు కనిపించడంలేదు. అందరూ నిద్రపోతున్నారా?

అడుగులేస్తున్న మనోజ్ తటాలున ఆగాడు. చెవులు రిక్కించి కుడివైపుకి తిరిగిచూశాడు. గడ్డిలో యేదో చప్పుడు మెత్తగా వినిపిస్తోంది. మనోజ్ ఊపిరి బిగబట్టాడు. పదడుగుల దూరంలో రెండడుగుల ఎత్తులో యేదో ఆకారం వేగంగా కదుల్తోంది; తనవైపు. అల్సేషియన్! మనోజ్ గుండె వేగంగా కొట్టుకోడం ప్రారంభించింది. కుక్కకి తన ప్రతి కదలికా చక్కగా కనిపిస్తుంది.

మనోజ్ మెల్లిగా, మెల్లిగా కిందికి వంగాడు. ఎడం చేతిని బాగా ముందుకి చాచాడు. అతని జేబులో కుడి చేతివేళ్ళు ఉద్రేకంతో కదుల్తున్నాయి. అల్సేషియన్ వొగర్చడం అతనికి స్పష్టంగా వినిపిస్తోంది.

మూడడుగుల దూరంలో వేగం తగ్గించిన అల్సేషియన్ చిరుతపులిలా అతనివేపు లంఘించింది. తన గొంతుక వైపు దూసుకొస్తున్న అల్సేషియన్ మూతికి నేరుగా ఎడమచేతిని కదిల్చాడు మనోజ్. అల్సేషియన్ పళ్ళ మధ్య అతని ఎడమచెయ్యి ఇరుక్కుంది.

అదే క్షణంలో అతని కుడిచెయ్యి జేబులోంచి ఇవత

తలికి సాకింది. అరచెయ్యి ఆల్సేషియన్ ముక్కు మీద అలిచిప్పలా కప్పింది. మనోజ్ అర చేతికీ, ఆల్సేషియన్ ముక్కుకీ మధ్య క్లోరోఫామ్‌తో తడిపిన రుమాలు నలుగుతుంది. మనోజ్ ఊపిరి పీల్చుకోవడం యెప్పుడో ఆపేశాడు....

చేతికి చుట్టిన గుడ్డ చుట్టూ బిగుసుకున్న పళ్ళు వదులవుతున్నాయి. ఆల్సేషియన్ మెల్లిగా గడ్డిమీదికి వాలింది. మనోజ్ రుమాలును కుక్క ముక్కుమీదే వదలేసి దూరంగా జరిగాడు. క్షణంలో ఎడమ చేతిని కప్పిన గుడ్డని వూడదీశాడు, జేబులో దోపుకున్నాడు. సాగిల పడిన కుక్క కాళ్ళని పట్టుకుని, లాక్కుంటూ వెళ్ళాడు. క్రోటన్ చాటున దాన్ని వదలేసి, చకచకా మెట్లవైపు అడుగులేశాడు.

రెండు ఆల్సేషియన్స్ వున్నట్టు తను తెలుసుకున్నాడు. రెండోది యెక్కడుంది? వేగంగా వినవస్తున్న మెత్తటి చప్పుడు అతని అనుమానాన్ని తీర్చింది. ఇరవై అడుగుల దూరంలో మరో నీడ తనవేపు పరుగెడుతూ వస్తోంది. మనోజ్ విగ్రహంలా అయిపోయాడు.

"రాకీ!" బంగళా ముందునుంచి బిగ్గరగా వినిపించిన కేక అతన్ని హడలగొట్టింది. "రాకీ, కమాన్!" మళ్ళీ అరిచారు ఎవరో.

మనోజ్ రెప్ప వేయకుండా చూస్తోన్నాడు. క్షణ కాలం తటపటాయించి రాకీ వెనక్కి తిరిగి పరిగెడుతూ మలుపు దగ్గర అదృశ్యమైంది.

మనోజ్ నిట్టూరుస్తూ కదిలాడు. రాకీని పిలిచి, తన ప్లాన్ని పాడుచేసిన వ్యక్తిని తిట్టుకుంటూ మెట్లవైపు

పరుగుతీశాడు. రెండు మలుపులు తిరిగిన మెట్లని వేగంగా ఎక్కేసి ఒక తలుపు ముందు ఆగాడు.

అతని ఎడమ అరచెయ్యి తలుపుమీద ఆనింది. నెమ్మదిగా, కొద్దిగా తలుపుని తోశాడతను. ఊహాతీతంగా, అతన్ని ఆశ్చర్యపరుస్తూ తలుపు తటాలున లోపలికి జరిగింది!

• • •

మనోజ్ మెదడులో యేదో మెరిసింది. చేత్తో తాకగానే తలుపు బార్లా తెరుచుకోదు....

“వెల్‌కమ్!” అందో కంఠం ఎగతాళిగా.

తలుపు స్థానంలో ప్రత్యక్షమైన ఆకారాన్ని మనోజ్ ఆశ్చర్యంతో, ఆందోళనతో చూశాడు. రివాల్వర్ వున్న కుడిచెయ్యి తన ముందు లేకుండా, పక్కన వేళ్ళాడుతున్నందుకు అతను సంతోషించాడు. ఎదురుగా చీకటిలో నీడలా నించున్న ఆకారం చేతిలో వున్న ఆయుధం తనవైపే గురి చూస్తోందని అతను గమనించాడు.

మనోజ్ నిట్టూర్చాడు. అతని చేతిలోని రివాల్వర్ కొస పైకి లేస్తోంది; కదలిక తెలీకుండా.

“రివాల్వర్ కిందపడేయ్. చేతులెత్తు. తిక్కవేషాలేస్తే నా రివాల్వర్ తూటా నీ పొట్టని బరమలా చీల్చేస్తుంది!” నీడ హెచ్చరించింది.

మనోజ్ ఎడమచెయ్యి మెల్లిగా గాలిలోకి లేచింది. కుడిచెయ్యి రివాల్వర్ని పడేసే ప్రయత్నంలో కొద్దిగా కదిలింది. ట్రిగ్గర్‌ని అనుకుని వున్న చూపుడువేలు కదిలింది. చిన్నగా చప్పుడయింది. రివాల్వర్ కిందికి జారి, శబ్దం చేసింది. అదే క్షణంలో మనోజ్ ఎడమవైపుకి గెంతే

నవ్వు చిన్నగా వినిపిస్తోంది...

మనోజ్ చీకట్లో స్తంభంలాగా కాసేపు నిలబడ్డాడు.

నవ్వు యెక్కణ్నుంచి వస్తోంది? మెల్లగా గోడ వారగా జరిగాడతను. ఎడమచేత్తో తేలిగ్గా గోడని తడవసాగాడు. సిమెంట్ గోడ నునుపుగా తగుల్తోంది....

చేతికి అందినంత మేర తడివి, మనోజ్ కొంచెం ముందుకి జరిగాడు. గోడని స్పృశిస్తూ అతని అరచెయ్యి కొంచెం దూరం జరిగి ఆగింది. ఇందాకటి స్పర్శలో, ఈ క్షణంలోని స్పర్శలో తేడా తెలుస్తోందతనికి. అరచేతికింద, చల్లదనం యిందాకటికన్నా యెక్కువగా వుంది ఇందాకా తను అరచేత్తో గోడని తాకాడు. ఇప్పుడు గోడతో సమానంగా వున్న లోహాన్ని తాకుతున్నాడు!

లోహంతో తయారుచేయబడిన తలుపుముందు తనున్నట్టు మనోజ్ అర్థం చేసుకున్నాడు. గోడని లోహం కలుస్తున్న చోట వుండే అతుకుకోసం అతని వేళ్ళు జాగ్రత్తగా తడిమాయి. స్పర్శలో తేడా తప్ప, మరో తేడా అతని చేతికి తగలలేదు. గోడలో తలుపు వున్నా, సులభంగా కనిపించకుండా వుండేలా యేర్పాటు చేయబడిందా? 'ఎయిర్ టైట్'గా వున్న తలుపుగుండా తనకు లోపలి నవ్వు యెలా వినిపించింది? మనోజ్ క్షణంలో ఒక నిశ్చయానికి వచ్చాడు.

కొనగోళ్ళతో మెల్లగా తట్టాడు. లోహం చప్పుడు సన్నగా వినపడింది. పక్కన తట్టాడు. శబ్దం డల్‌గా వుంది. కాంక్రీట్ గోడ....

లోహ భాగంమీద అరచేతిని వుంచి మెల్లగా తోశా

శాడు.

కానీ అతను ఊహించినట్టు జరగలేదు. ఆ వ్యక్తి చేతిలోని రివాల్వర్ పేలలేదు. రివాల్వర్ చప్పుడికి బదులుగా అరచేత్తో శరీరంమీద చరుచుకున్న చప్పుడయింది. తన గురి తప్పలేదు! రివాల్వర్ కి ఫిక్స్ చేసిన డార్ట్ ఆ వ్యక్తి మెడ ప్రాంతంలో గుచ్చుకుంది!

ఉద్రేకంతో మనోజ్ ముందుకి ఉరికాడు. శక్తివంతమైన డార్ట్ మూలంగా, ఏమాత్రం ఆలస్యం లేకుండా అతనికి స్పృహ తప్పింది! కూలిపోతున్న ఆకారాన్ని రెండు చేతుల్తో ఆపాడు. అలాగే లాక్కెళ్ళి గోడవారగా పడేశాడు. అతని చేతిలో ఇరుక్కున్న రివాల్వర్ని తీసి బెల్టులో దోపుకున్నాడు.

చకచకా అతని జేబులు గాలించాడు. రెండు తాళం చెవులున్న రింగ్ ని తీసి తన చొక్కా జేబులో పడేసుకున్నాడు. ఆ తాళాలు యెందుకు పనికొస్తాయో ప్రస్తుతం తనకి తెలీదు....

గుమ్మం ముందు పడున్న తన రివాల్వర్ని అందుకుని తలుపు మూసి మనోజ్ ముందుకు కదిలాడు. పొడుగాటి నడవమ్మట నడుస్తూ చెవులు రిక్కించాడు. ఇందాకటి ఆడ్వెంచర్ పుట్టించిన కంగారుతో నాలుక ఎండిపోయినట్టుంది. జేబులోంచి పెప్పర్ మెంట్ బిళ్ళతీసి నోట్లో దోపుకున్నాడు.

నడవ చాలా పొడుగ్గా వుంది. దూరంగా, చివర మసగ్గా వెలుతురు అవుపిస్తోంది. తనకి వున్నది ఆదొక్కటే దారి. పనయ్యేదాకా, దారి యెటుంటే తను అటు వెళ్ళాల్సిందే! మనోజ్ మరో పది అడుగులు నడిచాడు. తటాలున ఆగాడు. ఎడమవైపు నుంచి యేదో

డతను. ఏ మాత్రం శబ్దం కాకుండా తలుపు లోపలికి జరిగింది. ఊపిరి బిగబట్టి చేతిని ఇంకొంచెం తోశాడు. మసక వెలుతురులో లోపల్నుంచి అవుపించిందతనికి. అతని చేతి వొత్తిడితో తలుపు మరికొంచెం కదిలింది. జాగ్రత్తగా కంటిని అన్చి లోపలికీ చూశాడతను....

“వచ్చేయి భగవాన్, టైమ్ వేస్టు చేస్తున్నావ్!” లోపల్నుంచి యెవరో పిలిచారు. ఎదురుగా గోడవారగా వున్న టేబుల్ ముందు యిద్దరు కూచున్నారు. తమ అనుచరుడు భగవాన్ని పిలుస్తున్నా డొకతను. తను అవతలి గదిలో నిద్రపుచ్చిన వ్యక్తి భగవాన్ అయ్యుండాలి. మనోజ్ ధైర్యంగా తలుపును అరడుగు దూరం తోశాడు....

ఇద్దరు వ్యక్తులు డ్రింక్ తాగుతున్నారు. టేబుల్ మీద వెలుగుతోన్న కొవ్వొత్తి వాళ్ళని నీడల్లా చూపిస్తోంది....

“నేను చెప్పానా? ఎవ్వడూ రాలేదు. రాకీ, లైకా కాంపౌండ్ లోకి అడుగెట్టిన వాణ్ణి పీలికలు చేసేస్తాయ్! నువ్వు అనవసరంగా కంగారుపడుతున్నావ్! బాటిల్ ఖాళీ చేద్దాం త్వరగా, కమాన్!” రెండో వ్యక్తి నవ్వుతూ అన్నాడు.

ఇద్దరూ తలుపువైపు ఇంకా తిరిగి చూడనందుకు మనోజ్ ఆశ్చర్యపోతూ తలుపుని ఇంకొంచెం తోశాడు. టేబుల్ చివర ఇద్దరు కూచున్నారు. ఇద్దరి చేతుల్లోనూ గ్లాసులున్నాయి. వాళ్ళముందు టేబుల్ మీద రెండు ప్లేట్లూ, ఒక బాటిల్, వాటర్ జగ్ వగైరా సరంజామా వుంది.

టేబుల్ చివర వున్న వస్తువులమీద మనోజ్ దృష్టి

కేంద్రీకరించబడింది. రెండు రివాల్వర్లు, డాలుమీద కత్తుల్లా ఒకదానిమీదొకటి పడేయబడి వున్నాయి. తన వేపు తిప్పి కూచున్న వ్యక్తికి ఎడమ చేతికి అవి దగ్గరగా వున్నాయి.

మనోజ్ మెల్లిగా అడుగులేయడం ప్రారంభించాడు. తలపైకెత్తి గ్లాసులోని ద్రవాన్ని నోట్లో వొంపుకుంటున్నాడు మొదట తనని లోపలికి రమ్మన్న వ్యక్తి. మనోజ్ కుడిచెయ్యి పైకి కదిలింది. రెండో వ్యక్తి కళ్ళు చిట్లిస్తూ తనవేపే చూస్తున్నాడని అతనికి తెలుసు. మనోజ్ తలుపునుంచీ వాళ్ళదాకా వున్న దూరంలో సగందాకా నడిచాడు.

క్షణంలో మనోజ్ చూపుడువేలు డార్టుగన్ ట్రిగ్గర్ని నొక్కింది. ఆ వ్యక్తి తటాలున తన మెడమీద ఎడమ చేత్తో చరుచుకున్నాడు. తన గురి తప్పలేదని మనోజ్ గ్రహించాడు. నాలుగు అంగల్లో టేబుల్ని సమీపించాడు. ఆ వ్యక్తి బలంగా టేబుల్ మీదికి వాలిపోయాడు. అతని తల తగిలి గ్లాసు చప్పుడు చేస్తూ పగిలింది.

అతని అనుచరుడు కంగారుగా చూశాడు. అతని చూపులు మెల్లిగా మనోజ్ వైపు తిరిగాయి. మనోజ్ టేబుల్ దగ్గరగా ఆగాడు. ఆ వ్యక్తి కంగారుగా కదిలాడు. అతని చెయ్యి రివాల్వర్లవైపు సాగింది.

• • •

“కదిల్తే కపాలం పగుల్తుంది!” మనోజ్ కంఠం అతని చేతిని మధ్యలో స్తంభింపజేసింది.

“నిలబడి, చేతుల్తో గది కప్పుని అందుకో!” మనోజ్ ఆజ్ఞాపించాడు. అతని చేతిలోని రివాల్వర్ కదలిక లేకుండా వుంది.

ఆ వ్యక్తి మెల్లిగా లేచాడు. అతని చేతులు పైకి లేచాయి. అతని కళ్ళు చింతనిప్పుల్లా మనోజ్ చేతిలోని రివాల్వర్‌ని క్షణకాలం చూశాయి. మెల్లిగా చూపుల్ని మనోజ్ ముఖం పైకి మళ్ళించాడతను,

"దారితప్పి వచ్చినట్టున్నావ్. కళ్ళు మూసుకుంటాను. తిరిగిచూడకుండా వెళ్ళిపో!" అన్నాడతను బొంగురుగా.

మనోజ్ అతన్ని చూస్తూ చిన్నగా నవ్వాడు. "దారి తప్పిరాలేదు—మిత్రమా, వెతుక్కుంటూ వచ్చాను...." అంటూ టేబుల్ మీదున్న రివాల్వర్‌ని ఎడంచేత్తో అందుకని బెల్టులో దోపుకున్నాడు. అతని చేతిలోని రివాల్వర్ కొస తటాలున ఆ వ్యక్తి పొట్టకి మొరటుగా ఆనింది.

"ఇందాకా కళ్ళు మూసుకుంటానన్నావ్. శాశ్వతంగా కళ్ళు మూసుకునే ఉద్దేశం లేకపోతే, చెప్పినట్టు చేయాలి!" ఆ వ్యక్తి కళ్ళలోని విస్కీ మత్తును మింగేస్తూ ప్రత్యక్షమవుతున్న కంగారుని చిరునవ్వుతో చూస్తూ ఆగాడు మనోజ్. ఆ వ్యక్తి బరువుగా ఊపిరి పీల్చుకున్నాడు. రివాల్వర్ కొన అతని పొట్టలోకి మెత్తగా దిగింది.

"వాళ్ళిద్దర్నీ యెక్కడ దాచారు?" మనోజ్ తగ్గు స్వరంలో ప్రశ్నించాడు. నాలుకతో పెదవుల్ని తడుపుకున్నాడు.

మనోజ్ రివాల్వర్ని గునపంలా గుచ్చాడు. బాధతో అతను పళ్ళు ఇకిలించాడు. మనోజ్ అతన్ని కర్కశంగా చూశాడు. అతని యెడమచెయ్యి పాంటు జేబులోకి దూరింది.

"కుడి అర చేతిని నెమ్మదిగా టేబుల్ మీద పెట్టు!"

మనోజ్ ఆజ్ఞాపించాడు. ఎదురు మల్లిక్ క్రతో పాడుతున్నట్టు. రివాల్వర్‌తో అతన్ని పొడుస్తూ. కిడ్నీలోంచి పొంగుకొస్తున్న నొప్పిని పళ్ళ బిగువుతో భరిస్తూ అతను అరచేతిని బల్లమీద ఆన్చాడు.

"ఎడమ అరచేతిని కుడిచేతిమీద బోర్లించు!" మనోజ్ కంఠం పిస్టల్ షాట్‌లా వుంది. అతని ఎడమ చెయ్యి పుట్టలోంచి ఇవతలికి పాకుతున్న పాములా మెల్లిగా కదుల్తోంది.

అర్థంకానట్టు, అయోమయంగా చూస్తూ ఆ వ్యక్తి మనోజ్ చెప్పినట్టే ఎడమ అరచేతిని కుడిచేతిమీద బోర్లించాడు. చెమటలు కమ్ముతున్న మొహంతో ప్రశ్నార్థకంగా చూడసాగేడు.

మనోజ్ అతని కళ్ళల్లోకి తీక్షణంగా చూశాడు. క్షణంలో అతని చెయ్యి జేబులోంచి ఇవతలికి వచ్చింది. కత్తి మెరుపులా ఆ వ్యక్తి ఎడమ చెయ్యి వెనకభాగం మీద ఆనింది. ఉలిక్కిపడి అతను కిందికి చూశాడు. మనోజ్ పిడికిలి కత్తిపిడిచుట్టూ బలంగా బిగుసుకుంది.

అసంకల్పితంగా అతను చిన్నగా మూలిగాడు. అతని ఎడమచేతిమీద, కత్తి మొన కిందినుంచి రక్తం సన్నటి కాలువలా సాగుతోంది.

"నీలాంటి మొండివాళ్ళచేత పాట పాడించడం నాకిష్టం! ఈ కత్తి పదను గురించి నీకు తెలీదు. రెప్పపాటులో వెన్నలోంచి దూసుకెళ్ళినట్టు, నీ రెండు చేతుల గుండా దూరిపోయి టేబుల్‌లోకి దిగేస్తుంది! ట్రై చేద్దామా?" మనోజ్ నవ్వుతూ ఆగాడు. అతని రెండు చేతులూ ఒకేసారి కొద్దిగా కదిలాయి.

అప్రయత్నంగా ఆ వ్యక్తి వొగర్చాడు. "....వొద్దు! చెప్తాను ..." అతని కంఠం వణికింది.

"గుడ్. విభీషణ్, భారత్ యెక్కడున్నాడు?" మనోజ్ ప్రశ్నించాడు.

"చెప్పు తరవాత చూపించు! చెప్పినచోట వాళ్ళు లేకపోతే వాయిదాల పద్ధతిలో చేతులూ కాళ్ళూ తెగి పోతాయ్!" మనోజ్ హుంకరించాడు.

"నీల మాళిగలో...."

"అక్కడ ఇంకా ఎవరున్నారు?"

"ఎవ్వరూ లేరు...,అక్కడ వుండాల్సిన వ్యక్తి ఇందాకా బైటికెళ్లాడు...."

"బుల్ డాగ్ యెక్కడుంది?" మనోజ్ ప్రశ్నించాడు.

అతని కళ్ళల్లోంచి ఒక్కసారి ఆశ్చర్యం తొంగి చూసింది. "మెయిన్ గేటు దగ్గర...." అతను తటాలున ఆపేశాడు. చేతిమీదికి మెల్లిగా దిగుతున్న కత్తిని కంగారుగా చూశాడు.

"బుల్ డాగ్ యెక్కడుంది?" రివాల్వర్ మీద తన బరువుని అన్చుతూ మనోజ్ మళ్ళీ అన్నాడు.

"ప్లీజ్ .... వదలండి ... కత్తి ... చెప్తా...." అతని కంఠం వణికింది. "బిల్డింగంతా తిరుగుతూ వుంటుంది.... ఇప్పుడు ఎక్కడుందో తెలీదు...."

"కమాన్.... నీలమాళిగకి వెళ్దాం. రివాల్వర్ నీ డొక్కలో నొక్కుతూ వుంటుంది. పిచ్చివేషాలేస్తే పొట్ట చిల్లుపడుతుంది!" మనోజ్ కొంచెం దూరంగా జరిగి, అతని చేతులమీంచి కత్తిని తీసేశాడు.

ఆ వ్యక్తి రక్తం కారుతున్న చేతిని అప్రయత్నంగా

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 6 వ తేదీలోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా రిజిష్టరు లేదా బుక్ పోస్ట్‌లో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జూలై నెలల పత్రికలు మాత్రం V. P. ద్వారా పంపబడతాయి. దానికి మీరు అర్థ సంవత్సర చందా రు. 90/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము. పత్రికల ఖరీదుకు మించి మీరు పైసా చెల్లించ నవసరంలేదు.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా, గ్యారంటీగా అందుతాయి. ఇంకా నెలనెలా V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 1/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరటమే.

**పూర్తి వివరాలకై 'అపన' చూడండి!**

చొక్కామీద అదిమాడు.

"రెండు చేతుల్నీ తలమీద భద్రంగా పెట్టుకో!" మనోజ్ నిర్దాక్షిణ్యంగా ఆజ్ఞాపించాడు. రివాల్వర్ కొన అతని ఆజ్ఞని ఆ వ్యక్తి డొక్కలోకి చేరవేసింది. ఆ వ్యక్తి కంగారుగా రెండు చేతుల్నీ నెత్తిమీద పెట్టుకున్నాడు.

"పద!"

పళ్ళ సందులగుండా ఊపిరి లాక్కుంటూ ఆ వ్యక్తి కదిలాడు. యెడమవైపు తిరిగి పది అడుగులు నడిచి, గోడ ముందు ఆగాడు. ఇద్దరి నీడలూ గోడమీద తెరలుగా పడ్డాయి. ఆ వ్యక్తి కాలు ముందుకి కదిలింది. చదరంగం డిజైన్ లలో వున్న గచ్చుమీద పాకుతూ, నల్లగడిమీద ఆగింది.

మనోజ్ అతని బూటుకాల్ని జాగర్తగా గమనిస్తున్నాడు. బూటుకాలిమీద ఒత్తిడి కొద్దిగా ఎక్కువైంది. గోడలో కలిసిపోయిన తలుపు శబ్దం చేయకుండా పక్కకి కదిలింది.

"తలుపుని అలాగే వదిలెయ్!" మనోజ్ హెచ్చరించాడు.

ఒక్కక్షణం తటపటాయించి ఆ వ్యక్తి కదిలాడు. చీకటి నుయ్యిలా వున్న నేలమాళిగలోకి దిగసాగేడు. కాసేపట్లో కాళ్ళకింద మెట్లు మాయమయ్యాయి.

రెండునిమిషాల తరువాత, 'జడ్' ఆకారంలో వున్న సన్నటి నడవని తను దాటినట్టు మనోజ్ గుర్తించాడు. కళ్ళూ, చెవులూ అలర్టుగా తమ పనులు నిర్వర్తిస్తున్నాయి. హఠాత్తుగా మనోజ్ కళ్ళు మసక వెలుర్ని యెదుర్కున్నాయి, నడవ చివర ఆగాడు, ఆ వ్యక్తి.

అతని డొక్కలో ఇంకా గుచ్చుకునే వున్న రివాల్వర్ మీద వొత్తిడి యెక్కువచేస్తూ మనోజ్ ముందుకి చూశాడు.

పదడుగుల దూరంలో, పెద్ద హాలు మధ్యలో పంజరంలా నాలుగువైపులా కటకటాలతో నిర్మించబడిన సెలు, రెండు పెద్ద కొవ్వొత్తుల కాంతిలో అతనికి కనిపిస్తోంది. కటకటాలు కాంక్రీటు ఫ్లోర్‌లోకి, కప్పులోకి దించబడి వున్నాయి. మధ్యలో, గొళ్ళేనికి పెద్దతాళం వేళ్లాడుతోంది.

రెండు మానవాకారాలు పంజరంలో పడున్నాయి. చిరిగిపోయిన దుస్తులు. చిందరవందరగా వున్న క్రాపులు. మాసిన గెడ్డాలు. నాలుగు ఎర్రటి కళ్ళూ, తమవైపు చూస్తున్నాయి. ఆ కళ్ళల్లో విపరీతమైన భయం కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది.

“తాళం తెరు! పద!” మనోజ్ అతని చెవిలో హెచ్చరించాడు.

“తాళం.... నా దగ్గరలేదు. భగవాన్ దగ్గరుంటుంది....” ఆ వ్యక్తి తడబడుతూ అన్నాడు. ఏదో భయంతో అతని కంఠం వణుకుతున్నట్టు మనోజ్ గుర్తించాడు. మొదట తనని అటకాయించి, ‘వెల్ కమ్!’ అన్న వ్యక్తి జేబులోంచి తను తీసుకున్న తాళంచెవిని, ఎడం చేత్తో జేబులోంచి తీశాడు మనోజ్. ఆ వ్యక్తి నిజమే చెప్తున్నాడా?

“భగవాన్ జేబులోని తాళంచెవి ఇదే. దీంతో ఆ తాళం తెరవకపోతే గూబ పగులుతుంది! ఇదిగో తాళం తెరు!” అంటూ మనోజ్ తాళంచెవిని ముందుకు చాచాడు. “కుడిచెయ్యి మాత్రం కిందికి దించు!”

"నాది....ఎడమ చెయ్యి వాటం...." ఆ వ్యక్తి మెల్లిగా అన్నాడు.

మనోజ్ క్షణకాలం అనుమానిస్తూ ఆగాడు. అతను యేదేనా నాటకం ఆడుతున్నాడా? నిజమే చెప్తున్నాడా?

"ఆల్ రైట్, ఎడమ చెయ్యి దించు!"

ఆ వ్యక్తి ఎడమ చెయ్యి కిందికి దిగింది. మనోజ్ కొంచెం కదిలాడు. వణుకుతున్న ఆ వ్యక్తి ఎడమ చెయ్యి తాళం చెవిని అందుకుంది.

"ఊఁ, కానియ్!" మనోజ్ రివాల్వర్ని ములుకర్రలా ఉపయోగించాడు. వశంతప్పి, అటూ ఇటూ కదులుతున్న తాళంచెవి, తాళంలోకి దూరింది. అతని చెయ్యి కొద్దిగా కదిలింది. తాళం క్లిక్కుమంది.

మనోజ్ చెయ్యి మెరుపులా కదిలి, కొమ్మని నరుకుతున్న కొడవలిలా ఆ వ్యక్తి మెడమీద బలంగా దిగింది. మనోజ్ దూరంగా జరిగాడు. ఆ వ్యక్తి చెట్టులా కిందికి కూలిపోయాడు.

మనోజ్ అటూ ఇటూ చూశాడు.

రెండువైపులా మెట్లు పైకి వెళ్తున్నాయి. తను వచ్చిన దారి కాకుండా ఈ పంజరంలోకి రెండు మార్గాలున్నాయి. ఆ మార్గాలు యెక్కడికి తీసుకెళ్తాయో తనకి తెలీదు. వచ్చిన దారమ్మట వెళ్ళిపోడం మంచిది!

* * *

మనోజ్ తాళాన్ని లాగి, గొళ్ళెం తీసి, బోను తలుపు తెరిచాడు. నాలుగు కళ్ళు అతన్ని ఆశ్చర్యంతో చూస్తున్నాయి. మనోజ్ బోనులోపలికి ప్రవేశించాడు.

(ఇంకావుంది)

